| | | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|---|
| పంచీకరణము, ఆంధ్ర తాత్పర్యసహితము | ... | 0 | 3 |
| శివకంఠమాలిక, సటీక | ... | 0 | 4 |
| నారదపురూరవసంవాదము, పద్యము | ... | 0 | 3 |
| మహావాక్యదర్పణము, ఆంధ్ర తాత్పర్యము | ... | 1 | 8 |
| మహావాక్యరత్నావళి ,, | ... | 2 | 8 |
| వాసుదేవమననము, తెనుఁగువచనము | ... | 1 | 8 |
| వ్యవహారపంచకము, సాంధ్ర తాత్పర్యము | ... | 0 | 2 |
| విచారచంద్రోదయము ,, | ... | 0 | 10 |
| వేదా[illegible] | ... | 0 | 6 |
| పదాము క్తి[illegible] జు | ... | 0 | 10 |
| సనత్సుజాతీ[illegible] | ... | 0 | 8 |
| శంకరవిజయ[illegible] | ... | 2 | 8 |
| శివగీతా, సాంధ్ర తాత్పర్యము, చిన్న సైజు | ... | 1 | 0 |
| వివేకచూడామణి, ఆంధ్ర తాత్పర్యసహితము | ... | 1 | 8 |
| రామగీతా ,, | ... | 0 | 8 |
| సౌందర్యలహరి, ఆంధ్ర టీకాతాత్పర్యము | ... | 0 | 8 |
| హఠయోగప్రదీపిక ,, | ... | అచ్చు | |
| శాంతివిలాసము, ఆంధ్ర తాత్పర్యసహితము | ... | 0 | 6 |
| శుకాష్టకము | ... | 0 | 2 |



## వైద్యగ్రంథములు

| | | | | |
|---|---|---|---|---|
| అనుపానమంజరి | | ... | 0 | 12 |
| అజీర్ణమంజరి | | ... | 0 | 4 |
| చరకసంహిత, సూత్రస్థానము | I | ... | 6 | 0 |
| ,, శారీర, ఇంద్రియ, నిదాన, విమానస్థానములు | II | ... | 5 | 0 |
| ,, చికిత్సాస్థానము | III | ... | 8 | 0 |
| ,, సిద్ధి-కల్పస్థానములు | IV | ... | 3 | 8 |
| వైద్యశతశ్లోకి | | ... | 0 | 6 |
| రాజమార్తాండము, ఆంధ్ర తాత్పర్యము | | ... | 0 | 10 |
| ఆయుర్వేదసారసంగ్రహనిధి | | ... | 3 | 0 |

# అవతారిక.



‘రత్నగర్భావసుంధరా’ యని పృథ్వీరమణి కలవడిన నామ్యమునకు సార్థకత్వమొసఁగి, సర్వసౌభాగ్యసంపన్నికేతనమై, రత్నప్రభాప్రవేష్టితమై, ధనదభండారమై, కల్పకవదృశమై, సస్యపూరితమై, భూరమణీశిరోమణియై దనరారుచు వాసికెక్కినభారతఖండము, కాలక్రమమున, కరాళకాల కఠోరకుఠారనిష్ఠురపరివర్తనమున కాకరమై, దారిద్ర్యదేవతకు కేళీగృహమై, నిజసంతానములో నధికాంశమునకుఁ గడుపు నిండ నన్నమిడుసామర్థ్యమునకు దూరగతమైన దయ్యెను. భారతమాత కలవడినదుర్దశామాహాత్మ్య మెంతటి దారుణమైనదియో, కాని, యయ్యది ప్రాచీనమునుండియుఁ బారశీక, గ్రీకు, పఠాను, మొగలాయిమహా-రాజాతీయవీకుల దురాశాపైశాచికావక్రదృష్టికిఁ గుఱియొనర్చి, మాటిమాటికి వారి వారి ప్రచండాక్రమణరూపకప్రళయములకుఁ బాలుగావించి, యనంతస్వర్ణరత్నధనరాసులఁ బోనడచుటయే కాక, పరాధీనతఁగూడ నొడఁగూర్చెను. ఆయాక్రమణ నాయకులలో ప్రళయకాలసదృశుఁ డనఁదగి, గజనీమహమ్మదు మిగులఁ బ్రసిద్ధిఁగాంచినవాఁడు. ఆదుర్ధర్షాజయవీరుఁ డత్యంతధనాశచే, స్వమతవ్యాపనోన్మాదముచే, కడుంగడు పీడింపఁబడి క్రీ. శ. పదునొకండవశతాబ్దములోఁ బదునేడుసారులు భారతమాతఁ

దలఁపడి తత్సంతానరుధిరవారాన్నిధిఁ గూలఁ ద్రోచి, యామె
వికాసమునకు శాశ్వతకళంక మొదఁగూర్చెను. ఆనిష్ఠురవర్తనుని
మహాహత్యాకాండము భారతీయుల స్వాచ్ఛ్య. సౌభాగ్యవిలాస
చంద్రికలమనోహరకాంతులను, ప్రళయకాలసన్నిభనీలజీమూ
తాచ్ఛాదితమై మాయింపఁ జేసి, భారతభూమి ఘోరదుర్దశ
దారిద్ర్యాంధకారనిమగ్నఁ గావించెను. ఆతఁడు పంజాబుదేశ
మును గజనీరాజ్యమునఁ జేర్చి యందొకరాజప్రతినిధిని నెల
కొలిపినవాఁడు. అదిమొదలు భరతఖండము కొంచెమించు
మించు ఏడునూర్లసంవత్సరములు యవనవీరుల విలోలవక్రదృ
ష్టికిఁ గుఱియై, వారిదురాచారములకు లోనై, పెక్కులిడు
ములు కుడిచినదయ్యెను. కాలగతి ననుసరించి గజనీవంశ మంత
రించెనయది. అయిన నేమి? వెనువెంటనే గోరీవంశీయమహ
మ్మదు, గజనీమహమ్మదువలెనే ధనాశఁ దగులుకొని పలునా
రులు విధితవిమర్దితభారతమాతఁ దలఁపడియెను. ఇంతవరకు
భారతీయులు రణనిపుణతేజోసమన్వితులై, నవాభ్యుదితము
సల్తానువీరుల బలపరాక్రమముల కొక్కింతయైన హీనతఁ గాని,
క్షీణతఁ గాని గనియుండలేదు. కాని, వారివలె నవోద్యమము,
నూతనరాజ్యాక్రమణము, విదేశవిజయోత్సాహము మొదల
గునవిమాత్రము వారియెడఁ బొడసూపక, కేవల మాత్మరక్షణ
మార్గావలంబనమె ప్రధానముగఁ బరిగణింపఁబడియుండె.
అట్లయ్యును, మహమ్మదుగోరి, పలునారులు హైందవవీరులచేఁ
బరాజితుఁడయ్యె. ఆకాలములో పృథ్వీరాజు, జయచంద్రులు
ఢిల్లీకనోజదేశములకుఁ బాలకులై హైందవరాజులలో ప్రము
ఖులై యొప్పియున్నవారు. వారిరువురకుఁ బరస్పరము వైష-

మ్య ముదయమైనందున, జయచంద్రుఁడు పృథ్వీరాజుఁ బ్రతిఘ
టించి గోరీపక్షముఁ జేకొనినవాఁడు. ఆకారణమునలన, మహా
మ్మదుగోరి క్రీ. శ. 1193-సం. రములో పృథ్వీరాజుఁ బొరిగొని,
విజయచిహ్నముగ హిందూస్థానమందు, అర్ధచంద్రాంకితపతా
కమును నెలకొలుపుటకే కాక, ముసల్మానుసామ్రాజ్యమును
స్థిరరూపకముగఁ బ్రతిష్ఠింప సమర్థుఁ డయ్యెను.

క్రీ. శ. 1310-వ వత్సరపర్యంతము యవనాధికార మా
ర్యావర్తముననే నిబద్ధమయియుండెను. అనంతరము యవన
లౌల్యదృష్టి దక్షిణహిందూస్థానమువంకకు మరలెను. ఆకాల
ములో జలాలుద్దీను ఖిల్జీ డిల్లీసింహాసనమున విరాజితుఁడై యు
న్నవాఁడు. ఆతనియన్నకుమారుఁ డల్లాఉద్దీను ఖిల్జీ తన కపట
మండితకూటనీతిబలవిశేషమువలన సహజసదయాసరళహృదయ
సంపదలచే విరాజిల్లుచున్న మహారాష్ట్రుల స్వాతంత్ర్యసామ్రా
జ్యమును హరింపనుకట్టెను. ఆకాలములో దేవగిరినాయకుఁడు
రామచంద్రదేవు, ఆతనిజామాత హరిపాలదేవు అను నిరు
వురు వీరులు నిరువదిసంవత్సరములు తమ స్వాతంత్ర్యసామ్రా
జ్యము మహమ్మదీయుల బారికిఁ గుఱికాకుండ సంరక్షించిరి.
అనంతర మావీరద్వయము పరలోకయాత్ర గకెగె. అయినను
స్వాతంత్ర్యప్రియులగు తదితరమహారాష్ట్రసామంతులు తమ
స్వాతంత్ర్యమునకుఁ జలాంజలి నొసంగ నొల్లక ధైర్యావలం
బులై యథాసాధ్యముగ యవనవీరుల నెదిరించి పోరియుండిరి.
అయిననేమి! విధివిపరీతమార్గ మవలంబించి యుండినందున.
క్రమక్రమముగ క్షీణదశకుఁ బాలగుచున్న మహారాష్ట్రమండ
లము, దినదినాభివృద్ధిఁ గనుచున్న యవనపరాక్రమము నతి

క్రమింప నసమర్థమయ్యె. అంత యవనవీరులు మాటి మాటికి దేశము నాక్రమించుచు నందలి స్వర్ణరత్నధన రాసుల నపహరింప నారంభించిరి. ఆయాక్రమణపరంపరయే కాలాంతరమున దక్షిణదేశములో మునల్మానుల యప్రతిహతాధిపత్య నిదర్శనరూపముగ "బహమని" రాజ్యము క్రీ. శ. 1347-వ సంవత్సరములో స్థాపితమయ్యెను. అందు మహారాష్ట్రప్రదేశ మిమిడియుండెను. ఆరాజ్యాధిపతులు సులతానులు. 175-సంవత్సరములు మహారాష్ట్రదేశముం బాలించిరి. అనంతరము బహామని రాజ్యము అయిదుస్వతంత్రరాజ్యములుగ విభజింపంబడియె. ఆయైదురాజ్యములసులతానులు, ప్రత్యేకముగ తమతమబలాధిక్యతలం బ్రకటించుచు నూరుసంవత్సరములు మహారాష్ట్రదేశమునే కాక, తదితరదక్షిణదేశములం గూడ, తమతమయాధిపత్యములకు లోనొనర్చుకొనిరి. ఎట్లైననేమి! మొత్తముమీఁద, మహారాష్ట్రము, దక్షిణహిందూస్థానము రమారమి మూఁడువందలసంవత్సరములు బహామనీవంశీయులపాలనమునం దిమిడియుండెను. ఆదీర్ఘవ్యాపకమగు మునల్మానులక్రూరశాసనమునకు లోనైనమహారాష్ట్రమాదిగాఁగల దక్షిణదేశాంతర్గతప్రదేశములు విలుప్తసనాతనవిద్యాధర్మములైనవయ్యె. అందలి దేవమందిరములు మసీదులుగను, తీర్థసంతతులు, పుణ్యక్షేత్రములు మునల్మానుదురాచారములకు నిలయములుగను పరివర్తమానములయ్యె. హింసావిరతులగు హైందవులకు వాసస్థానమైన హిందూస్థానము హింసారతులును క్రూరకర్మటులును నగుయవనులకు నిలయమై యవనస్థానముగఁ బరిణమించెను. ఆకాలములోని కవికులశేఖరుఁ

డాకఁడు స్వదేశమున కలవడినదుర్దశఁ గని మిగుల దుఃఖించు
చు తనదుఃఖమును గ్రంథస్థమొనరించెను.

శ్లో. "అవనా వతీతపుణనాశ్వలోభితా భవనాగశాయిభవనావమర్దినః,
సవనాదికర్మలవనాయ దీక్షితా యవనా శ్చరంతిభువనాతిభీషణాః."

విశ్వగుణాదర్శము.

"హైందవులధర్మములను లోపమొనర్చుటకై యవనుల భీషణాదుర్జయతురగసేనాసమూహము భైరవాకారము దాల్చి హిందూస్థానమందలి దేవమందిరములను భూగత మొనర్చుచుండె" ఇత్యాదిశ్లోకములతో తనదుఃఖమును లేఖినీముఖమున వెడలఁగ్రక్కినను తపోనిరతుఁడగు రామదాసస్వామికూడ, దేశమున కలవడినదారుణదుర్దశాతిశయమును హృదయవిదీర్ణమగు నటుల "యవనులనేకదినములనుండి యత్యంతదురాచారముల నొనర్చుచుండిరి. వీరిగర్వమును ఖర్వమొనరింపఁగలవీరులీసమయమందేరునుఁ బొడఁగట్టుట లేదు. వీరిదుర్వర్తనము దేవబ్రాహ్మణోచ్ఛేదకసంఘటితమై వరలుచుండె. సనాతనధర్మకర్మముల నడుగంటఁజేయుచుండె. భగవన్నామసంకీర్తనమునకు విలోపమాపాదించుచుండె. పుణ్యప్రదములగు తీర్థక్షేత్రములను విధ్వస్తముగావించుచుండె. పూజనీయులగు బ్రాహ్మణుల వాసస్థానములనపవిత్రమొనర్చుచుండె. హైందవధర్మముల దూరగతమొనర్చుచుండె. అందువలన దేశము విప్లవభూయిష్ఠమయ్యె. పాపటలపరాక్రమము ప్రచండమగుచుండుటవలన, బలహీనమగు ధార్మికగణము క్రూరకర్ములకు వెఱచి యంతర్గానమయ్యె. బ్రహ్మక్షత్రియవైశ్యసంతతులు నిజసాంప్రదాయచిహ్నితమగు తిలకధారణముఁ బరిత్యజించి, యవనాజ్ఞలను శిరోధార్య మొన

రించి పాలింపఁదొడఁగిరి. ధర్మకర్మనిష్ఠాపటిష్ఠు లుచ్ఛిన్నస్థాను లగుచుండిరి. క్రూరకర్మిష్ఠులు, యవనులు వీతబలులగు హైందవులను, దురాచారములకు దుర్భావములకు గుఱియొనర్చుటయేకాక, దుర్గతికులుగఁ జేసి నిధనమొనరించుచుండిరి" అని వర్ణించియుండె.

17-వ శతాబ్దములో హిందూదేశము విపులవిపద్దశకుఁ బ్రస్తుతమై యుండె. మహోద్ధతమహిమామండితమొగలాయీసేనాజనితప్రచండప్రభంజనప్రవేగ మీదేశమందలి గ్రామనగరప్రదేశములను సంపూర్ణముగ నాశమొనరించి ఘోరాకారముఁ దాల్చి నలుగడల నిరాఘాటముగ సంచరింపఁజొచ్చె. అట్టిధ్వస్తవిధ్వస్తసమయమందు క్రీ. శ. 1604-వ సంవత్సరములో దేశోద్ధారకుఁడును, స్వరాజ్యసంస్థాపకుఁడును, యవనమత్తగజాంకుశుఁడును, భారతదేశీయవీరేంద్రచూడామణియు నగుఛత్రపతి శివాజ మహారాష్ట్రదేశమందు జననమొందెను. ఆతని సాహసపరాక్రమము లద్వితీయములు. ఔరంగజేబు, ఆవీరవర్యుని నామమును వినినమాత్రమున నులికిపడుచుండువాఁడఁట. రాజ్యకాంక్షఁ దగిలి భ్రాతృనాశన మొనర్చిన యౌరంగజేబు క్రౌర్యమునకు బాలుకాకుండ కొంతవరకీదేశమును రక్షించిన దామహనీయునిపరాక్రమాతిశయమే. ఆతఁడు తన నిరుపమబలపరాక్రముల నద్వితీయుఁడై మహారాష్ట్రస్వాతంత్ర్యసామ్రాజ్యముఁ బ్రతిష్ఠించి యనంతరము పరలోకగతుఁ డయ్యె. శివాజీయనంతర మాతనిపుత్రు లాతఁడు ప్రతిష్ఠించినస్వరాజ్యప్రాధాన్యరక్షణమున కించుకంతలోపము నొసంగిరి. అంతట శివాజీ రెండవకోడలు 'తారావాంగి' అనువీరనారీమణి మహా

రాష్ట్రసింహాసనాధిరూఢులై యవనాక్రాంతమైన స్వరాష్ట్ర
మును చాలభాగ ముద్ధరించి మరల మహారాష్ట్ర ప్రతిష్ఠను నెల
కొలిపినయది. అంతకూటనీతివిశారదుఁడగు ఔరంగజేబు మహా
రాష్ట్రుల కంతఃకలహముల నుదయింపఁ జేసినఁగాని తత్స్వా
తంత్ర్యరాష్ట్రోచ్ఛేదనము సాధితము కానేరదని కృతనిశ్చ
యుఁడై, తనకడ చెఱఁబడియుండిన శివాజీపౌత్రుఁడు సాహూ
యనువానిఁ జెఱవదల్చి యాతనికి మహారాష్ట్రసింహాసనాధిప
త్యమొసంగె. దాన నౌరంగజేబునిశ్చయము ఫలోన్ముఖమగు
చిహ్నముఁ దాల్పఁదొడంగె. అంత సాహూ తారావాంగుల
కిరువురకును స్వరాష్ట్రాధిపత్యవిషయికవివాద మంకురింప, నిరు
వురు భీషణరణరంగమున నుపస్థితులైరి. ఆసమయము తగుస
మయమని తలఁచి మహారాష్ట్రవీరులలో కొందఱు స్వలా
భపరాయణులై, రాజద్వేషులై స్వాతంత్ర్యమును ఘోషిం
పమొదలిడిరి. కొందఱు సాహూపక్షమును, కొందఱు తా
రావాంగుపక్షమును స్వీకరించిరి ఇఁకఁ గొందఱు ముస
ల్మానుపక్ష మవలంబించిరి. ఒకవంక మహారాష్ట్రవీరులు
స్వస్వప్రాధాన్యప్రతిష్ఠాపరతంత్రులై భీషణకృపాణము ధరించి
యొండొరులతోఁ బోరొనర్చుచుండ, వేరొకవంక దురా
చారపరాయణులైన ముసల్మానులు తనయధికారము నం
కుశరహితమొనరింప నుద్యమించిరి ఈసంఘటనాసంఘర్ష
ణము దేశమున కలవరచినదుర్దశ యిట్టి దట్టిదని వివరింప నేరి
తరము! అట్టిదారుణదుర్దశాకబళితదేశమునందు, పదునెనిమిదవ
శతాబ్దాదిని యమోఘమయవనపాదుషాహీ శాసనోచ్ఛేదనప
టిష్ఠుఁడగు నసాధారణశక్తిసంపన్నుఁడగు మహాపురుషుఁడొకఁ

డవతరించెను. అది యొకవిస్మయకరవిషయము కానేరదు. అఘటనఘటనాసమర్థుఁడగు భగవంతుఁడు నిజభక్తునితో శ్లో. "ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే" యని వచియించి యుండెఁగదా! ఆయసాధారణప్రతిభామండితుఁడగు మహాపురుషుఁడు సహ్యపర్వతాంచలస్థితమగు కొంకణదేశములోని యొకకుగ్రామమందొకానొక సామాన్య బ్రాహ్మణవంశమునందు జననమొంది, తనయలౌకికపరాక్రమ విజడిత ప్రతిభాసామర్థ్యసంపత్ప్రభావమువలన మహారాష్ట్రమండలాధినాయకత్వమును గడియించినవాఁడయ్యె. సముద్రవలయవిభూషితభారతఖండమును విధర్ములగు యవనుల దాసత్వపాశమునుండి విముక్తినొనరించి. యఖండహైందవ సామ్రాజ్యప్రతిష్ఠాపనయు, నుచ్ఛిన్నప్రాయమైన యార్యధర్మసంస్థాపనయు నను కార్యద్వితయ మామహాతేజస్వియగు పురుషపుంగవుని జీవనప్రాధాన్యలక్ష్యములు ఆయద్వితీయప్రతిభామండితుఁడు, ఆమహాపరాక్రమసంపన్నుఁడు, అకాలకాలమందే కాలగాలమునకు లోనగుటవలననాతని యాప్సితములు పూర్ణరూపముగ సిద్ధిఁబొందనేరకపోయె; కాని యీమహాపురుషుఁడు తనయల్పజీవితములో హిందూస్థానమునంగల యనేకప్రదేశములలోని ముసల్మానువీరుల వీర్యమును దళనమొనర్చి గర్వమును ఖర్వమొనరించి శాసనమును దూరగతమొనర్చి, దక్షిణమునఁ దుంగభద్రాతీరము మొదలు ఉత్తరమున యమునాతీరపర్యంతము నిరంకుశహైందవసామ్రాజ్యమును ప్రతిష్ఠించి కీర్తనీయుఁడయ్యె. హైందవ వీరులలో నగ్రగణ్యతఁ బడసిన రాజపుత్రులయితిహాసమునందుఁ గూడ నిట్టియసాధారణోదాహరణము, నిట్టిమహిమాం

డితకార్యకలాపము నుదాహృతమైయుండ లేదు. అట్టియుపమా
రహితుఁడగు వీరవల్లరీవిరాట్టు, అట్టియద్వితీయబుద్ధిబలసంపన్నుం
డితుఁడు, ముసల్మాను శాసనకరాళ కాలదండవిమర్దిత హైందవదే
శమును నుద్ధరించుదుర్ఘటయత్నమును నిరాఘాటముగ సాధించి
చిరప్రణష్టమైన హైందవగౌరవప్రాధాన్యమును పునరుద్ధారణ
మొనరించిన యామహావీరుఁడు, ఆయువతారపురుషుఁడు,
ఆచిరస్మరణీయుఁడు వీరేంద్ర బాజీరావు పేష్వా. ఆతఁడు పేష్వా
లలో అద్వితీయుఁడు.

శివాజీపరవర్తులు, దక్షిణదేశమునందు, తమకు ప్రాప్తమయి
నప్రాధాన్యమును గొంతవరకు సంరక్షించుకొనఁగలిగిరి. కాని
తత్ప్రదర్శితమైన చౌతు లేక చౌతాయీపరివర్తనానుసరణమం
దసమర్థులై, యాతని యసదృశరాజనైతికచరిత్రమునకు వ్యాప
కప్రాశస్త్యముల నొసంగలేక పోయిరి. పిమ్మట బాజీరావు తన
బుద్ధిచాతుర్యమువలనను, శౌర్యపరాక్రమములవలనను, శివా
జీప్రదర్శిత చౌతుమార్గము నవలంబించి భరతఖండములోని
యధికారమును యవనులక్రూరశాసనమునుండి తొలఁగించి,
మహారాష్ట్రరాజచ్ఛత్రచ్ఛాయ నాశ్రయింపఁజేయ సమ
ర్థుఁడయ్యె.

బాజీరావునకుఁ బూర్వులగు మహారాష్ట్రనాయకులు గా
ని, తదితరరాజమహారాజులు కాని యీచౌతుపద్ధతిం బరిపాలన
మొనరింప గమకించుట లేదు. ఆతనిసమకాలికులు కూడ నీపద్ధతిఁ
బరిణామ మొనరించుతలంపు నూనుటకైన సాహసులు కాక
పోయిరి. బాజీరాయనిచరిత్రమం దీచౌతు ప్రవృద్ధవ్యాపక
మొకయసాధారణకార్యకలాపము. ఈచౌతుపరివర్తనము భార

తవర్షీయ చరిత్రమందు దపరిజ్ఞాతమైనవిషయము కాదు. బాజీరాయసియనంతర మొకశతాబ్దమైనపిమ్మట నీజయవీరులును సుప్రసిద్ధరాజనీతిజ్ఞులును నగు, ఆంగ్లదొరతనమువా రీచౌతుపద్ధతినే సమయోచితసంస్కరణపూర్వకముగ నవలంబించి భారతీయ చక్రవర్తిత్వపదమునకు భాజనులైరి. ఈపరివర్తనవిధానావలంబనము దొరతనమువారు, The system of Subsidiary Alliance, అనునామమున వ్యవహరించుచున్నారు. మహారాష్ట్రులు చౌతు అనునామమును వ్యవహరించిరి. ఆకాలములో దేశీయశాంతిని రక్షించుటకును శత్రువుల యాక్రమణమును నిరోధించుటకును సాధారణముగ రాజ్యాదాయములోని చతుర్థాంశము వ్యయమగుచుండెడిది. శివాజీ దోర్దండప్రయత్నము వలన మహారాష్ట్రమండలమునకు చౌతుపరిగ్రహణశాసనాధికారములు సంప్రాప్తమైనయవి. అందువలన మహారాష్ట్రసేంద్రబృందము దుర్బలప్రతివేశరాజ్యముల శాంతిసంరక్షణము, శాత్రవాక్రమణనిరోధము ననుభారద్వయము గ్రహింపనుర్థమైనదయ్యె. ఈభారద్వయనిర్వాహణమునకు ఆశ్రితరాజులరాజ్యదాయములో చతుర్థాంశము "చౌతు" ప్రాప్తమగుచుండెడిది. ఈచౌతురూపకనిర్ధారితార్థగ్రహణ మాశ్రితరాజ్యరక్షణార్థమై సమకూర్చినసైన్యమును పాలించుటకై చేకొను వేతనము కాని మరియొండు కాదు. ఈవిధముగ నర్థలాభమును బడసి సైన్యపాలనమున కగువ్యయభారమును లాఘవమొనరించుటకై యీసంకల్పనాచాతుర్యము, ప్రథమమున రాజనీతివిశారదుండగు శివాజీభోసలావలన నుద్భావితమయ్యెను. శివాజీ, చిరకాలము, బీజాపూరు గోలుకొండరాజ్యములరక్షణ

భారమును గ్రహించెద ననియు నందులకు వేతనరూపముగ చౌతుస్వత్వప్రాప్తిఁ బ్రసాదింపుఁ డనియుఁ దత్పాలకులఁ బ్రార్థించి యుండినవాఁడు. కాని, వార లాతనిప్రార్థనములోని యథార్థభావమును పరిగ్రహింపనేరక తత్పాలనమున కాలయాపన మొనరించిరి. పరిశిష్టమున క్రీ. శ. 1668 సం॥ రములో వీర విక్రముఁడగు డిల్లీశ్వరుని యాక్రమణ మాదక్షిణదేశపాలకు లగు నాయిరువురిసులతానులను విపదంబుధి గూలఁద్రోయ వా శిరమోఘవీరుఁడగు శివాజీపై స్వరాజ్యరక్షణభారమిడి తత్ప్రతిఫలముగఁ బ్రతివత్సరా మష్టలక్షముద్రలను చౌతురూపముగ నొసంగుటకు సంసిద్ధులైరి. అంత శివాజీ యాయిరువురి సులతానులకు సైన్యసహాయ మొసంగి వారిరాజ్యములను రక్షించెను. ఆదారుణవిపద్దశయందు బీజాపూరు, గోలుకొండ సులతానులు శివాజీసహాయ మలవఱుచుకొనియు సర్వనాశక మగు డిల్లీశ్వరుని యాక్రమణమునుండి నిజరాజ్యములను రక్షించుకొనుటకు సమర్థులైరి. ఈవిధముగ శివాజీకాలమందే హైందవముసల్మానుపాలకుల సమ్మతమున దక్షిణదేశములో చౌతుపద్ధతి కరరూపమున పరివర్తన మయ్యె.

చౌతురూపకకరగ్రహణము శాంతిరక్షణపరిశ్రామికవేతనరూపమైన దైనను, యథార్థముగ నాసామంతరాజ్యముల సన్నికటమున మహారాష్ట్రమండలము ప్రధానరాష్ట్రమై యితర రాష్ట్రములకడనుండి కరగ్రహణ మొనర్చుట కనువమరునని తలచియే శివాజీ యీనూతనపద్ధతినవలంబించినవాఁడు. ఈనూతనపద్ధతి చౌతుపరివర్తనము ఆత్మరక్షణోపాయమునకు వశవర్తియై ప్రతిష్ఠించినవాఁడనుటకు సందియము లేదు. అందులకు

1 ఈపరివర్తనమువలన పరరాష్ట్రములకడనుండి ప్రాప్తమగు కర రూపకాదాయము, స్వరాష్ట్రమునకు, సైన్యసామరికబలసమృద్ధిని వృద్ధినొనర్చుసందర్భమున సంభవమగు వ్యయభారమున లాఘవమొనర్చుటయు, 2. పరరాష్ట్రములన్నియు స్వరాష్ట్ర భుజబలమువలన రక్షితమగుచుండుసమయమందు స్వరాజ్య నిష్ఠాశంకితమాధారహీనమగుటయు నను హేతుద్వయము ప్రబలనిదర్శనము. ఆరాజనీతిప్రతిభామండితుఁడు, పరరాష్ట్రరక్షణ దాయిత్వగురుభారము గ్రహించి తత్ప్రతిఫలముగ నాయా రాష్ట్రాదాయములలోని చతుర్థాంశమును గ్రహించుటయందు కృతకృత్యతఁ బడయనినాఁడు, మహారాష్ట్రసామర్థ్యమునకు శ్రేష్ఠత్వము ప్రతిష్ఠింపఁబడనేరదని చక్కఁగ నెఱింగియుండినవాఁడు. మార్క్విస్ ఆఫ్ వెలస్లీ మహాశయుఁపరివర్తిత "సజీసిడి యరీసిస్టమ్" యానీతి ననుసరించియే నొప్పియున్నదని చదువరులు గ్రహియింపఁగలరు.

1600-సం. రములో వీరసమ్యుఁడగు శివాజీ కైలాసవాసముఁ గాఁగుటకుఁ బూర్వమే మహారాష్ట్రమండలము, దక్షిణ దేశములోని యావత్ హైందవమహమ్మదీయపాలకసమ్మేళనశక్తి సమ్మతమున పరరాష్ట్రరక్షణభారగ్రహణ మొనర్చి, తత్తదాదాయచతుర్థాంశమును గ్రహియించుపద్ధతికిఁ బద్ధమూలమై యొప్పియున్నదని చదువరులెఱుంగనివిషయముకాదు. శివాజీ మరణానంతరము ఢిల్లీసామ్రాట్టు ఔరంగజేబు, మహారాష్ట్ర వీరులకుఁ బ్రాప్తమయినగౌరవస్వాతంత్ర్యములను భగ్నమొనరింపయత్నమున నిసుమంతయు విరతిఁ గనుటలేదు; కాని స్వాతంత్ర్యప్రియులగు మహారాష్ట్రనాయకులు, మహమ్మదీ

యుల కధీనులగుటయందు పరాఙ్ముఖులై తమయసాధారణవిక్ర
మప్రతాపములచే జాజ్వల్యమానులై యౌరంగజేబుకృతయ
త్నముల భగ్నమొనరించిరి. మహారాష్ట్రులు స్వాతంత్ర్యసం
రక్షణాభిలాషమున నిరువదిసంవత్సరములు ఢిల్లీశ్వరునితో
హోరాహోరిఁ బోరొనర్చి తమస్వాతంత్ర్యమును సంపూర్ణ
ముగ నిలువఁబెట్టుకొనిరి. ఢిల్లీశ్వరుఁడు మహారాష్ట్రస్వాతం
త్ర్యమును స్వీకరించి తదనుకరణముగ వారలకుఁ బ్రమాణపత్ర
ము(ఖన్నదు)ను సమర్పించినవాఁడు. అంతియకాదు. దేశమంద
లి యశాంతినివారణాభిలాషప్రేరితుఁడై యా యజేయవీరులకు
దక్షిణదిక్స్థిత మొగలాయిశాసితప్రదేశములనుండి 'సరీదేశ
ముఖి' రూపక (సమస్తరాజ్యాదాయములో దశమాంశము) కర
గ్రహణాధికారస్వత్వప్రదాన మొనర్చుటకుఁ గూడ బాధ్యుఁ
డయ్యెను. అంతమాత్రమున మహారాష్ట్రనాయకులు పరి
తృప్తిఁ గనులలేదు. ఈసర్ దేశముఖిరూపకాదాయము గ్రహిం
చి దక్షిణదిక్స్థితపాదుషాహిశాసితప్రదేశముల శాంతిరక్షణభా
రము గ్రహించుట కంగీకరింప నొల్లక, పాదుషాసమ్ముఖమున
శివాజీయుద్భావితచౌతుప్రధాపరివర్తనాధికారముఁ బ్రసాదిం
పవలసినదని ప్రార్థింపఁజొచ్చిరి. అట్లు ప్రార్థించుటకుఁ గారణము
లేకపోలేదు. ఆసమయములో భరతఖండమునందలి యసంఖ్యాక
రాజ్యములు స్వాతంత్ర్యప్రియులగు రాజపురుషుల ప్రాదుర్భావ
ముఁబడసియున్నయవి అందువలన శాంతిరక్షణోద్యమము సైని
కబలనిర్భరమై యొప్పియుండె. ఒకవేళ శాంతిరక్షణము పరరా
ష్ట్రములయందు సైనికదళములను నిలువరింపమినే సాధితమ
గునదియైనను సైన్యబలమునఁ గాని స్వరాజ్యస్వాతంత్ర్యగా

రవముల క్షుణ్ణములై వఱలనేరవని వారియాశంకితము. అందు
వలన సైన్యబలమును సమకూర్పవలయు. ధనవ్యయాధిక్యము
సంభవమగు. ఆయధికవ్యయమునకుఁ దగినయాయము చౌ
తుపరివర్తనమునఁగాని యలవడనేరదని వారు నిశ్చయించి, పాదు
షావలన చౌతుపరివర్తనాధికారస్వత్వముఁ బడయనెంచిరి. ఈ
స్వత్వప్రదానమునకుఁ బాదుషా యసమ్మతుఁడయ్యె. అంత మహా
రాష్ట్రవీరులు మరియొకపరి ప్రచండరణతాండవ మొనరింపఁ
దొడంగిరి. దాన దక్షిణదేశ మల్లకల్లోలమగుట కారంభ
మయ్యె. దేశము విప్లవభూయిష్ఠ మగుటవలనఁ జేయునది నేరక
తాత్కాలికపాదుషా, ఔరంగజేబుపౌత్రుఁడు మహమ్మదుషా
1719-వ సం. రములో మహారాష్ట్రనేతకు సర్ దేశముఖిస్వత్వ
మును చౌతుపరివర్తనాధికారమును స్వత్వపత్ర (సన్నదు) రూప
ముగ సమర్పించుట కంగీకరింపవలసినవాఁడయ్యెను. ఆకాలము
లో వీరేంద్ర బాజీరాయని జనకుఁడు "బాలాజీ విశ్వనాథు
పేష్వా" స్వయముగ ఢిల్లీనగరమున కేఁగి, చౌతుసర్ దేశముఖి
పరివర్తనాధికారస్వత్వపత్రము గైకొనియెను.

ఈవిధముగ మహారాష్ట్రనేత పాదుషాహీసన్నదును బడసి
యున్నను, తదుదాహరితాధికారద్వయమును సర్వత్ర వ్యా
పింపఁజేయుటకు మిక్కిలి పరిశ్రమ మొనర్పవలసినవాఁడ
య్యెను. ఢిల్లీశ్వరుని దక్షిణదిక్స్థితసుబేదారునుండియు, తది
తరస్వాతంత్ర్యప్రియరాజబృందమును తమకంకురించినసమరపి
పాసను శాంతినొనరించుకొనకుండ మహారాష్ట్రరక్షణాధీనతను
స్వీకరించుట కనిష్టముఁ బ్రకటింపఁజొచ్చెను. మహారాష్ట్రరక్ష
ణాధీనస్వీకృతతిరస్కారవాదులలో హైదరాబాదునవాబు నిజా

ము లేముల్కు ప్రధానుఁడు. ప్రముఖుఁడు. ఆహేతువువలన మహారాష్ట్రవీరులకు నిజాముల్ ముల్కుతో నిరువదిసంవత్సరములు ఘోరయుద్ధ మొనరింపవలసివచ్చెను. ఆవింశతివర్ష వ్యాపిత మహాసంగ్రామమందు మహారాష్ట్రవీరచూడామణి వీరేంద్ర బాజీరావు సర్వసేనాధిపత్యమును వహించి పూర్ణవిజయమును వడసి శాశ్వతయశముఁ జూఱఁగొనినవాఁడు. ఆమహాసమరమున నిజాముల్ ముల్కు పలునారులు పరాజితుఁడై, ధ్వస్తవిధ్వస్తుఁడై తుదకు మహారాష్ట్రాధిపునిరక్షణాధీనములను స్వీకరించి యాతనికి నిజరాజ్యాదాయములో చతుర్థాంశమును సమర్పింపవలసినవాఁడయ్యెను. ఇవ్విధముగ మహారాష్ట్రాధీనస్వీకృతతిరస్కారవాదులగు దాక్షిణాత్యక్షుద్రబృహద్రాజ్యాధిపతులు క్రమక్రమముగ మహారాష్ట్రాధిపునకు శరణాగతులై నిజరాజ్యములయందు చౌతుపరివర్తనమున కంగీకరించి తదాధీనతను స్వీకరింపవలసినవారలైరి.

బాలాజీవిశ్వనాథుపేష్వా, స్వదేశవాసులగౌరవవృద్ధుల నాశించి పాదుషాసమ్ముఖమున కరిగి గొనితెచ్చిన సన్నదుపత్రమం దుదాహృతమైన యధికారఫలమును, వీరేంద్రబాజీరాయనికృతయావజ్జీవనవ్యాపితప్రచండప్రయత్నమువలన, మహారాష్ట్రప్రవాసీగణము సంపూర్ణముగను యథార్థరూపముగను ననుభవింపఁగలయధికారమున కర్హతఁ బడయఁగలిగె.

పాదుషాహీసన్నదుపత్రము, ఉత్తరహిందూస్థానమందు మహారాష్ట్రులకు చౌతుపరివర్తనాధికారమును ప్రసాదించియుండలేదు. అద్దానిఁ బరికించినచో నార్యావర్తమందు మహా

రాష్ట్రాధిపత్యాధికారములు విస్తరింపఁజేయుతలంపుఁ గాని, చౌతుపరివర్తన మొనరింపఁదగు నాయోజనముఁ గాని బాజీరాయునకుఁ బూర్వులగు నాయకుల మస్తిష్కమందు స్థానముఁ బడసియుండినటులఁ గనుపట్టదు. అట్టియాయోజనమే పొడసూపిన యెడ నిరువదిసంవత్సరములు హోరాహోరిఁ బోరుసల్పి చేకొనినసన్నదుపత్రమునందు చౌతుపరివర్తనాధికారము కేవలము దక్షిణహిందూస్థానమందే కాక నార్యావర్తమందుకూడ ప్రసాదించియున్నటుల నుదాహృతమైయుండెడిది. ఒకవేళ పాదుషా యట్లుదహరించుట కసమ్మతుఁడయ్యెనని యనినచో, యాతనికి దక్షిణ దేశపరివర్తనముకూడ నసమ్మత మయినదియే. అద్దాని నేవిధముగఁ బడయఁగలిగిరో యావిధముగనే యార్యావర్తాధికారముగూడఁ బడయఁగలసామర్థ్యము వారికడ నమరియుండె.అందువలన, వారు దక్షిణ దేశమందు వడసినయధికారము,ఆర్యావర్తమునందుకూడ వడసియుందురనుట కిసుమంతయు సందియము లేదు. భరతఖండమును సంపూర్ణముగ చౌతురూపకమగుసూత్రబంధమున బంధ మొనరించి కుమారికాంతరీపము మొదలు హిమాచలస్థిత 'అటక్'నగరపర్యంతమువ్యాప్తమగు సమగ్ర ప్రదేశమందు శాంతిరక్షణము, శాసనము, పాలనములొనరింపఁగలభారమునుగ్రహించుమహాసంకల్పముప్రప్రథమమున వీరేంద్రచూడామణి పేష్వా బాజీరాయనివిశాలహృదయక్షేత్రమం దుదితమయ్యెను. ఛత్రపతిసాహు, ఆతనిమంత్రులు, ఆతనిసేనానులు బాజీరాయనియీమహోచ్చాకాంక్షఁ బరికించి, స్తంభితులును, భయగ్రస్తులును నగుటయే కాక,

యాతని నిమహాత్కార్యాచరణమునుండి విరతునిఁ గావింప
ననువగు యత్నములయందుఁ గూడఁ బ్రవృత్తులైరి. అందువ
లన నాతఁడు నిరుత్సాహితుఁ జెందక, యధర్మానాచారభూయి
ష్ఠమగుయవనశాసనపాశబంధమునుండి హైందవభూమిని వద
ల్చి, యందు హైందవధర్మమును పునరుద్ధారణ మొనర్చుట
హైందవసుసంతానమగుమహారాష్ట్రవీరగణమునకు ప్రధాన
కర్తవ్య మని, యుద్ధప్రియులును ఉత్సాహమండితులును నగు
మహారాష్ట్రవీరుల శౌర్యానలముఁ బ్రబల ప్రచండ ప్రజ్వలిత
పూరిత మొనర్చెను. ఆప్రసంగసమయమందు, మహారాష్ట్రాధి
పునివీరపూరితసభాభ్యంతరమున వీర కేసరిబాజీరా వొసంగిన
గంభీరోపన్యాసమే యాతనివక్తృత్వమాహాత్మ్యమును, విద్యా
వైశారద్యమును వేనోళ్లఁ జాటుచున్నయది. బాజీరాయనిసమ
రోత్సాహ గంభీరోపన్యాస మాలించి వీరసామంతసేనాని
సమూహము సమరప్రమత్తతఁ జెంది హైందవదేశము హైం
దవధర్మభూయిష్ఠ మొనరించుట హైందవసంతతి కావశ్యకము
ప్రధానకర్తవ్యము అని నిశ్చయ మొనరించె. శివాజీప్రవర్తిత
చౌత ప్రథాపరివర్తనము సాహాయ్యముగఁ గైకొని,
హైందవసామ్రాజ్య సంస్థాపనాసందర్భమున 'అగ్రగమననీతి'
(Farward Policy) ప్రచారణ మొనరించుటయే, బాజీరాయని
మహిమామండితజీవన చరితమందలి ప్రధానవిశేషము. ఈనీతి
ననుసరించుటయందు సమస్తమహారాష్ట్రీయసామర్థ్యమును సమ
వేతభావమున నియోజిత మొనరించుటయే యామహాత్ముని
పవిత్రజీవనచరితమందలి ప్రధానమాహాత్మ్యము, ఆమహాత్ముని

మహామహిమావిశేషమువలననే హిందూదేశమందు హైంద
వప్రాధాన్యము నూరుసంవత్సరము లవిచ్ఛిన్నముగ కొనసాగిన
యది. ప్రనష్టప్రాయమైన హైందవవిద్యాధర్మములను పునరు
ద్ధారణ మొనరించినవాఁడని పేరువడసిన పేష్వా బాజీరా
యని పూతచరితమును పఠించి యానందించుట హైందవుల
కవశ్యకర్తవ్యము.

బాజీరావు మహారాష్ట్రవంశజుఁడు. మహారాష్ట్రదేశీయుఁడు.
ఆతనిచరిత్రవిషయములు మహారాష్ట్రదేశీయుల కవగతమగువిధ
మున తదితరదేశీయులకుఁ గానేరవుగద. అట్టిచో త్రైలింగదేశీ
యుఁడనగు నాకవగతమగుననుట కడు.నసంభవము. నేనీనగర
మందలిమహారాష్ట్రమిత్రులవలన నీమహనీయుని జీవనచరితవిష
యములను విని యున్నాఁడను. అయ్యవి గ్రంథస్థాధారములఁ
గలిగియున్న వగునా యని, రనడె, గ్రాంటుడఫ్ మొదలగువా
రిచే విరచితములై నయాంగ్లభాషాత్మక దేశచరితములను శోధిం
చితిని. అందాతనిరాజనైతికచరిత్రాంశములే కనుఁగొననయ్యెఁ
గాని జీవనచరితాత్మకవిషయము లంతగఁ బొడసూపవయ్యె. అ
యినను నేవినినవిషయములలో కొన్నిటినియథార్థపఱిచె. కొన్ని
టిని మహారాష్ట్రగ్రంథములు ఋజువుపఱిచె. కొన్నిటిని నిరా
ధారమగుజనశ్రుతిప్రామాణ్యమె దృఢపఱిచె. . అందువలననే
వినినది కేవలమాధారవిరహితము కానందున నీపొత్తమును
వ్రాయనుంకించి యైదుప్రకరణములను పూర్తియొనరించితిని.
ఆఱనప్రకరణమును వ్రాయుసందర్భమున నామనమం దుదయ
మందినసందియములను నివృత్తియొనరించుకొనుటకై యీపు

రమందు నెలకొనియున్న కార్మైకల్ పుస్తకభాండాగారమున కేఁగి గ్రంథశోధన మొనర్చుచుండ, కలకత్తానగరవాసులు యస్. ఆర్. దివోస్కారుగారు రచియించినవంగభాషాత్మకమైనబాజీ రాయనిచరిత్రప్రతి యొకటియు, నద్దాని ననుసరించి మీర్జా పూరునివాసులు గో. వామనాచారిగిరిగారు వ్రాసిన హిందీ భాషాత్మకప్రతి యొకటియు లభియించినయవి. అంత నే నెంతయు సంతసించి నేవ్రాసినవిషయములను నాగ్రంథస్థవిషయములతో సరిచూడ, సంగతిసందర్భములలో కొంచెమించుమించు నేకీభావమూని యున్నటులఁ బొడగట్టినయవి. దాన నేవ్రాయునది సంపూర్ణముగఁ గ్రంథస్థాధారముఁ గలిగియుండె గదా యని ముదమొందుచు, వ్రాసినంతదనుక సరియొనర్చి మిగిలిన ప్రకరణములను నాగ్రంథద్వితయమాధారముగఁ గొని యెట్టిటో పూర్తియొనరించితిని. కాని, నేనాంగ్లభాషయందు కాని,ఆంధ్రగీర్వాణములయందు కాని పాండితిఁ బడసినవాఁడను కాను. కేవలము సేవకవృత్తినే యాధారముగఁ గొని జీవయాత్ర సలుపుచున్నవాఁడను. ముద్రాభృతి నొసంగుసామర్థ్యమునకు దూరస్థుఁడను. దానప్రచురణవిధానముఁ గానక పరితపించుచుంటిని. అట్లుండ చెన్నపురినివాసులు, ఆంధ్రభాషాసేవకులు, వావిళ్ల ముద్రణాలయాధికారులు నగు బ్రహ్మశ్రీ వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారు నాయందు పూర్ణానుగ్రహమూని నాపొత్తమును ప్రచురింపఁగంకణముకట్టుకొని నాపరితాపమును దూరమొనర్చినవారు. అందులకు వారికి కృతజ్ఞతాపూర్వకముగ వందనశతంబు లర్పించు

చున్నాఁడను. ఆంధ్రభాషాభిమానులు, బనారసుసెంట్రలు హిందూకాలేజి ప్రిన్సిపాలు మ.రా.శ్రీ. పి. శేషాద్రి, యమ్. ఎ. గారు ఈనాపొత్తమునకు ఫోరువర్డు (Foreword) వ్రాసి దయచేసి గౌరవమును ప్రసాదించినందులకు వారికి నానమస్కృతులర్పించుచు కృతజ్ఞుఁడ నగుచున్నాఁడను.

హనుమాన్‌ఘాట్,<br>బెనారసుసిటి, 13-12-1917.

ఇట్లు విధేయుఁడు,<br>రాచకొండ అన్నయ్యశాస్త్రి.

# FOREWORD.

It has been a long standing complaint that the Indian has not been a devoted votary of Clio, but it is pleasing to see that successful attempts are being made to wipe out the reproach not only by writers in English but also in the Vernaculars of the Country. It is therefore with a special satisfaction that I venture to introduce to the Telugu world this brochure on the life and work of the great Mahratta Peshwa, Baji Rao. There are very few episodes in the History of Modern India more inspiring to the Hindu imagination than that of the revival of the Mahratta power in Western India, inaugurated by the quickening way of Shivaji and consolidated by the consummate statesmanship of the Peshwas. The writer has therefore been exceptionally fortunate in the choice of his subject and as for the contents of the book I have only to say that they are worthy of the noble theme. There is a special value attaching to the historical sources which have been availed of in the composition of the volume, as the author has been at pains to consult a number of Mahratta Chronicles in the original—it will be remembered that the special success of the late Justice Ranade in the RISE OF MAHRATTA POWER was largely due to that circumstance.

We have thus been saved the distorted representations of Anglo-Indian Historians and the ill-digested remarks of hasty foreign travellers. The narrative is very comprehensive and is not confined to the bare facts of political History. The social background of the historical scenes; the bearings of the chief events on the history of the other parts of India; and all that is necessary to constitute a full record is there, presented in a style which is quite within popular appreciation while following in the wake of classical standards. Messrs. V. Ramaswamy Sastrulu and Sons, who have already laid the Telugu world under a deep debt of gratitude by their valuable publications have come forward to publish this volume and I wish it the success which it so richly deserves.

Benares Hindu University.
6th August '20.

P. SESHADRI.

శ్రీరస్తు.

# బాజీరాయని చరిత్ర

## మొదటి ప్రకరణము.

### మహారాష్ట్రము.

భరతఖండమున వింధ్యాద్రిసాత్పురాపర్వతపంక్తికిని, సహ్యాద్రిగిరిశ్రేణికిని నడుమనుండు వారిదుర్గపర్వతమాలాశోభాయమానత్రిభుజాకృతిభూభాగము మహారాష్ట్రమనునామమున ప్రఖ్యాతి గాంచుచున్నది. ఈమహారాష్ట్రదేశచరితము భారతవర్షీయచరితమందు రాజపుత్రస్థానచరితమునుబోలె వీరరసప్రధానమై మహోన్నతస్థాన మలంకరించి యున్నదనుట కిసుమంతయు సందియము లేదు. ఆకారణముననే యాదేశమునకు మహారాష్ట్రమనియు, నందలివాస్తవ్యులకు మహారాష్ట్రులనియు నానుము కలిగి యుండనోపు. మహారాష్ట్రులు విద్యాధికులయి, ధైర్య స్థైర్యబలపరాక్రమముల నద్వితీయులై తమదేశనామమును సార్థక మొనరించుచు వెలయుచుండిరి.

### ఎల్లలు.

ఈదేశమున కుత్తరమున సూరతునగరమును సాత్పురాపర్వతశ్రేణియును, దూర్పునఁ గండ్వాయాను త్రిలింగదేశము

లును, దక్షిణమునఁ గృష్ణామాలప్రభానదులును, బశ్చిమమున యవనసముద్రము నుపస్థితములై యున్నవి. ఈదేశముయొక్క పరిమాణము రమారమి లక్షయిరువదియైదువేల చదరపు మైళ్లు కలిగియున్నది. ఆలోచించి చూడ నీదేశము విస్తీర్ణమందు నింగ్లాండుకన్న రెండురెట్లధికమయి యున్నటుల కనఁబడుచున్నది. ఇందలిజనసంఖ్య రమారమి రెండుకోట్లు. ఈదేశము పర్వతబాహుళ్యమును గలిగి సాధారణముగ నూషరక్షేత్రమై యున్నందున నందలిజనులు దృఢకాయులును • కష్టసహిష్ణులును, విపులబలసంపన్నులునై వెలయుచుండిరి.

### శీతోష్ణస్థితి.

మహారాష్ట్రదేశమందలి శీతోష్ణస్థితి భారతవర్షమందలి యారోగ్యదాయకములని పేరు వడసినప్రదేశములలోని శీతోష్ణస్థితికంటె నధికస్వాస్థ్యకరమైనదని చెప్ప నొప్పును.

### మహారాష్ట్రదేశాంతర్భాగములు.

కొంకణము:—సహ్యాశైలశ్రేణి లేక పడమటికనుమల యొక్క యుత్తరాంశము మహారాష్ట్రదేశమును రెండుభాగములుగ నొనరించెను. అందు పడమటికనుమలకుఁ బశ్చిమాంశప్రదేశము కొంకణమని ప్రసిద్ధి గాంచెను. ఈప్రదేశముయొక్క దైర్ఘ్యము నాలుగువందలమైళ్లు. కొంకణము శైలమయము. అరణ్యసంకీర్ణము. ఒకవంక గంభీరగర్జన శీలఝుటికావర్తనుయ యవనసముద్రప్రసారితము. వేఱొకవంక దిగంతవిస్తీర్ణసహ్యాద్రిపదసంకుల సహస్రశీర్షవిరాట శరీరవిరాజమానము. అందలివాస్తవ్యులు ప్రాకృతికభయంబువలన నాత్మర

క్షణ మొనర్చుకొనుటయందుఁ గడుఁ గుశలులు. శ్రమశీలురు. సరళస్వభావులు. స్వల్పసంతుష్టులు.

జింజిరా:—కొంకణమున కుత్తరమందలి భూభాగము జింజిరా యనునామమున నొప్పుచుండెడి యొకద్వీపకల్పము. ప్రస్తుతమం దీద్వీపకల్పము కులాబాజిల్లాలో చేరియున్నది. ఆంగ్లప్రభుత్వస్థాపనకుఁ బూర్వ మీద్వీపకల్పమును దీనికి నలుదిక్కులనుండు భూభాగమును,'అబిసీనియా'వంశస్థుల యధికారమున వఱలుచుండెడివి. ఈవంశస్థులపూర్వాధికృతభూభాగము 'అబిసియాన్' యనునామమున నేఁటికిని ప్రసిద్ధిఁ గనుచుండెను. ఈఅబిసీనియావంశస్థులకు సిద్దీలనునామముఁ గూడఁ గలదు. ఈఅబిసియాన్ దేశపరిమాణము 325 చదరపుమైళ్లు. దీనిరాజధాని జింజిరా. ప్రస్తుతమున నీదేశవార్షికాదాయము రు. 3,50,000 లు. జింజిరాయందుఁ బ్రస్తుతమం దాంగ్లప్రభుత్వమువారి పొలిటికల్ ఏజెంటు వసియించుచుండును.

## మహారాష్ట్రవంశములు, వారివాసస్థానములు, వారియుద్యోగములు.

మహారాష్ట్రదేశమందు వాసముచేయుమనుజులవంశములనేకములని తెలియవచ్చుచున్నది. అందు నింబాలకరు, ఘాటగీ, మనయ, ఘరపుర, డపలీ సామంతవంశములవారు, ఫలటను, మల్లాగీ, ముస్వర, మథోలు, హాట్ట, సామంతవాడు లను ప్రదేశములయందు వాస మొనర్చుచు, బీజాపురాధీశ్వరునకు వశులై, సేనానులై, నిరుపమబలపరాక్రమముల గణనకెక్కిరి. యాదవరావు, భోసలేవంశములవారు. పూనాపరిసరదేశముల

యుందు వాస మొనర్చుచు, నహమదునగరుసుల్తాను కొలువు కూటమున ముఖ్యస్థానముల నలంకరించిరి.

మహారాష్ట్రప్రతాపాగుణకాంతులు భారతవర్షాకాశమున నీవిధమునఁ బ్రబలతమముగ వ్యాపించి యున్నను, మండలోదయమునకు విలంబనుగుచుండ, యాదవరావు భోసలేవంశములఁ దపోఫలమునునటుల శివాజీతపనుఁ డుదయమంది యావెలితిఁ దీర్చి జగత్ప్రఖ్యాతిఁ గాంచెను.

పై నుదహరించినవంశములవారు గాక, 'భల్లాల్' అను వేఱొకవంశమువారు గలరు. వా రగ్రజనులు. వైదికాచారపరాయణులు. వేదశాస్త్రపారంగతులు. మనకథానాయకుఁడు వీరేంద్రబాజీరా వీభల్లాలువంశమున జన్మించినవాఁడు. ఈవంశమునకు భట్టవంశ మని వేఱొకనామము కూడ గలదు.

మహారాష్ట్రస్వరాజ్యోదయోదంతము.

బేబ రను కృషికుఁడు నాటినమొగలాయీప్రభుత్వబీజ మింపుగ మొలక యైనను. ఆమొలక హుమయూనుకాలము నందలి ప్రథమభాగమునఁ గీటకవ్యావృతమై కొలఁదికాలము తలచెడినదై యాతనిప్రయత్నవిశేషమున పురల చిగురెత్తి అక్బరుదోహదవిశేషమున బలిష్ఠమై దినదిన మభివృద్ధిఁ జెంది మహావృక్షమై శాఖోపశాఖలను నిరాటంకముగ దశదిశలకు వ్యాపించి తానే మహౌన్నత్యమును రమణీయతఁ గన్నదాననని తనలోఁ దాను మురియఁ జొచ్చెను. "అత్యుచ్ఛ్రియః పతనహేతుః" అనునట్లు జహంగీరుకాలమున నారాజ్యరమావిలాసమున కించుకించుకఁ గళంక మంకురింప మొదలిడి,

షాజహానునిపాలనమున నయ్యది నానాఁటికి వృద్ధిఁ జెంది, యౌరంగజేబుప్రభుత్వమున నాతనిక్రూరదృష్టి కౌతుకము, స్వమతాభిమానము, అన్యమతవైమనస్యము మొదలుగాఁ గలదురాచారములు, భారతీయులయౌదాసీన్యమున కాధారభూతములై, క్రమక్రమముగ వేరుపురుగులై ప్రభుత్వమహావృక్షమును లోలోన భక్షింప సాగెను. ప్రభుత్వపువారియధికారమునకు వెఱచి కొందఱు భారతీయులు తమయసంతుష్టిని వెలిపఱుపఁజాలక లోలోన దిగమ్రింగుచుండినను, దక్షిణమున శివాజి, మహమ్మదీయాచారముల సహింపనోపక క్రోధానలప్రజ్వలితుఁడై పరతంత్రపరాఙ్ముఖుఁడయి, స్వరాజ్యసంస్థాపన మొనర్చి పరలోకయాత్ర కరిగెను.

### శివాజీయనంతరమందలి మహారాష్ట్రస్వరాజ్యవ్యవస్థ.

శివాజీయనంతరము పూర్వమహారాష్ట్రము, ఘోరవిప్లవమున కాకర మయ్యెను. శివాజీ స్వర్గస్థుఁడైనపిమ్మట నౌరంగజేబు చక్రవర్తి స్వయముగ మొగలాయీసైన్యమును నడిపించుకొని చని మహారాష్ట్రదేశము నాక్రమణ మొనర్చుకొనెను. శివాజీజ్యేష్ఠపుత్త్రుఁడు శంభూజీ (శంభాజీ), మొగలాయీల యాక్రమణమును నిరోధించుటకు యథాసాధ్యముగ యత్న మొనరించెను గాని, విధివైపరీత్యమునను, బుద్ధిలోపముచేతను మొగలులచే పట్టువడి, తుదకుఁ బ్రాణపరిత్యాగమునకుఁ బాత్రుఁ డయ్యెను. పతివ్రతయు సద్గుణగరిష్ఠయు నగు శంభూజీసతీతిలకము, యసోదావాంగ్ (ఏసూవాంగ్) యాతని పుత్త్రరత్నము కుమారసాహూ, యాయిరువురును డిల్లీశ్వరుని వశమున నుంచఁబడిరి. శివాజీ ద్వితీయపుత్త్రుఁడు మహారాజా

రాజారామ్, సింహాసనమధిష్ఠించి, భ్రాతృహంతయగు దర్పితఢిల్లీశ్వరుని మద మడంచుటకుఁ బ్రవృత్తుఁడయ్యెను. క్రీ. శ. 1700 సం. రములో మహారాజా రాజారామ్ కైలాసవాస మొందెను. రాజారామ్ భూలోకసామ్రాజ్యమును వీడినంతనె, మహారాష్ట్రవీరవుంగవులు భయభ్రాంతులై హతాశులై, శాంతిరూపధారులయ్యెదుతరుణ మొనఁగూడెనని ఔరంగజేబు సంతసింపఁజొచ్చెను. కాని, యాసంతస మనతికాలముననే యంతరించెను. మహారాజా రాజారామ్ గతించినంతనె, యాతనిసహధర్మిణి మహారాణీ తారాబాయి, మహారాష్ట్రదేశశాసనగ్రహణ మొనరించెను. వీరాంగణమున, మధ్యందినమార్తాండుని బోలె, ప్రజ్వరిల్లుచున్న తారేశ్వరి యుత్తేజమునుఁ గని, మహారాష్ట్రులు శౌర్యోత్సాహమండితులై, ఢిల్లీశ్వరుని సేనాసహితముగ స్వదేశమునుండి బాఱఁదోలఁ గృతప్రతిజ్ఞులై రణప్రాంగణమున నుఱికి శత్రువీరులను మర్దింప నడుకట్టిరి. వీరోల్లసితనినాదమగు "హరహరమహాదేవ్"అను శబ్దమును గగనమండలమును భేదించుచు దిగంతరాళములను బ్రతిధ్వను లీనునటుల చేయుచుండెను.

ఆసమయమున, వైదికాచారనిమగ్నులగు భల్లాలు (భట్ట) వంశీయులు, తలయెత్తి రాజనీతిధురంధరు లైరి.

## -ఇఇ శ్రీవర్ధనము. ఇఇ-

భల్లాలువంశీయులు జంజిరాకు దక్షిణమునఁ బదిరెండు మైళ్లదూరమునఁ బాణకోటనామకసాగరమునకు నుత్తరతీరమున, సావిత్రీకృష్ణానదుల సంగమస్థానమునకు సమీపముననున్న యొకచిన్నగ్రామములో వసియించుచుండిరి. ఆగ్రామము

శ్రీవర్ధనమను నామమున వ్యవహరింపఁబడుచుండు. అందలి జనసంఖ్య రమారమి మూఁడు వేలుండును. అందు వేదవేదాంగవిదులగు శ్రోత్రియబ్రాహ్మణులు వేయిమంది. కొంకణమందలి యన్యస్థానములలోవలె నందు మామిడి, పనస, నారికేళము, కదళి, పోక మొదలుగాఁ గలతోటలు విస్తారముగ నొప్పుచుండును. ప్రాచీనకాలమందా గ్రామము పోకలవాణిజ్యమునకుఁ గడుఁబ్రసిద్ధిఁ గనియుండెను. అందలిపోకలు ప్రస్తుతమందుఁ గూడ మహారాష్ట్రదేశమునందంతట నాదరపూర్వకముగఁ బరిగణింపఁబడుచుండును.

### ఆదిపురుషుఁడు.

శ్రీవర్ధనమున సుమారు రెండువందలసంవత్సరములకుఁ బూర్వము, (పదునేడవశతాబ్దాంతము) వేదవేదాంగవిదుఁడును, గర్గగోత్రోద్భవుఁడును నగు "జనార్దనభట్టు" అను మహారాష్ట్రబ్రాహ్మణున కసదృశమేధాసంపన్నుండగు నొకకొమరుఁ డుదయించెను. ఆతఁడు విశ్వనాథభట్టనునామమునఁ బ్రఖ్యాతిఁ గాంచెను. ఆవిశ్వనాథభట్టు, జింజిగాధికారులగు సిద్దీసర్దారులయాధీనమున శ్రీవర్ధనమునఁ దదాఖ్యానమునఁ బరఁగుపరగణాకు దేశముఖ్యుఁడై, సిస్తుదస్తులను వసూలు చేయుచు లౌకికవ్యాపారమున నొప్పుచుండెడివాఁడు.

### బాలాజీ విశ్వనాథభట్టు.

పండితప్రవరుఁడును రాజనీతిధురంధరుఁడును నగు విశ్వనాథభట్టు, నలుగురు కొమరులను బడసి స్వర్గయాత్ర కరిగెను. అందు జ్యేష్ఠులగు నిరువురకొమరుల చరితము లభించుట

లేదు. తృతీయపుత్త్రుఁడగు జానోజీ, (జనార్దనభట్టు) పైతృక పదమును వడసి శ్రీవర్ధనమున రాచకార్యములను నిర్విఘ్నముగ నెఱపుచుండెను. కనిష్ఠపుత్త్రుఁడగు భల్లాల్‌జీ, లేక బాలాజీ యుద్యమశీలుఁడు. పైతృకధనమునే జీవనోపాధిగ నెన్నుకొనక తన్నుఁ బోషించుభారము జ్యేష్ఠభ్రాతపై నిడక, ధనోపార్జనమునకునై స్వతంత్రపథావలంబన మొనర్చెను.

బాలాజీ మునుముందు కొంతకాలము, జంజిరాధిపతులగు సిద్దీసర్దారులయాధీనమునఁ 'జిపలూను' అను తాలూకాలో సిస్తు వసూలు చేయుభారమును గ్రహించి యందుఁ గృతకృత్యుఁడై యధికారుల మన్ననలకుఁ బాత్రుఁ డయ్యెను. పిమ్మట 'మీరాటుబందరు' అనుస్థానమందలి యుప్పుపఱలను గుత్తఁగొని తనవశ మొనర్చుకొనెను.

ఆకారణమున బాలాజీ చిపలూను పరగణాలోనే నివసింపవలసివచ్చెను. ఆబాలాజీయే, తరువాత "పేష్వా బాలాజీ విశ్వనాథు" అనునామమునఁ జరిత్రములయందు సుప్రసిద్ధప్రఖ్యాతిఁగాంచెను. (మహారాష్ట్రదేశమున నాత్మనామమునకు వెనుకఁ బితృనామమును జేర్చి వ్యవహరించునాచారము సర్వసాధారణమై యుండినకతమున బాలాజీనామమునకు వెనుక విశ్వనాథనామమును జేర్చి వ్యవహరించిరి.) బాలాజీవిశ్వనాథుని ఆతని స్వజనసమాజమువారు, "బాలాజీపంత్" అని వ్యవహరించిరి. (పంతుశబ్దము పండితశబ్దముయొక్క వికారము. వంగదేశమందలి బ్రాహ్మణుల నామాంతములయందు 'ఠాకూర్' శబ్దమును జేర్చి వ్యవహరించువిధమున మహారాష్ట్రదేశమున బ్రాహ్మణులు 'పంతు' శబ్దమును బ్రయోగించి వ్యవహరింతురు.)

### బాజీరాయని జననము.

బాలాజీపంతునకు గుణవతి, రూపవతి, పూతశీలయు నగు 'రాధావాంగీ' యను నారీశిరోమణి సహధర్మిణి. ఆదంపతుల పూర్వపుణ్యఫలం బనురీతి క్రీ. శ. 1699 వ సంవత్సరమున వీరవల్లరీవిరాట్టు బాజీరావు భల్లాకీ ఉదయమందెను. బాల్యజీవనమందలి విపత్పరంపర, భవిష్యజ్జీవనోత్కృష్టతను సూచించు ననుదైవనియమమును బాజీరాయని జీవనచరితముఁ దార్కాణముగ గ్రహింపనగును. బాజీరావు, తనబాల్యదశయందుఁ బలుసారులు విపత్సాగరమును దరింపవలసివచ్చెను. బాజీరావు తనజీవితకాలమున మూఁడువత్సరములు గడపి, నాలుగవవత్సరమున నడుఁగిడినంతనె, విపత్పరంపరలు నలుగడల నలముకొని, జనకునివెంబడి జన్మభూమిఁ ద్యజింపవలసివచ్చెను. కాలపురుషుఁడు, వారలకు సంభవించిన యీ మహాకష్టములఁ జూచి తనివి నొందక కారాగారావాసమునుఁ గూడ నొసఁగూర్చెను.

### విపత్పాతము.

ఆకాలమున జింజిరాదేశమున కధిపతి ఖాశింఖానను సిద్దీ వంశస్థుఁడు. ఆతని శౌర్యవిక్రమములకు మొగలాయీసామ్రాట్టు, ఔరంగజేబు ప్రసన్నహృదయుఁడై, యాతని మొగలాయీసేనావాహిని కధినాయకునిగ నియోగించెను. ఆకారణమువలన, క్షత్రపతిశివాజీసమయమునుండియు నాఖాశింఖాను, మహారాష్ట్రులకు శృంగభంగ మొనరించి వారిసామ్రాజ్యపదవిఁ జూఱఁగొన యత్న మొనరించుచు వచ్చుచుండెను. అందువలన నాతఁడు మహారాష్ట్రసేనానులతో నిరంతరముఁ బోరాడుచు,

హైందవులఁ గష్టపరంపరలపాలుఁ జేయుచు వారియెడ దురాచారముల నెఱపుట కిసుమంతయు వెనుదీయ కుండెడువాఁడు. ఆకాలమున సముద్రతీరపాంతప్రదేశాధిపత్యమును వహించి, మహారాష్ట్రనావికాసమూహమున కధిపతిగా నున్న 'కాన్హోజీ ఆంగ్రే' యను మహారాష్ట్రనాయకునితో సిద్దీఖాశింఖాను వైరమూని శత్రుత్వమును సాధించుచుండెను.

మహారాష్ట్రసేనానాయకుఁడగు కాన్హోజీ ఆంగ్రె, సిద్దీ సర్దారుఁడగు ఖాశింఖాను, ఇరువురనడుమ వివాదదావానలము ప్రచండముగఁ బ్రజ్వలింప నారంభమయ్యెను. కాన్హోజీ సిద్దీ సర్దారు సైనికుల నర్థప్రదానసాధనమున వశీభూతులఁగ నొనర్చుకొని తనసైనికదళమునఁ జేర్చుకొన యత్న మొనరింపఁ జొచ్చెను. ఆయవసరమున బాలాజీ విశ్వనాథభట్టు స్వదేశస్వజాతిమంగళకాంక్షచేతఁ గుప్తరీతిఁ గాన్హోజీ పక్ష మవలంబన మొనర్చెను. ఈసమాచార మొక్కింతకాలమునకుఁ గర్ణాకర్ణి ఖాశింఖానునికిఁ గోచరమయ్యెను. ఈప్రచలిత సమాచారము సత్యమైనదియా; అసత్యమయినదియా; దుర్ధర్ష దురాచారపరాయణుఁడగు ఖాశింఖానీప్రచలితవార్త వ్యాజముగ జేకొని విచారణరహితముగ శ్రీవర్ధనపుభట్టు వంశీయులను బంధించుటకు నిష్ఠురశాసనమును వెలిపఱిచెను.

ఈసిద్దీసర్దారుని యుగ్రశాసనము బ్రప్రథమమున బాలాజీవిశ్వనాథుని జ్యేష్ఠసోదరుఁడగు జనార్దనభట్టును బంధన మొనర్చెను. ప్రచండ పాపకులాలంకారుఁడు, ఖాశింఖాను క్రూరరాక్షసుఁడు ఎవ్విధమయినవిచారణ మొనర్పకుండఁగనె, నిర్దోషబ్రాహ్మణుఁడు, జనార్దనభట్టును గ్రూరశిక్షకుఁ బాలు

గావించెను. హతభాగ్యుఁడగు జనార్దనభట్టొకపెట్టియందు బంధింపఁబడి సముద్రమధ్యమునఁ గ్రీ. శ. 1701 వ సంవత్సరమున విడువఁబడి నిమజ్జితుఁడయ్యెను.

స్వదేశపరిత్యాగము.

ఈదారుణదుర్ఘటనమున కత్యంత భీతివిమర్దితుఁడై, బాలాజీవిశ్వనాథభట్టు, అర్ధస్ఫుటవాణీసముచ్చారణ సమర్థం బగు శిశుమండలమధ్యమున, శైశవక్రీడానందోపభోగమున నొప్పుచున్న బాజీరావుఁదొడ్డొకని, స్వకులాత్మ సంరక్షణాభిలాషియై, కుటుంబపరివారసహితముగ, అబిసీనియారాక్షసాధికృత ప్రదేశపరిత్యాగము, శ్రేయోదాయకమని తలఁచి బయలు వెడలిపోవుచు, బాణకోటకు దక్షిణమునను‌న్న 'బయలాస' ను గ్రామముఁ జేరెను. ఆగ్రామమున సద్గుణ సంపన్నుఁడును, సచ్ఛీలుఁడును నగు, 'హరిమహాదేవుభానుఁ' డను నొక సద్బ్రాహ్మణుఁడు కలఁడు. బాలాజీవిశ్వనాథున కాబ్రాహ్మణునితోఁ బ్రథమమున నుండియు నత్యంతమైత్రి కలదు. ఆకారణమున బాలాజీవిశ్వనాథభట్టు ప్రప్రథమమున నాగ్రామమున కేఁగవలసినవాఁ డయ్యెను. బాలాజీవిశ్వనాథభట్టు, తనభవిష్యకర్తవ్య సంబంధమున, భానూజితో పరామర్శ నొనరించి, తుదకు, కొంకణదేశముఁ బరిత్యజించి సహ్యాద్రిపూర్వాంచలస్థితస్థానముల కేందేని యేగి, యెుకానొకనూతనవ్యవసాయము నవలంబించి, తత్సాధనమున ధనోపార్జనముఁ జేయుట సుకర్తవ్యమని కృతనిశ్చయుఁ డయ్యెను. సుహృదలోలుఁడగు, భానోజీ, మిత్రవియోగమునకు సహింపనోపక పరివారయుతముగఁ బాలాజీపంతు వెంబడిని విదేశయాత్రానువర్తి యయ్యెను.

### మార్గమధ్యమున మహాకష్టము.

భట్టుభాను లిరువురును సపరివారముగ నొక్కింతదూర మేగినంతనె ధూర్తసిద్దీనాయకుని క్రూరసైనికులు బాలాజీపంతును ముట్టడించి, 'అంజనబేలు' దుర్గమునకుఁ గొనిపోయి, యందుఁ బందీకృతునిఁగ నొనరించిరి. 'అంజనబేలు' దుర్గము చరిత్ర ప్రసిద్ధమగు 'సువర్ణదుర్గమునకుఁ దక్షిణమునఁ బదునైదుమైళ్లదూరమున నున్నది. అంజనబేలు దుర్గేశుఁడు, సిద్దీనాయకుని యాదేశమున, సపరివారముగఁ బాలాజీపంతు నిరువదిరెండుదినములు కారాగారమం దునిచెను. ఆమహావిపద్దశయందు, 'హరిమహాదేవభానుఁడు' నాతని యిరువురుసోదరులు దమ యసాధారణబుద్ధికుశలతను వెలువఱిచి యత్యంత పరిశ్రమమున నంజనబేలు దుర్గేశుని వశీభూతునిగఁ జేసికొనిరి. ఆవిద్వత్సంపన్నులగు బ్రాహ్మణుల బుద్ధిబలమునఁ బాలాజీపంతు సపరివారముగఁ జెఱ విముక్తిఁ వడసెను. అనంతరము సహ్యాద్రి నుత్తర మొనరించి భట్టుభాను లిరువురును, బూనానగరమునకు నికటస్థమగు 'నాసవాఁడు' గ్రామమున కేఁగి యంబాజీత్ర్యంబక్ పురందరే' (అవాజీపంతుపురందరే యని, గ్రాంట్ డఫ్ దొరగారిమతము.) యనుసద్బ్రాహ్మణుని నాశ్రయించిరి. అంతటఁ బురందరే యాబ్రాహ్మణబృందముఁ దాత్కాలికమహారాష్ట్రరాజధాని యగు సితారా 'సతారా' నగరమునకుఁ గొని చనియెను.

### మహారాష్ట్ర సామ్రాజ్యోద్ధారణము.

శివాజీయనంతరము మహారాష్ట్రసామ్రాజ్యము మొగలాయీల యాక్రమణమునకు లోనయ్యెను. శివాజీ జ్యేష్ఠపు

త్రుఁడు శంభూజీ మహారాష్ట్రసింహాసనారూఢుఁడై, స్వరాజ్యము మ్లేచ్ఛులకెఱ గాకుండ యథాసాధ్యముగ యత్నమొనరించెను. కాని, విధి విరోధిపక్షమును గ్రహించి యున్నందున, శత్రులచేఁ బట్టువడి తుదకు శరీరమును త్యజియించెను. అనంతరము. శివాజీద్వితీయపుత్త్రుఁడు రాజారామ్ రాజ్యాధిపత్యమును వహించి మొగలాయీల నెదిరించెను; కాని యాతఁడకాలమృత్యువువాతఁ బడియెను. పిమ్మట, రాజారామ్ ధర్మపత్ని మహారాణీతారావాంగీ సింహాసనమును స్వీకరించి మ్లేచ్ఛదమనోన్ముఖయై ప్రతాపానల ప్రజ్వలితయై శత్రుకాననమును దహించుచుండెను. మహిషమర్దనిఁ బురుడించు ప్రతాపమున వఱలుచున్న తారావాంగీ ఆదేశమున నమాత్యశేఖరుఁడు రామచంద్రపంతు, సచివుఁడు శంకర్ జీనారాయణ్ సేనాపతి దానాజీయాదవ్ ప్రభృతిమహారాష్ట్రవీరేంద్రులు, దక్షిణ మహారాష్ట్రమున విక్రమప్రదర్శనములఁ బ్రదర్శించుచుండిరి. మొగలాయీలు శత్రువీరుల వర్ధితవిక్రమమును గరాళరుద్రతేజమును గని, భయగ్రసితచిత్తులై నిలుపోపక, పరాజయమొంది ప్రాణరక్షణాతురులై నలుఁగడలఁ బరుఁగిడఁ జొచ్చిరి. మొగలాయీ శాసనమునకుఁ బాలయిన స్వదేశమును గరాళఖడ్గమాలాజ్వాలాధారముగ, తారావాంగీ స్వాధీనమొనర్చుకొని నిజాధిపత్యమును విస్తరింపఁ జేయఁ జొచ్చెను. ఆయవసరము బుద్ధిబలము కలిగిన మనుజు లవసరమని తలఁచి వారల నన్వేషించుచుండెను. ఆకారణమున, బుద్ధిబలమును గార్యకౌశలమును గలిగిన బాలాజీపంతు, సితారానగరమున బ్రవేశించిన

కొలఁదిదినములలోనే రాజకీయాధికారలాభమునకుఁ బాత్రుఁ డయ్యెను.

—అధికారలాభము.—

వీరప్రసవని యని ఖ్యాతి గాంచిన మహారాష్ట్రదేశమునకు రాజధానియైన సితారానగరమున మహాదేవుకృష్ణ ర్యోసి యను నొకబ్రాహ్మణుఁడు వాస మొనర్చుచుండెను. ఆజ్యోసి ప్రాపక మాధారముగఁ గొని, బాలాజీపంతు, మహారాణీ తారావాంగీప్రతినిధి, సర్దారుపరశురామత్ర్యంబకుని కృపాకటాక్షమునకుఁ బాత్రుఁడై, యొకతాలూకాకు, తహసీలుదారుఁడు (పిస్తు మొదలగునవి వసూలు చేయునధికారి.)గ నియోగింపఁబడెను. అందు బాలాజీపంతుని, కార్యదక్షతను వీక్షించి, రాజప్రతినిధి, కొలఁదికాలముననే, యాతని ధానాజీ (ధనంజయ) యాదవజీవశమున నిడియెను. ధానాజీ,బాలాజీ విశ్వనాథభట్టును నూఱుముద్రలు సాంవత్సరికవేతన మేర్పఱిచి రాజ్యవిభాగమునఁ క్రీ. శ. 1707 వ సంవత్సరములో 'కారకూనీ' పదమున నియోగించెను.

---

## రెండవప్రకరణము.

---

—బాజీరాయని బాల్యశిక్ష.—

**సితారానగరము బాజీరాయని శిక్షారంభస్థానము.** బాలాజీ విశ్వనాథభట్టు. 'కారకూన్'పదవి నందిన పిమ్మటఁ దన పుత్త్రునిఁ దాత్కాలికపఠనపాఠనపాటవమం దత్యంతదక్షునిగ నొనర్చి యనంతరము కాయికమానసికశక్తు లభివృద్ధిఁ జెందు

మార్గముల నడిపింప నారంభించెను. పుస్తకస్థమగు విద్య కంఠస్థమగునటుల వల్లించి పండితవరుఁడను బిరుదమును వడయుటకంటెఁ దాత్కాలికాయుధప్రయోగోపసంహారముల యందు నైపుణ్యముఁగని వీరవరుండను బిరుదమును వడయుట యాకాలపుబాలకుల కధికగౌరవమై యొప్పుచుండెను. బాజీరావు జనన మొందినసమయమందు మహారాష్ట్రదేశమునఁ బాండిత్యము కన్న విశేషముగ వీరత్వము గణనకెక్కి యుండెను. ఆకారణమువలన బాలాజీవిశ్వనాథభట్టు తనపుత్త్రుని శాస్త్రాధ్యయన మొనరింపించుటతోపాటు గజాశ్వాద్యారోహణముల యందును ఖడ్గము, బల్లెము మొదలుగా గలయాకాలపు యాయుధప్రయోగోపసంహారములఁ బరిపూర్ణకౌశలముఁ గనునటులఁ జేయఁజొచ్చెను.

సితారానగరమునందు, రాజకీయోద్యోగమునఁ బ్రవేశించినదాది బాలాజీవిశ్వనాథభట్టు కొంచెమించుమించు తనజీవితకాల మంతయు యుద్ధాభియానములయందుఁ గడుపవలసినవాఁ డాయెను. అందువలనఁ దనపుత్త్రుని సర్వవిధముల వీర్యవంతునిగ జేయవలయు ననుసభిమత మాతనిమనమున నెక్కుఁడై తానేరిగెడి ప్రతియుద్ధభూమికి వెంటఁగొనిపోయి, రణప్రాంగణమున వీరవరులబాహుసంచలిత ఖడ్గాద్యాయుధ ప్రయోగనైపుణ్యముఁ గనుఁగొనఁ జేయుచు, సమరశాస్త్ర పారంగతునిగ జేసెను. స్వల్పకాలమున, బాల్యావస్థయందే బాజీరావు నిజశౌర్యవీర్యసాహసములఁ బ్రదర్శించుసామర్థ్య మలవఱచుకొనెను.

బాజీరావునకు, తండ్రివెంబడిని రాజసభాప్రవేశమును, అనేకదేశపరిభ్రమణములునుఁ గను సుయోగ్యత ప్రాప్తమయినంతనె, రాజకీయవిషయములయందు శిక్షితుఁడై అతఁడనతికాలములో ననాయాసముగ సామర్థ్యమును వడసెను. బాలాజీ విశ్వనాథుఁ డొనరించు కార్యనిర్వహణమునందు నుశిక్షను గనుటవలన, బాజీరాయుఁడు, తనభవిష్యజీవితకాలమున కుపచరించుధార్ఢ్యము గలిగి వఱలుచుండెను.

## పరౌన్నత్యము.

బాలాజీవిశ్వనాథభట్టు ధనంజయయాదవ్‌జీ యాధీనమున, కారకూన్ పదనిర్వహణకాలములో, మహారాష్ట్రీయులు రెండుపర్యాయములు మోగలసైన్యమును బ్రచండవిక్రమమున నాక్రమించి మోగల్‌సామ్రాట్టగు ఔరంగజేబు చక్రవర్తిని వశ్యునిఁగాఁ జేసిరి. అంత నౌరంగజేబు శంభాజీ కొమారుఁడు సాహూజీని జెఱ విముక్తునిఁగఁ జేసి, వీరోన్నత్తులగు మహారాష్ట్రులను శాంతచిత్తులుగఁ జేయనెంచి యాతనికిఁ దక్షిణదేశమున, సర్ దేశముఖీ (సమగ్రరాజస్వమునఁ దశమాంశ) సత్వ మొసంగి సనదు (పట్టా)ను సమర్పించెను. సాహూజీ, యౌరంగజే బొసఁగిన సనదు పత్రముఁ జేకొని స్వదేశాగతుఁడైనంతనే, రాజ్యాధికారప్రాప్తికై, మాతాపుత్రులగు తారావాంగీ సాహూజీలకు సమరసంఘర్షణ ముపస్థితమయ్యెను. మహారాష్ట్రరాజ్యమునకు సాహూజీయే క్రమమయినయుత్తరాధికారి యని గ్రహించి మహారాష్ట్రవాహినికిఁ బ్రధానసేనాధిపతి, ధనంజయయాదవజీ, యాతనియెడ శత్రువ్యాచరణ మొనరించుటకు విరక్తుఁడై నందున క్రీ. శ.

1707 సం॥రములో మహారాణీ తారావాంగీ పరాజయ మొందెను.

ఇంతవఱకు మహారాష్ట్రదేశములోఁ బ్రబలియున్న ఘోరవిప్లవములు మహారాజాసాహూ సింహాసన మధిష్ఠించినకారణముననో, లేక, తదితరకారణముననో, నామమాత్రావశిష్టములయ్యెను.

బాలాజీవిశ్వనాథభట్టునకు, తాను వడసినరాజ్యవిభాగమందలి కారకూన్ పదనిర్వహణమునఁ దన నిరుపమప్రతిభాప్రకరణమును ప్రదర్శించుట కనువగునుసమయము సంప్రాప్తమయ్యెను. అతని యద్భుతకార్యకౌశలము, కొలఁదిదినములలోనే రాజ్యాదాయవ్యయమార్గములను విచక్షణ మొనరించెను. ఆతఁడు కృషికులయెడ ననురక్తుఁడై యుత్సాహపూర్వకముగ, వార లౌన్నత్యముఁ గనుమార్గముల నుపదేశించి తత్కాలమున రాజ్యాదాయమును వృద్ధిగావించెను. బాలాజీవిశ్వనాథభట్టుని కార్యదక్షతనుఁ గని సంతుష్టహృదయుఁడై ప్రధానసేనాధిపతి యాతనియెడఁ బ్రసన్నతాపూర్వకముగ బక్షపాతి యయ్యెను. బాలాజీ విశ్వనాథుని కార్యకౌశలమును మహారాజాసాహూ స్వయముగ గనునించుచుండెను.

క్రీ. శ. 1710-సం॥ రము జూన్ నెలలో ప్రధానసేనాధిపతి ధనంజయయాదవ్ స్వర్గస్థుఁ డయ్యెను. అంతట సాహూ, ధనంజయయాదవు డొనరించు, రాజ్యాదాయసంగ్రహణము, సైన్యసంగ్రహణపాలనములును, విభజన మొనర్చి, రాజ్యాదాయసంగ్రహణభారమును బాలాజీవిశ్వనాథునకును, సైన్యసంగ్రహణపాలనభారములను, ధనంజయయాదవజీపుత్త్రుఁడగు

చంద్రసేనరావునకును సమర్పించెను. సాహూజీకృతమైన యీ నూతనవిభజనసమర్పణములు చంద్రసేనరావునకుఁ బూర్ణముగ నసంతుష్టికరములయి పరిణమించెను.

ఇంతదనుక తనతండ్రియగు ధనంజయయాదవజీయాధీనమున కారకూన్ పదము వహించి జీవన మొనర్చుచున్న బాలాజీ విశ్వనాథభట్టు తనయాధీనమునుండి తొలఁగి పోవుటయే కాక, తనతోడిసమానగౌరవమునకుఁ గూడఁ బాత్రుఁడయ్యెను గదా యని చింతనొందుచు నాతనియెడఁ జంద్రసేనరావు ద్వేష మూని, యాతని నవమానితుఁ జేయుటకు తగు సమయ మరయుచుండెను.

### చంద్రసేనరావు బాలాజీవిశ్వనాథుల వైరకారణము.

క్రీ. శ. 1711-సం॥ రములో నొకానొకదినమున వేఁటతమకమున నున్న బాలాజీవిశ్వనాథుని సేవకునిచే దైవవశమునఁ జంద్రసేనరాయని సేవకుఁ డొకఁడు గాయ మొందెను. అజ్ఞానకృతమగు నీప్రమాదమాధారముగఁ గొని, బాలాజీవిశ్వనాథుని విపన్నునిఁ గావింప నెంచి, సేనాపతి చంద్రసేనరావు తన సేనావాహినిఁ గొని చని, యాతని నాకస్మికముగ నాక్రమించెను.

### బాలాజీవిశ్వనాథుని పలాయనము.

ఆసమయములో బాలాజీవిశ్వనాథుని, బాజీరావు, చిమణాజీ అప్పా అనుయిరువురు కొమరులును, మిత్రవరుఁడగు అంబాజీపంతుపురందరేయును, స్వల్పసంఖ్యాకులగు అశ్వారోహకులును, సాన్నిధ్యమున నొప్పియుండిరి. చంద్రసేనరాయకృతమైన యీ యాకస్మికదురాక్రమణముఁ గని, మిగుల

చింత నొంది బాలాజీవిశ్వనాథభట్టు పుత్రమిత్రపరివారముగ నాత్మరక్షణాభిలాషియై పరుఁగిడి ప్రప్రథమమున సానవాఁడు గ్రామమందలి పురందరుదుర్గములోఁ బ్రవేశించెను. పురందరుదుర్గేశుఁడు బాలాజీవిశ్వనాథునకుఁ గడుఁ గూర్చుమిత్రుఁడు. ఐన నేమి? యాతఁడు చంద్రసేనరావునకు వెఱచువాఁడు. సేనాపతి క్రూరదృష్టికి బాత్రుఁడైన, బాలాజీవిశ్వనాథుని మైత్రియే ప్రధానమని తలంచి యాతని కాశ్రయత్వమొసఁగి, చంద్రసేనరావునకు విరుద్ధముగఁ బ్రవర్తించుట యనర్థదాయకమని నిశ్చయించి పురందరుదుర్గేశుఁడు బాలాజీవిశ్వనాథున కాశ్రయత్వమొసఁగినవాఁడు కాఁడయ్యెను. విధి విపక్షపక్షమూనినయెడ మిత్రు లేమి చేయఁగలరు! బంధువు లేమి చేయఁగలరు! అంత బాలాజీపంతు నిరాశ్రయుఁడై, తన్ను సేనాసహితముగ వెన్నంటి తఱుముకొని వచ్చుచున్న చంద్రసేనరావుఁ జూచి, మిగుల దిగులొంది, పరుగిడుచు తుదకు నికటవర్తియగు నొకానొకగిరిదుర్గ మాశ్రయముగఁ జేకొనెను. చంద్రసేనరావు కలుగఁజేయుచున్నతొందరకు లోనై కడగండ్లు వడుచున్న బాలాజీపంతుఁ జూచి సమీపగ్రామవాసులు మిగులఁ జాలిఁ గొని, అయిదాఱువందల సమరకుశలులును తరుణవయస్కులునగు సైనికులఁ బోగుచేసి బాలాజీపంతునకు సాహాయ్యమొసఁగ ననిపిరి. ఈసహాయ మలనడినంతనె బాలాజీపంతు నిర్భయముగ నత్యంతసాహసముగఁ జంద్రసేనరావును నీరానదీతీరమున నెదిరించి నిలిచెను. కాని బాలాజీ కలవడిన సైన్యసహాయ మతిస్వల్పమయిన దైనందున నాతఁడు బరాజితుఁడై.

పరుఁ గిడవలసినవాఁ డయ్యెను. చంద్రసేనరావతని వెన్నంటి తఱుమనారంభించెను.

## ఆపదోద్ధారణము.

అత్యంతకష్టమున బాలాజీపాండవగడు దుర్గముఁ జేరెను. ఈతఁడు దుర్గములోఁ బ్రవేశించిన కొలఁదినిమిషములలోనే చంద్రసేనరావాదుర్గమును నలువైపుల నావరించెను.

కార్యదక్షుఁడగు బాలాజీవిశ్వనాథభట్టు క్రూరకర్ముఁడు చంద్రసేనరావు బారిఁబడి పాండవగడుదుర్గమున నిడుమలఁ గుడుచుచున్నవాఁ డనువార్తను, మహారాజాసాహూ వార్తాహరులవలన విని, మిగులఁ జింతిలి, బాలాజీ కడ కభయసూచితమగుపత్రమును లిఖించి పనుపుచు చంద్రసేనరావును సైన్యసహితముగ రాజధానియగు సితారానగరమునకు రావించెను. సాహూ, బాలాజీయెడఁ గనఁబఱచుచున్న అతిశయానురాగముఁ జూచి, చంద్రసేనరావు మిగుల క్రుద్ధుఁడై "బాలాజీవిశ్వనాథుని నాయాధీనమున నిడనిచో నేను శత్రుపక్ష మవలంబన మొనర్చెదను" అను సంవాదమును సాహూ సమ్ముఖమున నుపపాదన మొనరించెను. సేనాపతి యుద్ధృతవర్తనముఁ గని సాహూ, కోపోద్దీపితుఁడై, చంద్రసేనరావును సేనాపతిపదము నుండి తొలఁగించుటకు, సర్‌లస్కర్ హైవతరావునింబాల్కరును నియోగించి సేనాసహితముగఁ బనిచెను. హైవతరావు సమ్ముఖసమర మొనర్చి చంద్రసేనరావుఁ బూర్ణముగఁ బరాజయ మొనరించెను. అంతఁ జంద్రసేనరావుమునుముందు తారాభాంగీవద్దను, పిమ్మట మొగలాయాసర్దారునొద్దను, పిమ్మట నిజాముల్‌ముల్కువద్దను ఆశ్రయగ్రహణ మొనరించెను.

ఈవిధముగ బాలాజీవిశ్వనాథభట్టు భయంకరఘోరవిపదంబుధిఁ దటించి పుత్త్రమిత్త్రులను వెంటఁగొని రాజధాని కరుదెంచెను.

### సేనాకర్త.

ప్రధానసేనాపతి చంద్రసేనరావు, శత్త్రుపక్ష మవలంబించుటవలన సాహూసైన్యము పలుచబడ నారంభించెను. అత్యాదిసుసమయమని తలంచి, రాణీతారాబాంగీ, చంద్రసేనరావు సాహాయ్యమును బడసి సాహూయాధీనములోని సర్దారులను స్వపక్షులనుగా గావించుకొొన ననేకయత్నములు సలుపుచుండెను. ఆతరుణమందు బాలాజీవిశ్వనాథభట్టు తనయపూర్వప్రతిభావిశేషమును పూర్ణముగ వికసింపఁ జేయనినాఁడు సాహూ విపన్నుఁడగుననుటకు సందియ మిసుమంతయు లేదు. బాలాజీవిశ్వనాథుని యద్భుతాద్వితీయమేధాకౌశల మాధారముగఁ గొని సాహూ తనసామంతసమూహము శత్రుపక్షమూనకుండఁ జేయుటకు సమర్థుఁడయ్యెను. అంతమాత్రమున నూరకుండక సాహూ, నూతనసైన్యసంగ్రహణ మొనర్చుటకు బాలాజీ విశ్వనాథుని నియోగించెను.

బాలాజీవిశ్వనాథభట్టు బహుసంఖ్యాకులగు యుద్ధనిపుణులును, తరుణవయస్కులును నగుసైనికులకు మిక్కుటముగ నాశ్వికదళమునను, కాల్బలమునను జేర్చి మహారాజాసాహూసేనావాహినిని మిగుల బలిష్ఠముఁ గావించెను. బాలాజీచాతుర్యమును బుద్ధికుశలతఁ గార్యదక్షతను విలోకించి సాహూ సంతోషతరంగితాంతరంగుఁడై యాతనికి 'సేనాకర్త'యను గౌరవమండితబిరుద మొసంగెను. (సేనాకర్త యనుపదమునకు Agent

in charge of the Army యని గ్రాండ్ డఫ్ దొరగా రర్థమును గావించిరి. కాని,యాయర్థము సమంజసముగ దోచుట లేదు. సేనాకర్త యనుశబ్దమునకు యథార్థమగునర్థము, 'సైన్యమునకు సృష్టికర్త' యని గ్రహించుట యుచితమని తోఁచుచున్నది. ఈ విధముగనే క్రీ. శ 1713 సం॥ రమందలి సంఘటనసందర్భముఁ గూర్చి వ్రాయునపుడీదొరగారు,Creator of the Army అను అర్థమును వ్యక్తపఱిచిరి. అయినను ప్రస్తుతసందర్భమందు వారీవిధముగ నర్థమొనరించుటకు తగుకారణ మెట్టిదో, దురూహ్యము.)

ఇదివఱకే బాలాజీవిశ్వనాథభట్టు కృషీవలుల యౌన్నత్యమున కనువగు మార్గములఁ బ్రదర్శించి, యాదాయ మభివృద్ధిం జేసి రాజ్యవిభాగమందు సువ్యవస్థఁ బొందుపఱచెను. ఇంక దేశమందు శాంతిని నెలకొలుపుటయం దనురక్తుఁ డయ్యెను.

## అరాచకము.

ఆసమయమున మహారాష్ట్రదేశము విప్లవములఁ గోలాహలమై వఱలుచుండెను. సాహుతోడియుద్ధములో పరాజయమొంది రాణీ తారాబాయి నూతనస్వతంత్రసంస్థానమును స్థాపించి కొల్హాపురమును నిజరాజధానిగ నేర్పఱచుకొని తనపుత్రుని ఛత్రపతిపదముచే నలంకృతునింగావించి దక్షిణదిఙ్మండలమున నాతనినే రాజుగా ఘోషణ మొనరించెను. ఆకారణమువలన మహారాష్ట్రసర్దారసామంతసర్దారులు కొందఱు కొల్హాపురాధిపతి శంభాజీపక్షమును, కొందఱు మహారాజాసాహూపక్షమును గ్రహించిరి. ఇంకఁ గొందఱు మొగలాయీపక్షముఁ జేకొనిరి.

కొందఱు సుప్రసిద్ధసాహసయోధులే పక్షముఁ జేకొనక, స్వయంప్రధానులై స్వతంత్రత ఘోషింప మొదలిడిరి. ఈ శేషోక్తశ్రేణిలో దామోదరజీ(దామాజీ)ఖోరాతీను, ఉదయజీచౌహానును ప్రధానస్థాన మలంకరించినసర్దారులు. ఉదయజీ చౌహా నొనరించిన యుపద్రవములఁ గని యించుకధైర్యము చెడి, సాహూ, తనరాజ్యమందలి యొకభాగములో చౌతు (ఆదాయములో నాల్గవవంతు) గ్రహణమున కధికారమొసఁగి, యాతనికి స్వత్వపత్రమును సమర్పించుటకు బాధ్యుఁడు గావలసివచ్చెను. కాన్హోజీ ఆంగ్రే కొల్హాపురాధిపతిపక్షమును గ్రహించి సాహూఅధికృతమగు కళ్యాణపురమును జయించునుద్యోగమును వహింపఁ బూనుచుండెను. మఱియొకవంక రాజోపాధిధారియగు కృష్ణరావు ఖటావుకర్ అను బ్రాహ్మణుఁడు, ద్రోహియై రాజ్యమందు ఘోరోపద్రవ మొనరించుచుండెను. వీరలు గాక తదితరసామంతగణములోని శూరాగ్రేసరులు కొందఱు సాహూఅధీనతాస్వీకారమునకుఁ దమయసమ్మతత్వమును ప్రకటించుచుండిరి.

కృష్ణారావుఖటావు కరదండనము.

ఈయరాజకస్థితియందు విద్వేషుల దండన మొనరింపమి స్వదేశవాసులకు సౌఖ్యములవడుట దుర్లభమని తలఁచి విశ్వనాథభట్టు, 'కార్యంసాధయే ద్వా శరీరంపాతయే ద్వా' యను ఘోరప్రతిజ్ఞఁ బూని ప్రథమమున కృష్ణరావుఖటావుకరును దండించుటకు సాహూజీయాజ్ఞఁ గొని యుద్ధయాత్ర కరిగెను. ఆసమయముననే సచివుఁడగు నారాయణశంకర్ దామాజీ ఖోరాతుతోను పేష్వయగు భైరవపంతు పింగళే.

కాన్హోజీ యాంగ్రేతోను యుద్ధమొనరింప ప్రేరితులైరి. సాహూ ఆజ్ఞానుసరణముగ యుద్ధాభిమానము లొనరించిన ముప్వురు నాయకులలోఁ బాలాజీవిశ్వనాథభట్టుమాత్రమే సఫలమనోరథమును వడసెను. కృష్ణరావుఖటావుకరు, బాలాజీ విశ్వనాథుని, 'అవుద్దిను'అనుస్థానమం దెదుర్కొని సంపూర్ణముగఁ బరాజయమొంది పలాయితుఁ డయ్యెను.

దామాజీథోరాతుతోడి యుద్ధమున సచివనారాయణ శంకరుఁడును కాన్హోజీయాంగ్రేతోడి యుద్ధమునఁ బేష్వా భైరవపంతుపింగళేయును పరాజితులగుటయే కాక బందీకృతులగుటకూడ సంభవమయ్యెను.

కాన్హోజీ యాంగ్రే పేష్వాభైరవపంతుని నోడించి యాతని బందీకృతునిగావించి యంతటితో శాంతినొందక, 'లోహగడు' ప్రభృతిస్థానములను వశమొనర్చుకొని సాహూరాజధానియగు సితారానగరాక్రమణమున కుద్యోగమొనరింప మొదలిడెను.

## కాన్హోజీయాంగ్రేతోడిసంధి.

అంతఁ గాన్హోజీయాంగ్రేను దండించుభారము బాలాజీ విశ్వనాథుభట్టు గ్రహింపక విధిలేనిదయ్యెను. అందువలన నాతఁ డిరువదివేల సైనికుల వెంటఁ గొని యాంగ్రేతో సమర మొనర్చుటకుఁ బ్రస్థానమొనరించి తన యద్వితీయశౌర్యసాహసములఁ బ్రకటించి, శత్రుసేనలను సంపూర్ణముగ సంహరించి విపక్షపక్షమైన లోహగడ ప్రభృతిసాహూస్థానములను వశమొనర్చుకొనుటయేగాక, మహారాష్ట్రరాజ్యసింహాసనమునకు క్రమమయిన యధికారియగు మహారాజాసాహూ యాధీన

మును స్వీకరించి యాతని శరణమును వేడుకొనిన శ్రీ మోదా యకమగునని సూచించుచు యుక్తియుక్తముగ నొకపత్రమును లిఖించి యాంగ్రే కడకుఁ బనిచెను. బాలాజీయవలంబించిన యీసామోపాయము ఫలవంతమై మహారాష్ట్రసింహాసనము నకు సుఖమొసంగెను.

బాలాజీహస్తలిఖితమగు పత్రముఁ జూచి మిగుల సంతసించి కాన్హోజీ, కొల్హాపురాధిపతిపక్షముఁ బరిహరించి సాహూపక్షముఁ బరిగ్రహించెను.

సాహూకాన్హోజీలకు బాలాజీ మాధ్యస్థమునఁ జరి గిన సంధినియమముల ననుసరించి పేష్వాభైరవపంతుపింగళె చెఱవిముక్తిపడయుటయు నింతకుఁ బూర్వము కాన్హోజీ బల పూర్వకముగ నాక్రమించుకొనిన రక్షకస్థానములు, దుర్గములు మొదలుగాఁగలవానిలో 'రాజమాజీ' దుర్గము తప్ప, మిగిలిన జనపదములు రక్షకస్థానములు దుర్గములు సాహూ వశమగు టయు ననునవి యముఖ్యఫలములు. ఇందులకు ప్రతిఫల ముగ, సాహూ, పది బలిష్ఠదుర్గములను, బదునాఱుసామాన్య దుర్గములను, మహారాష్ట్రతరణిసమూహాధికారమును కాన్హోజీ కొసఁగి, యాతని 'సర్ ఖేల్' పదమున నుపస్థితునిఁ గావించెను.

### పేష్వాపదప్రాప్తి.

దుర్జయవిద్వేషియగు కాన్హోజీ యాంగ్రే బారినుండి పేష్వాభైరవపంతు పింగళేను ఈవిధముగ విముక్తునిఁ గావించి సంధిబంధమునఁ గాన్హోజీని బంధించి మహారాష్ట్రసామ్రాజ్య సంరక్షణ ప్రధాననాయకులలో నాతని నొకనిగాఁ గావించెను. దుర్గూహరాజనైతికవిస్మయకరకార్యదక్షుఁడగు బాలాజీవిశ్వ.

నాథభట్టు క్రీ. శ. 1713 సం॥ రమందలి శేషభాగములో సితారానగరమునకు మఱలి చనుదెంచెను. కార్యసాఫల్యమును వడసి చనుదెంచిన బాలాజీవిశ్వనాథునిఁ గని సాహూ మిగులసంతుష్టుఁడై యాతని ననేకవిధసన్మానములఁ బురస్కృతిని గావించెను.

పేష్వా భైరవపంతుపింగళె కాన్హోజీ యాంగ్రెబారిఁ బడిబందీకృతుఁడగుటయు ననేకకార్యములలో నఫలతాభావుఁడగుటయుఁ గని సాహూ యాతని కార్యదక్షతావిహీనతఁ గ్రహించి యాతనిఁ బదచ్యుతునిఁ గావించి తత్పదమునఁ బాలాజీవిశ్వనాథునిఁ బ్రతిష్ఠించెను.

బాలాజీ విశ్వనాథభట్టు తన యజేయకార్యకుశలతాపురస్కారమున క్రీ. శ. 1713 సం॥ రము నవంబరు తే 16 దీని పింగళేవంశపరంపరాధికృతమగు పేష్వాపదమున నభిషిక్తుఁడై శ్రీమంతబిరుదమునకుఁ బ్రాప్తుఁ డయ్యెను. 16-11-1713 తారీఖున నుండియు పేష్వాపదము శ్రీమంతబిరుదసంయుక్తమై నడుచుఁ జొచ్చెను.

ఈయనుసరణమున, రాజకీయసంబంధములగు కాకితములపైని, పత్రములపైని బాలాజీవిశ్వనాథభట్టునామము "శ్రీమంత్ బాలాజీవిశ్వనాథ్ పంత్ ప్రధాన్" అని వ్రాయఁబడుచుండెడిది. ఆతనిముద్రికపై

"సాహూ నరపతి హర్షనిధాన్, బాలాజీవిశ్వనాథ్ హర్షప్రధాన్."

అని లిఖింపఁబడియుండెను.

(క్రీ.శ.16-11-1713 సం॥ రము మొదలు పేష్వాల ముద్రికలోని 'ప్రధాన్' అనుపదములోని నకారము (न) ఈవిధముగా

నుండుటకు మారుగ (ञ) ఈవిధముగ తలక్రిందుగా లిఖితమగు చుండెడిది. ఇట్లు లిఖించుటకు కారణ మిది యని చెప్పుదురు. ఇంతకుఁ బూర్వము, ఛత్రపతిశివాజికాలమునుండి 16-11-1713 దనుకఁ బింగళేవంశీయులు పేష్వా యను సుప్రసిద్ధపదమునఁ బ్రతిష్ఠితు లగుచుండిరి. పిమ్మట మహారాజాసాహూ 16-11-1713 తేదీని పింగళేవంశీయుల హస్తగత మైన పేష్వా పదవిని వారినుండి చేకొని భట్టువంశీయులకు సమర్పించెను. ఈ వంశాంతరచిహ్నానిరూపణమునకునై 'ప్రధాన్' శబ్దములోని(न) నకారము విపరీతభావముగ లిఖితమగుటకు కారణము సాహూ కర్తృకప్రవర్తనమని చెప్పుదురు).

బాలాజీవిశ్వనాథభట్టు తనకు పేష్వా పదప్రదానకాలమందు తన ప్రియబంధువు అంబాజీపంతుపురందరేను తన కుపమంత్రిగా నియుక్తునిఁ గావించెను. బాలాజీవిశ్వనాథుని యనురోధమువలన సాహూ, హరిమహాదేవుభానూజీని పేష్వా యాధీనమున "ఫడ్నవీశ్" (Auditor) పదమున నియుక్తునిఁ గావించెను.

పదిసంవత్సరములక్రిందట సిద్దీసర్దారునకు వెఱచి స్వదేశపరిత్యాగ మొనరించిన బాలాజీవిశ్వనాథభట్టు సితారానగర మరుదెంచి నూఱురూప్యముల వార్షికవేతనముపై నొక సామాన్యసేవకుఁడుగ నియుక్తుఁడై తనయసాధారణప్రతిభా ప్రభావమున నేడు మహారాష్ట్రసామ్రాజ్యమునకుఁ బ్రధానమంత్రియై, సహాయాత్రికులగు బంధుమిత్రులను నాశ్రితులను యోగ్యతానుసరణముగ నుచ్చపదములఁ బ్రతిష్ఠితులఁ గావింప సమర్థుఁ డయ్యెను.

(చరిత్రకారులు పలువురు బాలాజీవిశ్వనాథుఁడే ప్రథమ పేష్వాయని యభిప్రాయపడిరి. కాని యయ్యది సమంజసమయి యుండలేదు. బాలాజీ మహారాష్ట్రసామ్రాజ్యములో పేష్వ పద మందినవారిలోఁ బ్రథముఁడు కాఁడు. భట్టవంశీయులలో పేష్వాపదమందినవారిలోఁ బ్రథముఁడు. మహారాష్ట్రరాజ్యము నకు ప్రథమమున పేష్వాపదమునఁ బ్రతిష్ఠితుఁడైనవాఁడు పింగళేవంశములోనివాఁడు.

## సిద్దీసర్దారుల పరాజయము.

మహారాజాసాహూతో నొనరించిన సంధినియమముల ననుసరించి కాన్హోజీయాంగ్రే, శ్రీవర్ధనప్రభృతి కతిపయరక్షక స్థానములను దుర్గములను వడసెను. అట్లు వడసినదుర్గములలోఁ గొన్ని సిద్దీసర్దారులయధికారాధీనములై యుండెను. వానియు ద్ధారణార్థము ఆంగ్రే, పేష్వబాలాజీవిశ్వనాథుని సాహాయ్య మభిలషింపవలసినవాఁ డయ్యెను. క్రీ. శ. 1715 సం॥ రము జనవరినెలలో దుర్ధర్షజంజీరా సిద్దీసర్దారులను పేష్వాసాహా య్యముఁ గొని కాన్హోజీయాంగ్రే పరాజయ మొనరించి వారి యాధీనమైన ప్రదేశములఁ దనయధికారమునకు లోఁగొనెను.

## దామోదరజీద్రోహము బాలాజీబంధనము.

ఈవల దామోదరజీఖోరాత్ మహోపద్రవము సలుపు చుండెను. అతఁడు కోల్హాపురాధిపతి శంభాజీపక్ష మవలంబించి సాహూరాజ్యములోని గ్రామములఁ గొన్నిటి దోఁచుకొనుచు కొన్నిటిఁ దగులఁ బెట్టుచు, ప్రజలను మహాకష్టములపాలు చేయుచున్నందున, నాతనిఁ దండించుట యత్యంతావశ్య మని బాలాజీ నిశ్చయించి తదుద్యోగమున నొప్పియుండెను.

దామోదరజీ ప్రథమమునఁ బూనానగరమునకుఁ బూర్వదిగ్భాగమున నలువదిమైళ్లదూరమున నున్న "హింగన్" గ్రామమందలి సుదృఢదుర్గమున కధిపతి. పిమ్మట నాతఁడు దన దార్ఢ్యమువలన హింగన్ గ్రామమునకు నలుదిక్కుల వ్యాప్తమయిన నలువదిమైళ్లప్రదేశమునఁ దనశాసనాధికారముఁ బ్రతిష్ఠించెను.

బాలాజీవిశ్వనాథుని సమరసన్నాహముఁ జూచి భయమొంది దామోదరజీ క్రీ. శ. 1713 సం॥ రము సెప్టెంబరు నెలలో కపటపూర్వకముగ సంధిగొఱకు వేఁడుకొనుచు, బిల్వపత్రమును, హారిద్రాచూర్ణమును స్పృశించుచు, శంభాజీపక్షమును విడనాడి సాహూయాధీనమున కొడఁబడితినని ప్రమాణమొనర్చుచు, హింగన్ దుర్గమును బాలాజీకి సమర్పించెను. అంతటఁ బాలాజీ విశ్వనాథభట్టు దామోదరజీకృత కృత్రిమమైత్రిగుఱ్తెఱుఁగక స్వల్పసంఖ్యాకులగు సైనికులఁ దోడ్కొనిచని దుర్గములో ప్రవేశించెను. అయ్యది తగుసమయమని తలఁచి విశ్వాసఘాతకుఁడును, మహాపాపాత్ముఁడును నగు దామోదరజీ వారలఁ బంధించెను. ఇదివఱకు బాలాజీవిశ్వనాథుఁడు సితారానగరము విడిచి యేసందర్భమున నచ్చటికేఁగినను, బాజీరావు, చిమణాజీలను తనయిరువురికొమరులను వెంటఁగొనిచనుచుండుట వాడుకయై యుండెను. ఆనాఁడుకూడ నాతఁడు తన యిరువురికొమరులతో హింగన్ దుర్గమునఁ బ్రవేశించి బందీకృతుఁడయ్యెను. మిత్రహంతకుఁడగు దామోదరజీ వారలఁ బ్రేమతో గౌరవముతో నాదరించుటకు మాఱుగ బందీకృతులఁ జేయుటయే కాక కష్టములపాలు

గావించెను. బందీగణమును క్షుత్పిపాసలకు లోనొనర్చెను. బాలాజీపంతుని సపుత్రపరివారముగ, విశేషధన మొసఁగినచో, బంధవిముక్తి నొసఁగెదనని దామోదరజీసాహూకడకు వర్తమాన మంపెను. అంతట సాహూ, తనకాప్తుఁడైన బాలాజీ విశ్వనాథుని సపుత్రపరివారముగ, దామోదరజీ యడిగినధన మొసఁగి చెఱనుండి విడిపించెను.

దామోదరజీ బంధనము.

బాలాజీవిశ్వనాథభట్టు దామోదరజీబారినుండి ముక్తి వడసి,సితారానగర మరుదెంచి, సేనాధిపతిమానసింహుమోరే, సర్‌లస్కర్ హైవతరావు నింబాల్కరులను వెంటఁగొని యాతనితోడి విరుద్ధయుద్ధమునకు బయలువెడలెను; కాని సచివనారాయణ శంకరుఁడింకను దామోదరజీ కారాగారముననే యుండెను. ఆకారణమున దామోదరజీతో యుద్ధమొనర్చుటకుఁ బూనినచో, క్రూరకర్ముఁడా సచివమహోదయుని నేమి చేయునోయని వెఱగొందుచు, బాలాజీ ప్రథమమున యుద్ధమునకు వెఱచుచున్నవానివలె నటియించుచు నాతఁ డడిగినధన మొసంగి సచివుని విడిపించెను.

సచివనారాయణశంకరుఁ డక్షతశరీరుఁడై బాలాజీని చేరినంతనె, యాతఁడు దామోదరజీదుర్గమును నలువంకల నాక్రమించెను.

క్రీ. శ. 1717 సం॥ రము జూన్ నెలలో హింగన్‌దుర్గమును నేల గూల్చి దామోదరజీని బందీకృతునిఁ గావించి యాతని వెంటఁగొని బాలాజీవిశ్వనాథభట్టు సితారానగరమున కరుదెంచెను. బలవద్విరోధియగు దామోదరజీని బంధిం

చుట యనుమహాకార్యమును సుకరముగ సాధించిన బాలాజీ విశ్వనాథభట్టు మహారాష్ట్రులచే కొనియాడఁబడుటయే కాక తన్కాలమున మహారాష్ట్రాధిపునకత్యంతప్రేమాస్పదుఁడయ్యెను.

## ఢిల్లీ సమాచారము.

ఆసమయములో, ప్రతాపశాలియనియు రాజనీతికుశలుఁడనియుఁ బేరువడసిన ఔరంగజేబుచక్రవర్తియొక్క ప్రపౌత్త్రుఁడు ఫరుక్‌సియరుచే ఢిల్లీసింహాసన మలంకృతమై యుండెను. ఆతఁడు సైయద్ అబ్దుల్లాఖాను సైయద్ హుసేనాలీఖాను లను నిరువురిసర్దారుల చేతులలో ననేకవిషయములయందుఁ గ్రీడాకందుకముఁ బోలి యుండనలసినవాఁ డయ్యెను.

అక్కతమున ఢిల్లీశ్వరుఁడును, ఆతనియాంతరంగికులును, ఆత్మీయులును, పరిషద్వర్యులగు నీయిరువురిసయ్యదుల వినాశార్థ మనేకోపాయములఁ బన్నుటకుయత్నింపఁ దొడంగిరి. అందువలన ఢిల్లీనగరములో మహోపద్రవము లుదయింపసాగెను.

ఈవల దక్షిణభారతములోని సమస్తపాదుసాహీప్రదేశములయందు, చౌతుప్రథాప్రవర్తనాధికారమును వడయుటకు మహారాష్ట్రవీరులు విప్లవములు సలుపఁజొచ్చిరి. పేష్వాబాలాజీవిశ్వనాథ్ అంతర్విగ్రహనివారణముకొఱకు, తన సమగ్రసమయమును యావచ్ఛక్తిని వినియోగపఱచుచుండినను, ఖండేరావు, దాభాడేప్రభృతి వీరసేనానులు పూనానగర మాక్రమించి మించుటవలన, సుబేదారు సైయద్ హుసేను అలీ యొక్క బలవిభవము జర్జరిత మగుచుండెను.

ఈవిధముగ నుభయసంకటమధ్యమునఁ బతితులైన

సైయదులు మహారాజుసాహుతో నొడంబడిక నెఱపుకొని దక్షిణమున శాంతిస్థాపన మొనర్చుటకు సంకల్ప మూనిరి. కాని, బాదుసాహు, మహారాష్ట్రులకు, చౌతుప్రధాపరివర్తన, సర్‌దేశముఖిసత్వగ్రహణాధికారాంగీకృతసూచక మగుసత్వపత్రప్రదానమున కంగీకరింపఁడయ్యె. ఈమతభేదోపలక్షణము క్రీ. శ. 1717 సం॥ రములోఁ బాదుసాహునకును, యిరువురు సైయదులకును నడుమ యుద్ధరూపముగ పరివర్తన మయ్యెను. ఈసందర్భములో సైయదుహుసేనాలి మహారాష్ట్రాధిపుని సాహాయ్య మభిలషింపవలసినవాఁడై, యాతఁడు ఈ ప్రస్తుతయుద్ధవిషయములో పదునైదు వేలరణకుశలులగు సైనికుల నొసఁగి సాయపడినచో ప్రతిఫలముగ నర్మదానదికి దక్షిణమున నున్న సమగ్ర మొగలాయీశాసితప్రదేశములయందు సర్‌దేశముఖిచౌతుప్రధా ప్రవర్తనాధికారమును కూర్చి బాదుషామూలకముగ సత్వపత్ర (సనదు) ప్రదాన మొనరించుటకును, సేనాభరణపోషణములకు గాను పదునైదులక్షల రూప్యముల నొసంగుటకును సిద్ధముగ నున్నాఁడను" అని సాహూకడకు పత్రమును లిఖించి పనిచెను.

పేస్వా బాలాజీవిశ్వనాథుని ప్రతిభామండితప్రయత్నము నీతరుణమునకు మహారాష్ట్రసామ్రాజ్యమునందంతర్విగ్రహము నంత మొనరించి, శాంతిని నెలకొల్పి రాజ్యమం దంతటను సాహూ ఏకాధిపత్యమును వఱలఁజేయుచుండినందున సాహూ సైయదుహుసేనాలీ కోరినమేఱకు సాయ మొసంగుటకు సమర్థుఁడై యుండెను.

## సంధిసందేశము.

పేస్వాబాలాజీవిశ్వనాథపంతు మహారాష్ట్రాధిపుని పక్ష

మున సైయదుహుసేనాలీ కోరినమేరకు సైనికులఁ గొని చన నుద్యుక్తుఁడై, తదుపకృతికి సీనిమ్నలిఖితనియమసమూహముఁ బాలింప వేఁడుకొనుచు నొకసందేశ మాతనికడ ప్రేరణ మొనర్చెను.

1. ఛత్రపతిమహారాజు శివాజీయుపార్జితమైన స్వరాజ్యము, మహారాష్ట్రాధిపతి స్వేచ్ఛానుభవమునకు స్వత్వదాన మొసఁగవలయు.

• (ఈస్వత్వము సాహూబంధముక్తిసమయమున క్రీ. శ. 1707 వ సంవత్సరములో మొగలాయీసామ్రాట్టగు ఔరంగజేబు కర్తృకప్రదత్తము అయినను దక్షిణభారతమునకు సుబేదారుగ నియమింపఁబడిన నిజాముల్ముల్కు హైదరాబాదునవాబు ఈస్వత్వమును బాటింపక మహారాష్ట్రస్వరాజ్యములోని యనేకదేశములఁ దనయధికారమునకు లోఁగొనవలెనని మాటిమాటికి యత్న మొనరించుచు వచ్చుచుండుటవలన సాహూ,బాదుషాతో ద్వితీయపర్యాయము స్వత్వప్రదానముఁ గూర్చి ప్రస్తావన మొనర్చవలసివచ్చెను.)

2. దక్షిణదిగంతర్గతమగు బీజాపురము, హైదరాబాదు, కర్ణాటకము, తంజావూరు, తిరుచినాపల్లి, మైసూరు ప్రభృతి ప్రదేశములయందు చౌతుప్రథాప్రవర్తనమునకును, సర్దేశముఖిసంగ్రహణమునకును స్వత్వ మొసంగవలయు.

3. మహారాష్ట్ర స్వరాజ్యసామ్రాజ్యసంస్థాపకుఁడగు శివాజీ జన్మస్థానమగు శివనేరీదుర్గమును త్ర్యంబకదుర్గమును మహారాష్ట్రపతికిఁ బ్రత్యర్పణ మొసంగవలయు.

4. ఢిల్లీనగరములో మొగలాయీయాధీనమున నివసించు

చుండిన సాహూజనని బరివార సహితముగ స్వదేశగమన మున కనుజ్ఞ నొసఁగవలయు.

(క్రీ. శ. 1700 వ సం॥ రములో సాహూ యాతనిజన నియు ఔరంగజేబుచే ఢిల్లీనగరమునకు చెఱగొనిపోఁబడిరి. పిమ్మట క్రీ. శ. 1707 వ సం॥ రములో ఔరంగజేబు సాహూ మహారాజునకు మాత్రమే స్వదేశమున కరుగ ననుజ్ఞ నొసఁగి యుండినందున యసోదావాంగ్ మొదలగు సాహూయాత్మీ యగణము మొగలాయియాధీనమున ఢిల్లీనగరములో వసి యించుచుండిరి. ఢిల్లీనగరమునుండి జననిం గొనితెచ్చుటకు సాహూ యెంతప్రయత్నించినను కొనసాగనందున నీసందర్భ ములో నయ్యది యుదాహరింపవలసివచ్చెను.)

5. సేనాసాహిబ్ సుబే, కాన్హోజీభోసలా యధికారము లోని గొండావనము, బీరాగు దేశములను స్వరాజ్యమునఁ జేర్చు కొనుటకు మహారాష్ట్రపతి కనుజ్ఞ నీయవలయు.

6. శంభాజీశివాజీలు, తమభుజబలమునలన నేమి, మఱి యేయుపాయమువలన నేమి కర్ణాటకమండలి యేయేప్రదేశ ములలో తమ యధికారమును సాగించి యుండిరో, ఆయా ప్రదేశములను వారలకు నుత్తరాధికారియగు సాహూజీ కొసఁ గవలయు.

7. శివాజీ యధికృతమైనట్టియు ప్రస్తుతము పాదుషా యాధీనములో నున్నట్టియు ఖాందేశములోని ప్రదేశములకు మాఱుగ, మహారాష్ట్రదేశమునకుఁ బూర్వదిగంచలస్థితము లగు పండరపుర మాదిగాఁగల స్థానములను శివాజీవంశీయుఁ డగు సాహూమహారాజున కొసఁగవలయు.

ఢిల్లీబాదుషా, ఫరుక్‌సియరు పైనుదహరించిన నియమానుసరణిని స్వత్వదాన మొసఁగినచో, మహారాష్ట్రాధిపతి యీదిగువ నుదహరించిననియమములఁ బాలన మొనర్పుటకుఁ బద్ధప్రతిజ్ఞుఁడై యున్నవాఁడు.

1. సామ్రాజ్యసంరక్షణార్థము ఢిల్లీశ్వరునకు పదిలక్షల ముద్రలు బహుమాన (నజరు) మొసఁగు.

2. సర్ దేశముఖీ సత్వగ్రహణమునకుఁ బ్రతిఫలముగ, పాదుషాయాధీనములోని దేశములలో శాంతిసంరక్షణభారము గ్రహించు. ఒకవేళ విధివశమున శాంతిభంగము దటస్థమయినచోఁ బునరుద్ధారణభారగ్రహణమునకు బాధ్యుఁడుగానుండు. సర్ దేశముఖీరూపాదాయమును గ్రహించుచుండిన ప్రదేశములలోఁ జోరకిరాతాదులవలని యుపద్రవములు విఘటితములైనచో వాని నణఁచెడిబాధ్యతఁ గ్రహించు.

3. చౌతుప్రథాపరివర్తనాదాయము గ్రహించునందులకు వీరవరులును రణకుశలులును నగు పదునైదువేల మహారాష్ట్రసైనికులను నిరంతరము సర్వసిద్ధముగ సజ్జిత మొనర్చి యేసమయమున నేస్థానమున బాదుషా కవసరమగునో, ఆసమయమున నాస్థానమున మొగలాయీసేనాధిపతి కొసఁగుచుండు.

4. కోల్హాపురాధిపతి శంభాజీగాని, యాతనిపక్షగ్రాహకులగు నూరసామంతసర్దారులుగాని కర్ణాటకము, బీజాపురము, హైదరాబాదాదిప్రదేశములయం దత్యాచారములుగాని యుపద్రవములు గాని సలిపి బాదుషాపాలితులకు నష్ట మొదఁగూర్చినచో, ఆనష్టముఁ బూర్తి యొనర్పుబాధ్యత గ్రహించు.

## ఢిల్లీయాత్ర.

పై నుదహరించిన నియమపాలనముఁ గూర్చి యిరువు రు సైయదులుఁ దమయంగీకారముఁ బ్రకటించినంతనె సాహూ తనపక్షమున సేనాపతి మానసింహమోరే, పరసోజీభోసలా, శంభాజీ భోసలా, విశ్వాసరావుపవారాదిసేనానులతోఁ బదు నైదువేలతరుణమహారాష్ట్రవీరులను సైయదులసాహాయ్యార్థము ఢిల్లీనగరమున కరుగ నాజ్ఞ నొసఁగెను. ఢిల్లీనగరమున కరుగు సేనానులపైఁ దత్త్వావధాని (Field-marshal) గ పేష్వ బాలాజీ విశ్వనాథభట్టు నియోగింపఁబడెను.

పేష్వా, సేనాసహితముగ ఢిల్లీనగరమున కరుగనున్నతరుణమందు, దౌలతాబాదు, చందాదుర్గముల గురించియు, గుజరాతుమాలవదేశములలో చౌతుప్రథాప్రవర్తనాధికారముఁ గూర్చియు పాదుషాతో ముచ్చటింపవలయునని యాతనికి సాహూ హెచ్చరించెను.

శత్రువిజయినీ మహారాష్ట్రవీరవాహిని క్రీ. శ. 1718 సం॥ రమంగలి శేషభాగములో సితారానగరమునుండి బయలుదేఱి ఢిల్లీనగరాభిముఖమై చనియెను. తరుణవీరుఁడగు బాజీరావు, ఢిల్లీనగరసందర్శనలాలసుఁడై నిజజనకుని వెంబడించి చనియెను.

మహారాష్ట్రసైన్యము ఢిల్లీనగరమున నుపస్థితమయినంతనె తన్నగరములో కాలపురుషుఁడు తనవక్త్రగహ్వరముఁ దెఱచి లోలజిహ్వనాడించుచు విప్లవరూపమునఁ దాండవమాడ నారంభించెను. ఈనూతనోదితభయదవిప్లవము విద్రోహాగ్నిజ్వాలల ప్రజ్వలింపుచుఁ బాదుషాఫరుక్సియరును నామమాత్రావశిష్టుఁ

గావించెను. అంతట సైయదులకటాక్షవీక్షణాప్రసాదితుఁడైన
మహమ్మదుషా ఢిల్లీసింహాసనాధిరూఢుఁ డయ్యెను.

### స్వత్వపత్ర (సనదు) ప్రాప్తము.

పాదుషా దర్బారునందు సర్వాధికారము వహించిన
యిరువురుసైయదుసర్దారులుఁ బూర్వోక్తనియమానుసరణము
గ మహారాష్ట్రపతికి పేష్వామూలకముగ స్వత్వపత్రదాన మొనఁ
గిరి. అంతటఁ ఢిల్లీనివాసులగు రాజద్రోహులునుఁ బరాజిత
సర్దారులు క్రోధావేశపరవశులైరి. వారిక్రోధము మొగలా
యీలయెడమాత్రమే కాక మహారాష్ట్రులయెడఁ గూడ నవధిఁ
గానకుండెను. ఒకనాఁడు పేష్వ బాలాజీపంతు యిరువురి
సైయదులతో కలసి, బాదుషాకొలువుకూటమున కేఁగుచుండు
సమయమున విశ్వాసఘాతకులును, రాజద్రోహులును నగు ఢిల్లీ
నగరవాసులు కొందఱు మహారాష్ట్రుల నాకస్మికముగ నాక్ర
మించిరి. ఈయతర్కితవిఘటితదుర్ఘటమువలన శంభాజీభోసలే,
బాలాజీ, మహాదేవుభాను మొదలుగాఁగల పదునైదువందల
మహారాష్ట్రసైనికులు వీరస్వర్గముఁ జూఱఁగొనిరి. ఇంతకు
నాల్గుగుణము లధికముగఁ ద్రోహిగణము యమలోకమార్గ
మనుసరించి చనియెను. సైయదులప్రోత్సాహమున ఢిల్లీశ్వ
రుఁడు యథాసాధ్యముగ మహారాష్ట్రులకు సంభవించిన నష్ట
మును ధనరూపమున బూర్తి యొనరించి వారలను సంతసపఱి
చెను. లేనిచో మహారాష్ట్రుల నిష్ఠురకోపానలజ్వాలల కాహు
తియై ఢిల్లీనగరము భస్మీభూతముఁ గావలసినదే.

క్రీ. శ. 1719 సం॥ రం. మార్చి తే 3 దీని, వజీరాజమ్
అబ్దుల్లాలీఖాన్, హుసేనాలీఖాను లను నిరువురు సైయదులు

నూతనప్రతిష్ఠితఢిల్లీశ్వరుఁడు మహమ్మదుషాబాదుషాహస్తాక్షర ముద్రాంకితమైన స్వత్వపత్రమూలమున, మహారాష్ట్రులకు స్వరాజ్య చౌతు ప్రథాప్రవర్తనసర్ దేశముఖీస్వత్వసంగ్రహణాధికారములను సంపూర్ణముగ సమర్పించిరి. (చౌతుసర్ దేశముఖులు స్వరాజ్యస్వత్వమున కుపభోగములుగఁ పరిగణింపఁబడెను.

మహారాష్ట్రములో శివాజీయధికృతప్రదేశసమూహము స్వరాజ్యమని విఖ్యాతము. స్వరాజ్యమన, పూనా, సూపా, ఇందాపురము, ఉజాయి, తారలే, సితారా, కహాడు, ఖటావ్, మాను, ఫలటను, మలకాపురము, పహాలా, అజేరా, జున్నారు, కొల్హాపురము, కొంకణమును, తుంగభద్రానదికుత్తరమున నున్న, కోయల, గదక, హాలాలు పరగణాసమూహము పరిజ్ఞాతము.

ఈసందర్భముననే సాహూజననియు, ఆతనియాత్మీయవర్గమును స్వదేశగమనమున కనుజ్ఞఁబడసిరి. This acquisition gained to the Maratha Power that legitimacyin the absence of which it is not possible to distinguish power from force. Justice M. G. Ranade's *Rise of the Maratha Power.*

సాహూపక్షమున పేష్వాబాలాజీపంతు ప్రతిష్ఠితసంధి నియమములలోఁ గొన్నిఁటిని గూర్చి తనయనస్మృతమును వజీరాజిమ్ సైయదు అబ్దుల్లాలీఖాను, ప్రకటించెను. ఆవివరమీమాంసదర్భమునఁ బొందుపఱచుట యావశ్యకముగఁ దోఁచుటవలన నుదాహరించితిమి.

1. ఖాందేశాంతర్గతములగు మహారాష్ట్రాధికారములోని నను స్తదుర్గములును,

2. త్ర్యంబకదుర్గమును దానిననుసరించి నలుదిక్కుల వ్యాప్తమైన ప్రదేశమును,

3. తుంగభద్రానదికి దక్షిణదిక్కునతములగు మహారాష్ట్ర విజయప్రదేశములును,

4. సేనాసాహిబ్ సుబే కాన్హోజీభోసలే తనయధికారమునకు లోఁగొనిన బీరారు. అంచలమున నున్నసమస్తప్రదేశములును,

స్వరాజ్యమునఁ జేర్చుకొనుట కంగీకరించుట లేదు.

5. గుజరాతుమాలవదేశములలో చౌతుప్రథాప్రవర్తనమునకుఁ బ్రస్తుత మధికార మొసంగుట లేదు. కాని, సమయాంతరమునం దధికార మొసఁగుట ప్రమాణపూర్వకముగ వాగ్దాన మొసఁగెను.

పేష్వ బాలాజీ విశ్వనాథపంతు, స్వరాజ్యపత్రదానమును వడసి, బుద్ధిమంతుఁడును, రాజనైతికవిద్యా విశారదుఁడును నగు 'దేవరావుహింగణే' యనునొక మహారాష్ట్రబ్రాహ్మణుని సాహూపక్షమునఁ బాదుషాకొలువుకూటములోని మాంత్రిక వర్గములో నొకనిగా నియమించి ఢిల్లీనగరమందుంచి స్వదేశ యాత్రాభిముఖుం డయ్యెను.

మార్గమధ్యమున సునీతిచక్రచూడామణి యనుబిరుదముఁ గైకొనిన పేష్వ బాలాజీవిశ్వనాథపంతు, జయపుర జోధపుర ముదయపుర మాదిగాఁ గలరాజేంద్రబృందమును సందర్శించి మహారాష్ట్రాధిపునకు రాజపుత్రుల నిష్కపటమైత్రి సంపాదించి యొసఁగెను.

### మలహారురావువలనఁ బాజీరావునకలఁబడిన యవజ్ఞ లె.

క్రీ. శ. 1719-వ సం. రమందలి మొదటి రెండుమాసములలో మహారాష్ట్రసైన్యము ఢిల్లీయం దుపస్థితమై యుండెను. తత్సేనాశిబిరము యమునానదికి దక్షిణతట భూప్రదేశములో సన్నివేశితమై యుండెను. శిబిరమునకు నికటస్థక్షేత్రసస్యములకు సైనికగణము నష్టమాపాదింపకుండ నుండునటుల నామరికకర్మచారుల నుగ్రశాసనపాశబద్ధులఁగావించి బాలాజీపేష్వా యథోచితోపాయావలంబన మొనర్చి యుండెను. అట్టిసమయమున సుప్రసిద్ధసర్దారుఁడగు మలహారురావుహోల్కరు పేష్వా ప్రకటిత యుగ్రశాసనముల్లంఘించి యొకానొకదినమున స్వదళస్థాశ్వపోషణార్థ మొకానొక కృషికుని క్షేత్రములోని సస్యములను బలపూర్వకముగ గ్రహించెను. అనంతర మచిరకాలములో హోల్కరు సల్పినయకృత్యముఁ గని తత్క్షేత్రాధిపతి విచారపూరిత మనస్కుఁడై "మహారాష్ట్రసైనికులు నాక్షేత్రములోనిసస్యమును బలాత్కారముగ గ్రహించి నాకమితనష్టముఁ గలిగించి"రని పేష్వా సమక్షమున నభియోగముపస్థిత మొనరించెను. అంతట బాజీరా వీయభియోగమునకు కారకుఁడైన ప్రకృతాపరాధి ననుసంధాన మొనరించుటయందు ప్రవృత్తుఁ డయ్యెను. ఆతఁడు శిబిరములోని యశ్వాలయములఁ బ్రత్యేక ప్రత్యేకముగఁబర్యావేక్షణ మొనర్చుచు రానురాను మలహారురాయని యశ్వశిబిరమునకు సమ్ముఖుఁడై సద్యశ్ఛేదిత సస్యరాశింగనుంగొని యందలి యశ్వపాలకులలో నొకని నస్యలుంఠనాపరాధిగాఁ గ్రహించిస్వహస్తస్థితమగు బెత్తముతో వానిఁ బ్రహరించెను.

బాజీరాయనికృతకృత్యమున నతిదూరమున నున్నమల
హారురావు హోల్కారు తిలకించి క్రోధోన్మత్తుఁడై, కాండజ్ఞాన
విహీనుఁడై తరుణవీరుఁడగు బాజీరాయనిఁ బరుషవాక్యములచే
నొప్పించి యంతటఁ దనివినొందక లోష్టాప్రహారునిఁ గావించి
యవజ్ఞతఁ జేసెను.

మలహారురావుహోల్కారు పేష్వావలన వేతనముఁ బడ
యుసర్దారుశ్రేణిలో నింతదనుక సన్నివేశతఁ గనలేదు. కేవ
లము పేష్వాకు సహాకారియై దళసహితముగ ఢిల్లీనగర మరు
దెంచి యాతనిఁ గలసెను.

హోల్కారొనర్చిన యవజ్ఞతకు బాజీరావు సాధారణ
మానవులవలె శాంతచ్యుతుఁడైనచో తత్క్షణమున మలహారు
రావుతో ద్వంద్వయుద్ధమునకు డీకొనియుండును. కాని
యాతఁడు గాంభీర్యము గనబఱచుచు శాంతచిత్తమున నిరుత్త
రుఁడై తనిశిబిరమును మఱలిపోయెను.

### అనుశాసనమున ననురాగము.

హోల్కారొనర్చినయవజ్ఞత కిసుమంతయుఁ గనలక,
సామరికానుశాసనాభిమతమునఁ బ్రశాంతచిత్తుఁడై నిజశిబిర
మున కరుదెంచిన బాజీరాయున కనిష్ట మలవడుట కవకాశ
మెటులఁ గలుగఁగలదు. ఈవిషయ మాతఁడు తనపూజ్యజనకు
నకు వ్యాకులచిత్తుఁడై విశదపఱిచి భావికర్తృకనిర్ధారణము
గూర్చి యెదురుచూచుచు నిలిచి యుండెను. మలహారురాయని
ప్రచండతోద్దండవిస్మృతకృత్యము బాలాజీవిశ్వనాథుని కోపో
ద్దీప్తునిఁ గావించి యాతనిసర్వస్వముఁ జూఱగొని యాతనినా
దర్శదండనమున దండితునిజేయఁ బురికొల్పెను. కాని పరిశేష

మున బాలాజీవిశ్వనాథపంతు యొకానొకయుచ్ఛపదస్థవీరసర్దారని వినయయుతానురోధప్రార్థనమునను, మలహారురావు తన యవజ్ఞత క్షమింపు మని బాజీరాయని వేఁడుకొనుటవలనను పేష్వా మలహారురాయుని క్షమించి మన్నించెను.

## ప్రాణసంకటములో మిత్రత్వము.

ఈవిఘటితఘటనము బాజీరాయనియెడ మలహారురావు హోల్కారున కత్యంత క్రోధ ముదయింపఁ జేసెను. అందువలన నాతఁడు బాజీవీరుని విపన్నునిఁ గావింప ననువగుసమయ మరసి యందు ప్రవృత్తుఁడయ్యెను. అట్లుండ ఒకానొకదివసమున బాజీవీరుఁ డొంటరిగ నస్త్రశస్త్రవివర్జితుఁడై యేకాంతస్థానమున కరుగుచుండుసమయమున మలహారురా వాతని మార్గమధ్యమునఁ గని, యాతనిఁ దక్షిణమున నాక్రమించి యాతని వక్షస్థలమునకుఁ దనహస్తమందలి బల్లెముయొక్క యగ్రము గుఱియొనర్చి "ఈసమయమున నిన్నుసంహరింపకుండ రక్షించువార లెవరు?" అని సక్రోధముగఁ బలుకఁజొచ్చెను. ఈయాకస్మికవిపత్పాతమునకు బాజీరా విసుమంతయుఁ జలింపకఁ జిఱునగవు నగుచు, "నాకరము తీక్ష్ణకృపాణముచేతఁ గాని, బల్లెముచేతఁ గాని యలంకరించి యున్నయెడ, నీయీప్రశ్నమున కవకాశ మొసఁగకుండ తగుసమాధాన మొసఁగియుండఁగలవాఁడను.... కానిమ్ము. అయినదేదో యైనది. నీసాహసమును నీసమరకౌశలమును యుద్ధరంగమునఁ బలుసారులు పరికించి మిగుల ప్రసన్నుఁడ నైతిని. వీరశ్రేణి నలంకరింపఁదగిన నీవిదురభిమానమునఁ జెడుచుంటివి. ఇట్లుంటి నని నాయెడఁ గోపమూనక నాయుపదేశముఁగైకొని యీనిమిషమునుండియు

నాతో మిత్రత్వ మూని మన నెంచుము. దాన నీకు లాభశ్రేయము లొనఁగూఁడు"నని ప్రత్యుత్తర మొసఁగెను.

బాజీరాయనినోటినుండి వెలువడిన యామృదుమధుర గంభీరవాగమృతధారలఁ గర్ణపుటములఁ దనివారఁ గ్రోలినమల్హారురావు హోల్కారు ముగ్ధహృదయుఁడై, స్నేహభావమున బాజీరాయని నుపగూహన మొనర్చి తనయకృత్యమును మన్నింప వేఁడుకొనెను. అంత నాయిరువురి వీరుల హృదయసీమల కృత్రిమస్నేహలతికలచే నలంకరింప మొదలిడియెను. ఆస్నేహలతికలు దినదినప్రవర్ధమానములై పుష్పసంతతులతో వారి జీవితకాలమంతయు సుశోభితములై వఱలుచుండెను.

## రాజసన్మానము.

శత్రువిజయమును బాదుషావలన స్వత్వ(సనదు)పత్త్రముఁగైకొని పేష్వబాలాజీవిశ్వనాథపంతు క్రీ. శ. 1719-వ సం॥ రం జూలై తే 4 దీని మహారాష్ట్రరాజధానియగు సితానగరమునఁ బ్రవేశించెను. పూర్ణవిజయమును బడసి రాజధాని కరుదెంచుచున్న పేష్వవిశ్వనాథుని మహారాష్ట్రాధిపతి సాహూ స్వయముగ నతిశయసమారోహసహితముగ నెదుర్కొని యభినందితుఁ గావించెను.

పాదుసాహీ స్వత్వపత్త్రాధారముగ మహారాష్ట్రమందలి యన్ని మొగలాయీ ఠానాలు (పోలీసుస్టేషనులు)ను, కచ్చేరీలును తొలఁగింపఁబడినవి. మోగల, పఠాను, సైయ దధికారుల యధికారము లంతమొందింపఁబడినవి. మహారాష్ట్రదేశమందంతటను, సాహూయధికారప్రవృత్తి విశేషముగ వివర్ధితమై ఘోషింపఁజొచ్చెను.

మహారాష్ట్రసామ్రాజ్యసుస్థిరసంస్థాపకుఁడును గౌరవమండితకార్యకలాపకర్తయు నగు పేష్వాబాలాజీ విశ్వనాథపంతునకు, సాహూ, బహుమానపూర్వకముగఁ బూనాజిల్లాంతర్గతములగు నయిదు పరగణాలలో సర్‌దేశముఖీస్వత్వగ్రహణాధికారమును, వేఱొకగ్రామము సమస్తోపస్వత్వోపభోగాధికారముతోడను దాన మొసఁగెను.

ఖాందేశబాలాఘాటుల నికటస్థప్రదేశము లింతకుఁ బూర్వమే పేష్వాకరగతము లయ్యెను.

ఇంతవఱకుఁ బేష్వాబాలాజీవిశ్వనాథపంతు బాహరీయపరాక్రమవిఖర్వమూలకముగ మహారాష్ట్రసామ్రాజ్యమును సుస్థిర మొనర్ప మది నెంచి యందు ప్రవృత్తుఁడై కృతకృత్యుఁ డయ్యెను. ఇఁక నాభ్యంతరికావ్యవస్థసంస్కారముఁ గూర్చి పాటుపడుట కవకాశము లభించినందున నాతఁడు తదనుగుణకార్యసాధనతత్పరుఁ డయ్యెను. ఇంతదనుక రాజ్యముయొక్క ఆదాయవ్యయవ్యవహారము, నిర్ధారితనియమరహితముగ సర్దారగణాధీనముననుండి యుండెను. అందువలన పలుమారు సర్దారులతో పలువివాదములు సంభవించు చుండెడివి. ప్రప్రథమమునఁ బేష్వాబాలాజీపంతు మునుముం దట్టివివాదోదయమునకుఁ దావొసఁగూడకుండునటు లాదాయవ్యయముల లెక్కలఁ బరీక్షించి (జమాబంది) తత్సంబంధమునఁ గతిపయవిశేషనియమముల నిర్ధారణ మొనర్చెను. ఈయభినవనియమనిర్ధారణము రాచకీయములయందును ఆదాయవ్యయములయందును నివృత్తవివాద మయ్యెను. పిమ్మట నాతఁడు సామ్రాజ్యశ్రీవృద్ధిసాధనమున కనుకూలమార్గములఁ బ్రదర్శించుచు

సామంతసర్దారుల యనురాగమునకుఁ బాత్రుఁడై, మహారాష్ట్ర వీరు లభ్యుదయసీమలయందు, ముసల్మాను హస్తగతమయిన మహారాష్ట్రప్రదేశముల వశ మొనర్చుకొనునభిమత ముద యింపఁజేసెను.

పేష్వాకృత, యాభ్యంతర వ్యవహారిక నూతనసంస్కారమువలన స్వల్పసంఖ్యాకులగు సర్దారులకు నించుక నష్ట మొదఁగూడినను పెక్కండ్రకు లాభదాయక మైనందున నాతఁడు స్వదేశమందంతట ననురాగమునఁ బరిగణింపఁబడి యెను. ఆకారణమువలన ననతికాలములో వృద్ధిగనుచిహ్నము మహారాష్ట్రసామ్రాజ్య మలంకరింపఁజొచ్చెను. (Of course, there were seeds of dissolution and decay in the arrangement of Balaji, but they were fairly held in check for nearly a century. We have the testimony of Mr. M. Eliphinstone and his coadjutor, that though the system was theoretically full of defects, it practically ensured peace and prosperity, and succeeded in making the Maratha power, respected and feared by all its neighbours. *Rise of Maratha Power*. p. p. 217.)

## పూనాప్రాప్తి.

దైవవిడంబనావివశుఁడై సచివనారాయణశంకరుఁడు బాలాజీపేష్వాతోపాటు విశ్వాసఘాతుకుఁడగు దామాజీవశమున హింగన్ దుర్గములో బందీరూపముగ వాస మొనర్చుచుండుటయు, పిమ్మట బాలాజీబందినుండి వెలువడి, దామాజీ కోరినధన మొసంగి సుహృదుఁడును యథార్థమిత్రుఁడును నగు

నారాయణశంకరుని శత్రుకరములనుండి వెలిపఱచి, హింగన్ దుర్గమును నేలఁగూల్చి ప్రబలవిరోధియగు దామాజీని బంధించి రాజధానికిఁ గొనితెచ్చినవృత్తాంతము సానుపూర్వివిని, యుదారహృదయయు, పుత్రవాత్సల్యవిమోహాయు నగు నారాయణశంకరునిజనని, యాతని యుదారసాహసములకు మిగుల నచ్చెరువొందుచు, నిజపుత్త్రునిప్రాణమును రక్షించిన వినిమయమునకుఁ గృతజ్ఞతాపూర్వకముగ నిజాధికారస్థితములగు పురందరుదుర్గమును, పూనాప్రదేశమును బారితోషికముగఁ బాలాజీవిశ్వనాథునకు సమర్పించెను.

ఆసమయమునఁ బూనాప్రదేశము మోగలపక్షీయ సర్దారు 'బాజీకదమ్' అనువానియధికారమునకు లోఁబడియుండెను. ఆప్రదేశమునుండి మహారాష్ట్రాధిపునకు చౌతు స్వత్వగ్రహణాధికారము గలదు. మహారాష్ట్రపతి యీప్రదేశమునుండి చౌతుపద్ధతి గ్రహించు ఆదాయము సచివనారాయణశంకరునకుఁ బ్రతివత్సరముఁ బ్రాప్తమగుచుండెడిది. అయ్యది సచివనారాయణశంకరుఁడు మాతాజ్ఞానువర్తియై బాలాజీవిశ్వనాథునకు వినయపూర్వకముగ సమర్పించెను. అట్లు ప్రాప్తమయిన పూనాప్రదేశము, బాలాజీవిశ్వనాథపంతు నాహూయనుమతినూచిత స్వత్వపత్రమును బడసి పురందరుదుర్గసహితముగ వశ మొనర్చుకొనెను. క్రీ. శ. 1718 సం॥ రం॥ నవంబరు నెలలో మొగలాయీసర్దారుని లోఁబఱుచుకొని తత్ప్రదేశములలో స్వాధిపత్యమును సంపూర్ణముగ స్థాపించెను.

ఇంతవఱకు బాలాజీవిశ్వనాథునిపరివారవర్గము సాసవాఁడు గ్రామములోనే వాస మొనర్చుచుండెను. స్వజనరహిత

ముగ సితారానగరములో నివసించియుండుట యనుచితమని బాలాజీవిశ్వనాథునకుఁ దోఁచియున్నను కారణాంతరమున నాతఁ డొడఁబడి స్వజనసమ్మేళనమున కనువగు సమయ మరయుచుండెను. అంతట దైవానుకూలమునఁ బురందరుదుర్గము పూనాప్రదేశము ప్రాప్తమయినతోడనే యాతఁడు బురందరుదుర్గము నాశ్రయముగఁ గొని పూనానగరము స్వీయస్థానముగ నేర్పఱచుకొని స్వజనసమూహముతో నివసించుటకుఁ గృతనిశ్చయుఁడై తదనుమతిప్రసాదమునకై సాహూను వేఁడుకొనెను. మొదటినుండియు పేస్వాబాలాజీవిశ్వనాథుని కార్యదక్షతకును బుద్ధివిభవమునకును మహారాష్ట్రపతి కడువిమోహితుఁడై యున్నందునఁ బేష్వాయభిమతి నవిలంబముగఁ బూర్తియొనర్చెను. బాలాజీవిశ్వనాథుని శాసనసైపుణ్యము తత్పాలితప్రదేశములోఁ జోరకిరాతాదులవలని భయమును నామమాత్రావశిష్ట మొనర్చుటయే కాక కర్షకగణార్థికావస్థోత్కర్షోపార్జితమై వెలయఁజొచ్చెను.

బాలాజీ విశ్వనాథుని పరలోకయాత్ర.

మహారాష్ట్రసామ్రాజ్యాభ్యంతరికశాసన సువ్యవస్థాప్రబంధనిర్మాణ మొనరించుచు స్వజాతీయధనసంపదాభివృద్ధిదసాధనమార్గములఁ బ్రతిష్ఠించుచు రాచకార్యములయం దనవరతముఁ గృతపరిశ్రముఁడై మెలఁగుచుండుటవలనఁ బాలాజీవిశ్వనాథుని శరీరమునకు స్వాస్థ్యభంగ మొదవెను. అందుకుతో డాతఁ డొకటి రెండుసమరాభియానములలో సర్వసేనాధిపత్యముఁ గూడ వహింపవలసివచ్చెను. ఆనిరంతరపరిశ్రమమువలనఁ బాలాజీవిశ్వనాథునకుఁ బూనానగరము స్వీయవాస

స్థానముగఁ జేకొనిన కొలఁదిదినములలోనే యాతని కొదవిన శరీరాస్వస్థత జలవాయువుగఁ బరివర్తన మయ్యెను. అంతట నాతఁడు సాహూరాయనుమతి వడసి విశ్రామార్థము సాసవాఁడు గ్రామమున కేఁగి యందు వసియించుచు, నౌషధసేవన మొనర్చుచు, గ్రహశాంతి మొదలుగాఁగల శరీరపీడాపరిహారకవైదిక కర్మావలంబనమునసిసుమంతయు వెనుదీయక మెలఁగుచుండెను. కాని యాతఁ డవలంబించిన యారోగ్యదాయకోపాయము లన్నియు వ్యర్థము లయ్యెను. క్రీ. శ. 1720 సం॥ రం॥ ఏప్రిల్ 2-వ తేదీని (అక్టోబరనిగ్రాంటుడఫ్‌గారిమతము) మహారాష్ట్ర వీరశిరోమణి పేష్వాబాలాజీవిశ్వనాథపంతు ఇహలోకమునుండి పరలోకయాత్ర కరిగెను. సర్వగుణభూషితుఁడు సామ్రాజ్యోద్ధారకుఁడు అప్పుడు హితకాంక్షితుఁడును నగుపేష్వాబాలాజీ విశ్వనాథుఁ డిహలోకమును వీడినంతనే సాహూ దరిగానని శోకసాగరమున నిమగ్నుఁ డయ్యెను.

## బాలాజీ విశ్వనాథుని గుణవివరణము.

బాలాజీపంతు సమరకుశలుఁడు కాకపోయినను, సాహసుఁడు, యోధుఁడు, రాజనీతివిచక్షణసంపన్నుఁడు, మహారాష్ట్ర సామ్రాజ్యోద్ధారకుఁడు, సుగుణసంపన్నుఁడు, సరళహృదయుఁడు, అద్వితీయ ప్రతిభాసంపన్నుఁడు, సాహూ మొగలాయీరాజపరివారమువలనఁ బ్రతిహితుఁడై ప్రవర్ధమానుఁడై బాల్యావస్థవ్యతీత మొనరించినవాఁ డైనందున విలాసానురక్తుఁడై ప్రవర్తించుచు రాచకీయవిషయములు శ్రద్ధాపూర్వకముగ గమనించెడివాఁడు కాఁడు. అట్లయినను కార్యదక్షుఁ డగు బాలాజీవిశ్వనాథునిపూర్ణసహాయ మలవడినకతమున

నాతఁడు స్వరాష్ట్రములో విశేషప్రతిపత్తిప్రాప్తముఁ బడసెను. బాలాజీవిశ్వనాథుని ప్రతిభావిశేషమువలన మహారాష్ట్ర సామ్రాజ్యమున కలవడిన నూతనైశ్వర్యసామర్థ్యములఁ గూర్చి ప్రశంసించుచు కీర్తిశేషులగు న్యాయపతిమహాదేవుగోవింద రానడే ఎం. ఏ. యల్. యల్. బి. సి. ఐ. యి. గారు స్వరచిత మగు మహారాష్ట్రచరితమందు ఆతనికి ఛత్రపతిశివాజీయొక్క పారవ్రతీస్థానమొసఁగి గౌరవించిరి.

బాలాజీవిశ్వనాథుని మృతిసమయమున నాతనిసహ ధర్మిణి రాధాబాయి, బాజీరావు, చిమణాజీఅప్పా యను యిరువురుపుత్రులును పుత్రికలిరువురును ఆతని నికటవర్తులై యుండిరి. క్రీ.శ. 1753-వ సం॥ రములో రాధాబాయి కైలాస వాసమున కరిగెను.

---

## మూఁడవ ప్రకరణము.

---

బాజీరాయునకుఁ దొమ్మిదిసంవత్సరముల ప్రాయ మాఁ వడినదాది, యాతఁడు జనకుని వెంబడించి యుద్ధయాత్రల నొనర్చుట కుపక్రమించినవాఁడు. ఆకారణమున నాతఁడు ప్రతి రణరంగమున నుపస్థితుఁడై, ప్రత్యక్షానుభవముతోఁ బ్రగాఢ రణపాండిత్యమును వడసినవాఁడు. అవిధమునసే రాచకార్య ములయందుఁ గూడ జనకుని వెన్నంటి రాజనీతివైశారద్య మునుఁ గార్యకౌశలమున నద్వితీయప్రతిభ గడియించి యనేక సందర్భములలో జనకునకుఁ గుడిభుజమై ప్రవర్తింపఁజొచ్చెను. బాజీరాయనికార్యదక్షతను పలుసారులు మహారాష్ట్రాధిపుఁడు

ప్రత్యక్షముగాఁ బరికించి యున్నవాఁడు. పేష్వాబాలాజీవిశ్వ
నాథుని మరణానంతరమునఁ బేష్వాపదమున బాజీరాయనిఁ
బ్రతిష్ఠితునిఁ గావింప నిశ్చయించి సాహూ తనయభిప్రాయ
మును నిండుకొలువులో వ్యక్తపఱిచెను. ఛత్రపతిశివాజీసమ
యమునుండియు పేష్వాపదము, మంత్రిమండలములో సర్వో
చ్ఛస్థాన మలంకరించి యొప్పుచున్నయది. ఈపదము, వెస్టుమిని
ష్టరు, (విశ్వవిఖ్యాతిఁ గనినగ్లాడ్‌స్టన్, లార్డుబికెన్సుఫీల్డు, ప్రిన్సు
బిస్మార్కు మొదలగువారివలె) ఆదిపదవులకు తుల్యసదృశ
ముగఁ బరిగణింపఁబడుచుండెడిది. మంత్రివరులలో పెక్కండ్రు
తమసమ్మతమును ప్రకటించి సాహూయుద్దేశమును బలపఱిచిరి.
కాని మహారాజారాజారామ్ కాలములో రాచకార్య నిర్వహ
ణమున కత్యంతావశ్యక మగుటవలన ప్రతినిధిపదవి సృష్టి
యయ్యెను. ఈప్రతినిధి పదమునఁ బ్రప్రథమమునఁ బరశురామ
త్ర్యంబకుఁడు ప్రతిష్ఠితుఁ డయ్యెను. ప్రతినిధి శ్రీపతిరావు
(ప్రతినిధి పరశురామత్ర్యంబకుని కొమరుఁడు) మాత్ర మీసం
దర్భమున నన్యప్రకారపరామర్శ నొనర్చెను. బాలాజీవిశ్వ
నాథకృత మహిమావిజడితకార్యావళియును బాజీరాయని
మేధాసంపత్తియు, కార్యవిచక్షణోత్సాహసాధనసంపన్నతయు
సాహూ హృదయమునఁ దాండవ మాడుచుండుటవలన ప్రతి
నిధిబోధితములగు నీర్ష్యోక్తులు విఫలము లయ్యెను.

## పేష్వాపదాభిషేకము.

బాలాజీవిశ్వనాథుని మరణమునకుఁ బూర్వము పితృని
ర్దేశమున బాజీరావు సైయదులప్రతినిధి ఆలిమ్ ఆలీసహాయా
ర్థము, మహారాష్ట్రీయ సైన్యములోనియొకదళముఁ దోడ్కొని

ఖాందేశమున కరిగి కృతకృత్యుఁడై జనకునిమరణకాలమునకు సాసవాఁడుగ్రామమున కరుదెంచెను. ఆగ్రామముననే విశ్వనాథుని యూర్ధ్వదైహికక్రియలఁ బూర్తి యొనరింపనెంచి పితృయజ్ఞదీక్షితుఁ డయ్యెను. ఈదీక్ష పూర్తి యగుట తడవుగఁ బిత్రుపదభారగ్రహణ మొనరించుటకుఁ బాజీరాయని సితారానగరమున కరుదేర వేఁడుకొనుచు సాహూజీపత్రమును లిఖించి యాతనికడకుఁ బనిచెను.

సాహూజీ పత్రము గ్రహించి తదనుసరణముగ బాజీరావు అంబాజీపంతుపురందరే, రామచంద్రపంతు భానూజీ, ప్రియసహోదరుఁడగు చిమ్నాజీ అప్పా మొదలుగాఁగల యాప్తబంధువులను వెంట నిడుకొని సితారానగరమున కరుదెంచెను. క్రీ. శ. 1720-వ వత్సరము ఏప్రిల్ తే 17 దీని బాలాజీబాజీరావు పేష్వాపదాభిషిక్తుఁ డయ్యెను.

బాజీరాయని పేష్వాపదాభిషేకమహోత్సవమునకు మహారాష్ట్రాధిపుని యాజ్ఞానుసరణిని రాష్ట్రమంఁదలి శూరసామంతసర్దారువర్గము సితారానగరమున కరుదెంచెను. జ్యోతిష్కులచే నిర్ణయింపఁబడిన శుభముహూర్తమున సేనాపతిసహితముగ మంత్రివర్గపరివేష్టితుఁడై సాహూ కొలువుకూటమలంకరించెను. సర్దారులు, సేనానులు శూరులు సామంతులు తమతమ పదమర్యాదానుగుణముగ నాసనముల నలంకరించిరి. మహారాజా దేశానుసరణముగఁ బ్రతినిధి శ్రీపతిరావు, బాజీరాయని, శుభ్రవస్త్రాలంకారభూషితుఁ గావించి యథాశాస్త్రముగ పేష్వాపదపట్టభద్రునిఁ గావించెను. ఆసమయమున బాజీరాయునకు సువర్ణసూత్రఖచితములగు శిరోవేష్టనము కటిబం

ధము, ఉత్తరీయములును, రాజముద్రయు సువర్ణరత్నఖచిత మగు ఖడ్గమును, అసిచర్మమును, (డాలు) జాతీయపతాకమును, సువర్ణరత్నాభరణములతో నంబారీలతోఁగూడినమూఁడు మదపుటేనుఁగులను, సంపూర్ణసుసజ్జితాశ్వరత్నములను, మౌక్తికమాలయు, ముక్తాయుతకర్ణాభరణములును, ముక్తగుచ్ఛశిరోభూషణమును మొదలుగాఁగల భూషణములతో నూతనపదప్రదానసూచితచిహ్నస్వరూపమగు పేష్వాపదస్వత్వపత్రమును నిండుకొలువులో మహారాజుసాహూ స్వయముగ సమర్పించెను.

### పేష్వాశబ్దమీమాంస.

ఛత్రపతి శివాజీయాజ్ఞానుసరణముగ సంస్కృతభాష రచియింపఁబడిన "రాజవ్యవహారకోశ" మను గ్రంథమందు "పేసవే" యనుప్రయోగమునకు పారసీకరూపాంతరము "పేసవా" రాజవ్యవహారకోశమందు. "శ్లో. ప్రధానః పేసవే తథా—" అని ప్రయోగము. ఈపేసవేపదప్రయోగమే గ్రంథమం దంతటనుఁ గానవగును. ప్రధానియని యెవరిఁ బిలుతురు? ప్రధానికర్తృకకార్యము లెవ్వి? యాతనియధికారము లెట్టివి? ఈవిషయములఁ గూర్చి శుక్రనీతియందు.

> శ్లో. "పురోధాశ్చ ప్రతినిధిః ప్రధానః సచివ స్తథా,
> మంత్రీ చ ప్రాడ్వివాకశ్చ పండిత శ్చ తు మాంత్రికః.
> అమాత్యదూత ఇత్యాది రాజ్ఞః ప్రకృతయోదశ."

రాజుయొక్క అమాత్యాది దశప్రకృతిమధ్యమందు,

> "శ్లో. సర్వదర్శీ ప్రధానస్తు సేనాని స్సచివ స్తథా,
> సత్యం వా యది వా సత్యం కార్యజాతం చ యత్కిల.

సర్వేషాం రాజకృత్యేషు ప్రధాన స్తదచింతయేత్.''

సమస్తరాజపురుషకృతకార్యావళినిఁ బరీక్షించుచు సమస్తరాజ కార్యములఁ బరిశీలించుచుండునాతఁడు ప్రాజ్ఞపారదర్శకుఁడు. అట్టి ప్రాజ్ఞపారదర్శకునిఁ బురాణములలోఁ బ్రధాని యని వ్యవహరించిరి. మునలమానురాజులు, అందు విశేషముగ దాక్షిణాత్య సులతానులు ప్రధానిఁ బేసవా యని వ్యవహరించుచుండెడివారు. ఈమునలమానువ్యవహారసాంప్రదాయము ననుసరించి మహారాష్ట్రసామ్రాజ్యప్రతిష్ఠాత యగు శివాజీ, తనప్రధానమంత్రినిఁ బ్రథమమున బేష్వాయనియే వ్యవహరించెను. కాని రాజ్యాభిషేకానంతరము పేష్వాపదమును పరివర్తన మొనర్చి, *హిందూశాస్త్రానుసరణముగ "పండితప్రధానో" పాధిఁ బ్రవర్తన మొనర్చెను. (ఈపండితప్రధానోపాధియందలి పండితశబ్దము బ్రహ్మత్వసూచకచిహ్నముగ వ్యవహృతమైనది.) పారశీకరూపాంతరమగు పేసవాపదప్రచారము ప్రచలితముగ నుండినందున నీనూతనప్రవర్తిత 'పండితప్రధాని' యను శబ్దము సాహుకాలములో రాచకీయలిఖితములయందుఁ గాక తదితరవ్యవహారములలో నామావశిష్ఠ మయ్యెను. పేష్వాశబ్దము యథాస్థాన మలంకరించి వ్యవహారబాహుళ్యముఁ గనినది.

పేష్వాపదము రాజదర్బారుసందలి ప్రధానమంత్రిపదవులలో నెల్ల నతిశయమై చిరకాలమునుండి ప్రధానస్థాన మలంకరించియున్నయది. అయినను తత్పదము చతురచక్రమూఢానుఁ డనఁదగిన *వీరేంద్ర బాజీరావుకాలమునను ఆతనిపుత్త్రుఁడగు బాలాజీబాజీ రావులకాలమునను భారతచరితమం దలవఱచుకొనిన ప్రతిష్ఠఁ దత్పూర్వమం దలవఱచుకొనుట లేదు.

ఈమహనీయు లిరువురును దమయసాధారణబుద్ధి బలవిక్రమములవలన భారతవర్షీయశాసనచక్రమును సంపూర్ణముగఁ బరివర్తన మొనర్చి పేష్వాపదమునకు సార్థక్య మొసఁగి చరిత్రములయందు విశేషముగ ఖ్యాతిప్రతిష్ఠలఁ గాంచి శాశ్వతయశముఁ జూఱఁగొనిరి.

### పేష్వాకర్తవ్యము

పేష్వాపదాధికారి నిర్వహింపవలయు కార్యనిర్ణీతసందర్భమున శివాజీసమయములో నిమ్నలిఖితకార్యకలాపము నిర్ధారితమై యుండెను.

1. ప్రధానరాజకార్యములయందు మంత్రణాప్రదాన మొనర్చుచుండవలయు.

2. రాజకర్మచారుల కనుగుణనిర్వహణకార్యనిర్ధారణ మొనర్చి తత్కృత్యములను సమదృష్టిఁ బరీక్షించుచుండవలయు.

3. నిరంతర మనలసభావమున రాజ్యహితసాధనముఁ బ్రవర్తించుచుండవలయు.

4. నిజభుజబలసాధనమువలనను వీరవాహినీ విక్రమములవలనను నూతనప్రదేశముల జయించి స్వరాజ్యమునఁ జేర్చుచుండవలయు.

5. శత్రుకరగత పరరాష్ట్రసంక్రాంతస్వరాజ్యప్రదేశ విషయక సమగ్రసంవాద సాధనభారములను వహించుచుండవలయు.

6. రాచకార్యసంబంధములగు కాకితములపై, పత్రములపై, రాజముద్రను స్వనామాంకితముద్రను నంకిత మొనర్చుచుండవలయు.

### బాజీరాయనిముద్రిక.

బాజీరావు పితృపదమునఁ బ్రతిష్ఠితుఁ డైనంతనె పై నుదహరింపఁబడిన కార్యనిర్వహణభార మాతనిహస్తార్పిత మయ్యెను. బాజీరాయనియుద్యోగకాలములో నధికాంశము దిగ్విజయ మొనర్చుటయందును, సంధివిగ్రహవ్యాపారమును నలుపుటయందును, శత్రుదమనమునను వ్యతీతమయ్యెను. ఆకారణమున నాతని కనిష్ఠభ్రాత, చిమణాజీ అప్పా, నిరంతరము రాజసమ్ముఖమున నుపస్థితుఁడై కార్యనిర్వహణ మొనర్చుచుండవలసినవాఁ డయ్యెను. అందువలన చిమణాజీకి సాహూ 'నాయకపేష్వా' పదోపాధి (Assistant Peswa) నొసఁగి యాతనిఁ గౌరవమండితుఁ గావించెను. సాహూజీ రాజ్యకాలములో పేష్వాపదము ప్రచారబాహుళ్యము గలిగియున్నను, లిఖితములయందుమాత్రము శివాజీ ప్రవర్తిత 'ముఖ్యప్రధాని' "పండితప్రధాని" మొదలుగాఁ గలసంస్కృతపదములు మాత్రమే ప్రయోగింపఁ బడుచుండెను. బాజీరాయునకు రాచకీయ వ్యవహారసందర్భమున వ్రాయఁబడు లిఖితములయందు "సమస్త రాజకార్యధురంధర, శ్రీమంతు, రాజమాన్య, రాజశ్రీ బాజీరావు భల్లాలుపండితప్రధాను" అని వ్రాయఁబడుచుండెడిది. బాజీరాయనిరాచకీయముద్రిక యీదిగువ నుదహరింపఁబడిన శ్లోకరూపమున నుత్కీర్ణమై యుండెడిది.

శ్లో. సాహూనరపతి హర్షనిధాన్, బాజీరావ భల్లాళ ముఖ్యప్రధాన్.

### తాత్కాలిక భారతవర్షీయ రాజనీతివ్యవస్థ.

బాజీరావు పేష్వాపదమును బడసిన కాలములో భారతవర్షమందలి రాజనీతివ్యవస్థ కడుశోచనీయముగ నొప్పియుండెను.

## స్వదేశము.

ఆకాలములో మహారాష్ట్రసర్దారులు తమతమయాత్మ విగ్రహములలో కొంతవఱకు ప్రశాంతమును వహించి యుండిరి. కాని, రాజవంశమున విరోధ మంకురించి దినదినాభివృద్ధిఁ గనుచుండినందున కొందఱుసర్దారులు సతారాధిపతి సాహూ పక్షమును మఱికొందఱు కొల్హాపురాధిపతి శంభాజీపక్షమును గ్రహియింపఁదొడఁగిరి. అందుఁ గైలాసవాసియగు పేష్వబాలాజీవిశ్వనాథునిమర్మగ్రాహకములగు చేష్టలు సాహూపక్షమును బలిష్ఠముగ నొనర్చినయవి. రాష్ట్రములోని చోరకిరాతాదిక్రూరజనసమూహము పూర్ణముగ దళితమును దమితమును నై యొప్పినందున దేశీయులు నిర్భికులై సుఖజీవన మొనర్చుచుండిరి. ఢిల్లీసామ్రాజ్యపరివర్తనవ్యాపారసందర్భములో సతారాధిపతి సాహూ సహాయ మొసంగినందున నాతనినామము స్వదేశములోను ఉత్తరంభారతములోను విశేషముగఁ బ్రతిష్ఠఁ బ్రతిపత్తులఁ గాంచి వఱలుచుండెను.

## బుడతకీచుప్రభావము.

భూమండలమున కలవడిన వసుంధరానామమును రత్నగర్భయగు భారతభూమిసార్థకముగఁ జేయుచుండె నను ప్రచలితసంవాదమును నాలించి ఐరోపావణిక్సమాజ మింతకుఁ బూర్వమీ దేశమున నడుగిడి, తాత్కాలికదేశవ్యవస్థావలోకనమునఁ గొలఁదిదినములలోనే వణిక్కులసహజవృత్తియగు వాణిజ్యముఁ బరిత్యజించి రాచకీయమునఁ బ్రవేశలాభమును వడయుటకు నిరంతరాలోచనాంబుధిని మునిఁగి తదనుగుణసాధనముఁ బ్రవర్తింపఁజొచ్చెను. ఈవణిగ్బృందమునకు క్రమక్రమ

ముగ మండలపాలకుల మన్ననలఁగడించి తదన్యచ్ఛిద్రముల నన్వేషించి వారిలో వారికి విరోధముఁ గల్పించి బహిరంగ ముగ నొకపక్షమును, నంతరంగముగ వేఱొకపక్షము గ్రహిం చి, యందు తమభుజబలమును వెలువఱచి, స్వరాజ్య, స్వాధి కారప్రతిష్ఠాపనమును, పరరాష్ట్రాకర్షణమును నలుపవలయునను కోరిక లీరికలెత్తఁజొచ్చెను. ఈకోరికలు సఫలము లొనర్చుకొను యత్నమునఁ బ్రవర్తులై ప్రథమమున నీవిదేశీయులు పశ్చిమ సముద్రతీరస్థములగు ననేకబందరు (Harbours) లను స్వాధి కారమునకు లోఁగొనిరి. పిమ్మట భారతమాతవక్షస్థలమునుతమనుని శితకరవాలమున భేదింప నుకట్టిరి. ఆకాలములో ఐరోపాఖం డమునుండి యరుదెంచినవణిక్సమాజములలో నెల్లఁ బుడత కీచుల (Portuguse) ప్రభావ మతిశయమైయుండెను. క్రీ. శ. 1720-వ సం॥ రములోఁ బాజీరావు పేష్వాపదవిని వహించి రాజ కార్యములయందుఁ బ్రవృత్తుఁడై పరికించి చూచినంతనే, గోవామండలాధికారులగు బుడతకీచులు మహారాష్ట్రమండల మునకుఁ బలవద్విరోధులై యొప్పుచుండిరని యాతఁడు గ్రహిం చెను.

-:o:- పరాసులు - ఆంగ్లేయులు. -:o:-

దక్షిణదిఙ్మండలములోనిబుడతకీచుల సంపత్సమృద్ధివృ ద్ధుల నవలోకించి, పరాసులు (French) ఉలాందులు (Dutch) ఆంగ్లేయులు క్రమక్రమముగభరతఖండములోని స్వర్ణరత్నధన సంపత్సమృద్ధిఁ జూఱగొన నరుదెంచి, పశ్చిమదక్షిణఖాతముల లోని గోవా, దమను, ముంబాయి, ఖంబాతు, సాష్టీ, దోపూ, రాత్ర, చౌల, బసాయీ, రాజపూరు, వేగుర్లే ప్రభృతిస్థాన ములయందీవై దేశికవణిగ్బృందము దమతమపణ్యశాలలఁ బ్రతి

స్థాపన మొనర్చెను. ఇంతవఱకు పరాసులు గాని, యాంగ్లేయులు గాని, యీదేశములో రాజ్యాధికారప్రతిష్ఠాపనవ్యాపారమునఁ బ్రవృత్తునన్కులు కాలేదు.

## మొగలాయీసామ్రాజ్యరాజకము.

భారతదేశమున ఉత్తరపశ్చిమములలో పాదుసాహీశాసనవ్యవస్థదినదినము క్షీణింప నారంభించెను.

సైయదులనియోగమువలనను మహారాష్ట్రవాహినీసాహాయ్యమువలనను, మహమ్మదుషా, పాదుషా యయి ఢిల్లీసింహాసన మలంకరించి యుండెను. అతఁడు, సనాతనప్రధానుసరణముగ, విలాసప్రియుఁడును, వ్యసనాలోలుఁడును, మదిరాపానమత్తుఁడునునై, సుందరవారాంగనామధ్యమున, తారకాగణములోనిచంద్రునిఁ బోలె ప్రకాశింపఁజొచ్చెను. "యథా రాజా తథా ప్రజాః" యను నుడువుచొప్పునఁ బాదుషామంత్రివర్గ ముద్యోగిగణము సైనికబృందము రాజపథానువర్తనమున మెలఁగుచు దురాచారతత్పరత్వమున విహరింప మొదలిడెను. ప్రధానమంత్రివర్గము యథేచ్ఛావిహారణమునకును విలాసవ్యసనములకును నిలయమయ్యెను. దురాచారము సదాచారముగఁ బరిణమించు చుండెను. అందువలనఁ బ్రజాపుంజము నిష్ఠురముగఁ బీడింపఁబడుచుండెను. పాలనవ్యవస్థాదోషము దినదినము దారుణముగను నిష్ఠురముగను పరివర్తనమై శోచనీయమగుచుండినందున దైనికనిర్వాహకమునకుఁగూడఁ దగునంత పాదాయము లభించుట దుర్ఘట మగుచుండెను. అందువలన పాదుషా ఋణజాలమునఁ దగుల్కొనఁ జొచ్చెను. ఋణనివారణమునకు నై పాదుషా నిత్యమును నూతనవృత్తుల (Taxes)

పాలొనర్చి ప్రజాపుంజమును బీడింపనారంభించెను. దేశీయులు మహమ్మదీయులదురాచారములకును నూతనపరివర్తితకరభార మునకుఁ దాళఁజాలక, హాహాకారముల నిడుచు నలుగడలఁ బరుగిడఁజొచ్చిరి. అనహాయ, దుర్బలప్రపీడితప్రజానమూహ ముయొక్క మర్మభేద మగు నార్తనాదమును వినువారును విని నచోనూఱడించువారును నుత్తరభారతములో మందునకైనఁ బొడఁగట్టరైరి. అట్టిచో సాహాయ్యమొసఁగువారిమాటఁ దడవ నేల!

## నిజాముల్ముల్కు - హైదరాబాదునవాబు.

ఔరంగజేబు మరణానంతరము, దక్షిణభారతములోని మహమ్మదీయాధికారము పతనోన్ముఖముగాఁ జొచ్చినది. కాని, మీరుకమరుద్దీనను సర్దారు తనభుజబలమువలనఁ బ్రనష్టప్రాయమైన మహమ్మదీయశాసనమును మరల నెలకొల్పెను. ఈమీరుకమరుద్దీను ఔరంగజేబుకాలమునుండియు రాజనీతిధురంధరుఁ డనియు, రణకుశలుఁ డనియు,బలదర్పితుఁ డనియుఁ బేరు వడసి యొప్పుచుండినవాఁడు. నాటికాలమున నిరంకుశులై భరతఖండమం దెల్లెడల స్వచ్ఛందవిహారణమున మెలఁగుచుండిన మహారాష్ట్రవీరపుంగవుల కీయవనవీరుఁ డడ్డుతగలనిచో, మహారాష్ట్రాధిపతిసాహూ భారతవర్షమున నేకచ్ఛత్రాధిపత్యమును స్థాపించియుండుననుట కిసుమంతయు సందియము లేదు.

మీరుకమరుద్దీను క్రీ.శ. 1640-వ సంవత్సరములో జనన మొందెను. ఔరంగజేబుకాలములో నీతఁడు చీనకిలిచిఖానని యు, ఫరుకిసియరు కాలములో నిజాముల్ముల్కనియు నామములను బడసినవాఁడు. పర్యాయమున వడసిననిజాముల్ముల్కనునామమే శాశ్వతముగ నిలిచి యుండెను.

నిజాముల్ముల్కు, క్రీ.శ. 1717-వ సంవత్సరములో, డిల్లీ దర్బారునందు ప్రాముఖ్యులైన అబ్దుల్లాఖాను హుస్సేన్ ఆలీఖానులను ఇరువురి సైయదులచే మాలవదేశమునకు సుబేదారుగ నియమింపఁబడి, దక్షిణభారతమున కరుదెంచెను. ఈనూతన పదాధికారమును వడసినపిమ్మట నీయుద్ధవ్రతవీరుని హృదంతరములో పాదుషాహీదర్బారులో ప్రాముఖ్యము గనవలెయు నను నుచ్చకాంక్ష జనించి దట్టముగ నల్లుకొనఁజొచ్చెను. సైయదులప్రతిపత్తి దర్బారునందు ప్రవృద్ధిఁ గనుచుండి నందున, నీతనియాకాంక్ష ముందున కడుగిడ నేరక పోయెను. అందువలన దక్షిణభారతములో నిజాధిపత్యమును విస్తరింపఁ జేయుతలంపుఁ గొని సైన్యమును విస్తరింపఁజేయఁజొచ్చెను.

## సైయదులనాశనము.

నిజాముల్ముల్కు డిల్లీశ్వరునివలన 'ఆసీఫ్జాహు' అను గౌరవమండితబిరుదమును వడసెను. డిల్లీశ్వరునివలన గౌరవాధికారములను బడయుచు మిక్కిలిగ ప్రేమింపఁబడుచుండినను, స్వలాభపరాయణుఁ డగునిజాముల్ముల్కు సంతుష్టుఁడు గాక స్వరాజ్యసంస్థాపనాతురుఁడై మాలవదేశసుబేదారీపదమును వడసినకొలదికాలములో, డిల్లీశ్వరునకుఁ బ్రతిఘటించి విద్రోహఘోషణ మొనర్చుచు మాలవదేశము మొదలుకొని నర్మదాతీరపర్యంతముఁ గలప్రదేశముల నాక్రమించుకొనెను. ఈయాక్రమణమున 'ఆశీరగడము' అనుబలిష్ఠదుర్గము నిజాముస్వాధీనమయ్యెను. ఈయజేయదుర్గము స్వాధీనమయినంతనే, మొగలసర్దారులు విద్రోహతూర్యనినాదములచే దిక్సంతతుల బధిరీకృతము లొనర్చుచు నిజాముపక్షమును గ్రహియించిరి. విశ్వాస

ఘాతకుఁ డగునిజాము కృతవిద్రోహాచరణసమాచారమునువిని, మొగలాయీసామ్రాజ్యసంరక్షకులును, యథార్థాధికారులును నగుసైయదుసోదరులు "దిలావరుఖాను" అను సేనానాయకుని సేనాసహితముగ నిజామునకు విరుద్ధముగ యుద్ధ మొనరింప ననిపిరి. ఈవల, ఔరంగాబాదులోని ప్రతినిధి సైయదుహుస్సేన్ ఆలీసోదరపుత్త్రుఁడు, సైయదు "ఆలమ్ఆలీ" విద్రోహియగునిజామును దండించుటకు బయలువెడలెను. ఆలమ్ఆలీసాహాయార్థము, ఖండేరావుదావాడే, దామాజీగాయక్వాడు, బాజీరావుప్రభృతి మహారాష్ట్రవీరసేనానులు సేనాసహితముగ నరిగిరి. కాని మహారాష్ట్రవీరు లీయుద్ధరంగములో నుపస్థితు లైనదియు, లేనిదియు, ఉపస్థితులైనచో తనుబలదర్పములను ప్రకటించినదియు లేనిదియుఁ దెలియుటకు స్పష్టముగుచరిత్రాధారముగాని ప్రామాణికజనశ్రుతిప్రమాణముగాని యలనడనందున నీసంశయ మజ్ఞాతాంధకారాచ్ఛాదితమై యున్నయది. ఏదియెట్లున్నను ఢిల్లీశ్వరునిసైనికులు నిష్కపటహృదయులై యుద్ధరంగమున విక్రమప్రదర్శన మొనర్పమిచే, దిలావరుఖాను, ఆలమ్ఆలీలు నిజామువిక్రమమునకు నిలువోపక పరాజితులైరి. ఈ పరాజయవృత్తాంతమును విని మిగులఖిన్నుఁడై సైయదుహుస్సేన్ ఆలీపాదుషాను వెంటనిడుకొని సేనాసహితముగ నిజామునెదిరించుటకు బయలుదేఱెను. మార్గమధ్యమున క్రీ.శ. 1720వ సం॥ రము అక్టోబరునెలలో స్వాధికారోద్ధితస్వప్నసుఖమున నోలలాడుచున్నహుస్సేన్ ఆలీ, పాదుషా యాదేశమువలన నొకగుప్తఘాతకునిచే ద్విఖండితుఁ డయ్యెను. పిమ్మట రెండవసైయదు అబ్దుల్లాఖాను బందీకృతుఁడై కారాగారవాసమునకుఁ బాలయ్యెను.

### నిజాముల్ ముల్కు-బాజీరావు.

సైయదుల ప్రభావ మంతరించినపిమ్మట, ఢిల్లీశ్వరుఁడు మహమ్మదుషా నైజాము యొక్క విపులవిక్రమమును, అసాధారణరణపాండిత్యమును రాజనీతివైశారద్యమును, కార్యసాధన నైపుణ్యమును గని యాతనిఁ బ్రధానమంత్రిగ నియోగించు నుద్దేశముఁ బ్రకటించుచు నైజామునకు ఢిల్లీనగర మరుదేర వర్తమాన మనిపెను. నిజాముల్ ముల్కు యౌన్నత్యపథమున కడ్డుతగిలి ఢిల్లీదర్బారులో కంటకప్రాయముగ నలరు నిరువురు సైయదులు పరిశ్రమంహితముగ నాశన మొందిరి. అందువలన నాతని యౌన్నత్యము నిష్కంటకమైనది కాని, ఢిల్లీదర్బారులో ప్రధానమంత్రిత్వముఁ గనులాభమునకు వేఱొకయడ్డంకి నిజాముల్ ముల్కు సమ్ముఖమున నుపస్థితమై యాతని దూరస్థునిఁ గావించెను.

బాజీరాయనిప్రోత్సాహమువలన బీజపూరుపరిసరప్రదేశములలో విద్రోహాచరణమయి ప్రబలుచుండినందున నిజాముల్ ముల్కు క్రీ. శ 1722-వ సం॥ రమువరకు ఢిల్లీనగరమున కరుగుటకు శక్తుఁడుగాఁ డయ్యె. బాజీరావు పేష్వాపదమును వడసిన కాలములో, దక్షిణభారతములో మునల్మాను మండలమున నిజాముల్ ముల్కు మాత్రమే మహారాష్ట్రసామ్రాజ్యమునకు బలవద్విరోధిగ నెన్నఁబడుచుండెను.

### పూనాయౌన్నత్యము.

బాజీరావు పేష్వాపదమును వడసినపిమ్మట జనకసంపాదితమైన పూనాగ్రామము నౌన్నత్యమునకుఁ దేవలయు నను తలంపాతనిహృదయమున నుదయ మయ్యెను. ఆకారణము

వలన బాజీరావు తనపిత్పనియోగమునఁ బురందరుదుర్గములో గిల్లేదారుగ వ్యవహరించుచున్న బాపూదేవశ్రీపతియను మహా రాష్ట్రసేనానాయకునిఁ బూనాకు రావించి, యాతనిఁ దక్షిణ దేశమునకు సుబేదారుగ నియమించెను. పిమ్మట 'రంభాజీ యాదవుఁ' డనుపండితవర్యునిఁ బాపూదేవశ్రీపతియాధీనమున నునిచి, పూనాగ్రామము నొకప్రధాననగరముగ నిర్మించుభార మాతనిశిరమున నునిచెను. బుద్ధిచతురుఁ డగురంభాజీయాద వుని విచక్షణాప్రయత్నమువలన నచిరకాలముననే వ్యవసాయ శాలలును పణ్యశాలలును నిర్మితములై వాణిజ్యమునకుఁ బ్రధానస్థానమై వణిక్సమాజమును నాకర్షింపఁజొచ్చెను. అం తట క్షుద్రగృహాపూరితమగు పూనాగ్రామము విపులవిచిత్ర విశాలప్రాసాదమందిరములచే నలరారుచు నొకప్రధాననగర ముగ మాఱెను.

### శనివారవాడా.

క్రీ. శ. 1729-వ సం॥ రములో బాజీరావు పూనానగర ములో నిజనివాసమున కనువగు నొకసౌధరాజమును నిర్మిం చుటకు రంభాజీ యాదవున కాజ్ఞనొసగెను. ఆతఁడు తదాజ్ఞాను సరణముగ సౌధనిర్మాణమున కుపక్రమించి క్రీ.శ. 1737-వ సం॥ రములోఁ బూర్తి నొనరించెను. ఈసౌధము రమారమి యైదు బీగములవైశాల్యము(One bhiga = 5/8 of an acre) కలిగిన యది. ఇందులో మ్మిదిబురుజులు నైదుద్వారములుఁ గలవు. ఈసౌ ధసింహద్వార ముత్తరదిశయందు నిర్మింపఁబడుచున్నదనువంగ

తిని విని సాహూ "*ఢిల్లీశ్వరుఁడు నాయధీశ్వరుఁడు. ఈసౌధ
మున కుత్తరపుదిశయందు సింహద్వారమును నిర్మించి నాయ
ధీశ్వరునకును నాకును నవజ్ఞత బ్రతిపాదించుట న్యాయము
కాదు" అని తనయనమ్మతముఁ బ్రకటించు వర్తమానమును
పేష్వాకడ కనిపెను. ఆకారణమువలన నీసౌధసింహద్వారము
బాజీరా వసంపూర్తిగ నిలుపవలసివచ్చెను. అనంతరము బాజీ
రాయనికొమరుఁడు బాలాజీబాజీరావు సాహూ పరలోకగతుఁ
డైనపిమ్మట పిత్రాదేశముఁ బాలనమొనర్చుచు, తనయమోఘ
విక్రమమువలన సాహూకర్తృకప్రశంసితాంగీకృత పాదుషా
హీసమ్మానమున కవజ్ఞత నాపాదించెను. బాజీరావుకాలములో
నీ ప్రకాండప్రసాదము వివిధచిత్రవిచిత్రోపకరణములచే సుసజ్జి
తమై, కాలాంతరమునఁ బేష్వాగణమునకు వాసస్థానమై, తదౌ
న్నత్యముతోపాటు వృద్ధివైభవములచే శోభాయమానమై

* ఔరంగజేబు కటాక్షవీక్షణములకుఁ బాత్రుఁడై, యాతనియంతిగ
పురములోను దర్బారులోను విశేషాదరముగ లాలనపాలనములఁ గనుచు
సాహూ తనబాల్యదశఁ గడపినవాఁడు. పిమ్మట నాతనివలనమహారాష్ట్రసామ్రా
జ్యసింహాసనమునుపడసినవాఁడు. ఆకారణమువలనమహారాష్ట్రాధిపునకు ఔరంగ
జేబునెడలను తదనంతరఢిల్లీశ్వరులయెడలనుభక్తివిశ్వాసములఁ బూనినవాఁడు.

"ఢిల్లీనగరము పూనానగరమున కుత్తరదిశయం దుండుటవలన శనివార
వాడాసింహద్వార ముత్తరదిశయందు నిర్మించినచో యుద్ధయాత్ర కరుగుసమ
యములలో నిందలియోధులు ఢిల్లీనగరమున కభిముఖులై బయలువెడలు
దురు. అందువలన ఢిల్లీశ్వరున కవజ్ఞత నొనర్చువా రగుదురు" అని సాహూ
యాశయము.

యుద్ధయాత్ర కరుగు నాయకులు సింహద్వారముగుండ వెడలుట
సుప్రసిద్ధాచారము.

రాజప్రాసాదముఁ బోలియుండెను. ఈప్రాసాదము పూనానగర
ములోని శనివారపేట యనుభాగములో నిర్మింపఁబడియుండి
నందున తద్భాగనామానుకరణముగ 'శనివారవాడా' యని
ప్రఖ్యాతిఁ గనియెను. ప్రస్తుత మీసౌధములో నధికాంశము
భాగ విభాగములుగ విభజింపఁబడి, మండలన్యాయాధిపతుల
(Collector's Office and Judges' Court) కచ్చేరీలు నెల
కొల్పఁబడియుండె.

బాజీరావుకాలములో పూనానగరమునకుఁ బ్రాప్తమ
యిన యైశ్వర్యసౌభాగ్యముల నాకాలములోని యైరోపాభ్రమ
ణకారి (పథికుఁడు) గార్డెనుదొరవిరచిత మగు వర్ణనముఁ బఠిం
చినచోఁ జక్కఁగఁ దెలియనగును ఐరోపాపథికులలో విఖ్యాతిఁ
గనినగార్డెనుదొర ప్రప్రథమమునఁ బూనానగరములో బదా
ర్పణ మొనర్చినవాఁడు. ఆతని యద్భుతవర్ణవేషవిన్యాసవిలోక
నమునకునై నాగరికరసికులు సహస్రసంఖ్యాకులుగ నేకత్రితు
లైరి. క్రీ శ 1739 వ సం॥లోఁ బూనానగరవ్యవస్థఁ బ్రత్యక్ష
ముగఁ బరికించిన పర్యటనపరుఁ డగు గార్డెనుదొర పూనానగర
వైభవ మీవిధముగ వర్ణించెను.

పూనానగరముఁ బోలినసుందరనగరములు భారతవర్ష
ములో నతిస్వల్ప సంఖ్యాకములు. ఈనగర మత్యంతవైభవ
సమన్వితము. క్షమతాసంపన్నము. పణ్యవీథులలోని, వివిధవిధ
ములగు పుష్పశాకాదులప్రోవులఁ జూచి విస్మయహృదయుఁడ
నైతిని. శస్త్రనిర్మాణమున కనువగురాజకీయయంత్రశాల లనేక
ములు గలవు. ఇవిగాక యనేకవిధములగు ఖడ్గములు, కృపాణ
ములు, కుంతములు (బల్లెములు), కటారులు, అసిచర్మములు,

తుపాకులు, ఫిరంగులు, గుండ్లు మొదలుగాఁగలయుద్ధోపకరణములు నిర్మించుగృహములఁ బెక్కింటిఁ జూచితిని. తంతువాయమాలాకార శిల్పిసమూహముల కౌశలమును వీక్షించి స్తంభితుఁడ నైతిని. పణ్యశాలలలోనికిఁ బ్రపంచములోని సమస్త ప్రదేశములలోని సమగ్రపదార్థములు క్రయవిక్రయముల కరుదెంచుచుండును. నగరవాసులు రాష్ట్రపాలకుల కృపాకటాక్షములకు పాత్రులై సుఖజీవనమును వడయుచుండిరనుటకు తన్నివాసుల సంపదైశ్వర్యములు ప్రబలనిదర్శనములు. నగరవాసులలోఁ గుబేరునిఁబోలు ధనవంతులు పెక్కండ్రు కలరు. నగరవాసుల లావణ్యమయశరీరములు సువర్ణరత్నాభరణములచే నలంకృతములై యొప్పుచుండును. అచ్చటివాణిజ్యవ్యాపారము విరాటవిస్తృతము. నగరము, వివిధవస్తువాహినీభారవాహకములగు శకటరాజముల నిరంతరగమనాగమనముల కాకరమై రాజిలుచుండెను. దినదినాభివృద్ధిఁగనుచుండిన పేష్వాప్రతిపత్తిప్రవృద్ధులతోఁబాటు, నగరవాణిజ్యవైభవములు ప్రవర్ధితములగుచుండెను.

## పేష్వాకు పుత్రలాభము

పేష్వాపదమునఁ బ్రతిష్ఠితుఁ డైనకొలఁదికాలములోనే క్రీ. శ. 1721-వ సం॥రము నవంబరునెలలో బాజీరావునకుఁ బుత్రలాభము ప్రాప్తమయ్యెను ఈనవజాతకుమారుని నాతని బాల్యదశయందు "నానాసాహేబు" అని సంబోధించుచుండిరి. మహారాష్ట్రీయాచారానుసరణిని బాజీరావు పితృనామమీ బాలకునకు నామకరణ మొనరించెను. ఈబాలుఁడు భావికాలములో "బాలాజీబాజీరావు" అనునామమున దేశచరిత

ములయందుఁ బ్రఖ్యాతిఁ గనియె. బాజీరాయనికృతసంకల్పిత మహోద్దేశ్యమాతనియకాలమరణమువలన వినాసాదిత మయ్యె నను జనశ్రుతి బాలాజీబాజీరావు తనయద్వితీయబలపరాక్రమ ములవలనఁ బాటఁద్రోలి, భారతవర్షములోని పలుభాగములలో హిందూసామ్రాజ్యమును విస్తృత మొనర్చెను. కాని యాతని శాసనకాలములోని శేష (యపర) భాగములో మహారాష్ట్ర శక్తిప్రవాహము విషమాఘాతమునఁ బడి యొక్కింతకాలము విశాశ్వరత్వమునకుఁ బాలయ్యెను.

### రఘునాథరావు.

విఖ్యాతవీరవరుఁడగు రఘునాథరావు లేక,రాఘోవాజీ బాజీరాయని ద్వితీయపుత్త్రుఁడు. ఆతఁడు, అటక్‌నగరములో మహారాష్ట్రవీరవిజయవైజయంతిఁ బూరింప నొనరించినజన కుని సంకల్పమును, బూర్తి యొనరించి శాశ్వతయశముఁ జూఱఁగొనెను. రఘునాథరావు, బలపరాక్రమముల జనకుని మించినవాఁడనుపొగత్తను పెక్కుసందర్భములలో తార్కాణ మొనరించెను. కాని, విధివైపరీత్యమువలన, రాజనీతికవిచక్షణ ముదూరగతమగుటవలనను కమనీయకామినీకాముకుఁడై తన్మో హజాలమునఁ జిక్కువడి, తనశౌర్యసంపదను బోనడపి, శేషజీ వనమును కళంకకాలిమాంకిత మొనరించెను. ఎఘునాథరావు కామినీలోలుఁడై రాచకార్యవిచక్షణా విముఖత్వముఁ బూనుట వలన మహారాష్ట్రసామ్రాజ్యము క్షీణదశకుఁ బాలు గావలసి వచ్చెను. అగుగాక ఏమైననేమి! అవిచారణ మిచ్చట యప్రస్తు తము. ఈయిరువురు కొమరులుఁ గాక బాజీరాయున కిద్దఱు కవలపిల్లలు జనించిరి. ఈయిరుపిల్లలు రామచంద్రపంతు, జనా

ర్ధనపంతు అనునామములతో వ్యవహరింపఁబడి బాల్యదశ యందే పరలోకగతు లైరి. బాజీరావు తనపుత్రులను సుశిక్షితులఁ గావించెను. అతఁడు తనపుత్రులను యుద్ధవిద్య నభ్యస్త మొనరించుకాలములో గావ్యనాటకాదులను వ్యాకరణాది షట్ శాస్త్రముల బఠింపించి, పండితవర్యులఁ గావించెను.

---

## నాలుగవప్రకరణము.

---

### మాలవ దేశగమనము.

నిజాముల్ ముల్కు విద్రోహియై ప్రవర్తించుచుండుట వలన, క్రీ. శ. 1720-వ సంవత్సరములో ఖాందేశములో మహారాష్ట్రపతికి ప్రాప్యమగు చౌతుసర్ దేశముఖీ సంక్రాంతరూపక రాజ్యాదాయము, ప్రాప్తమగుటయందు బాధకమును విఘ్నములు నుపస్థితములయ్యెను. ఖాందేశమందలి మొగలాయీగణము మదోన్మత్తతఁ జెంది మహారాష్ట్రకర్మచారులనిక్కట్టుల పాలుగావించి, సాహూజీ ప్రాప్తాదాయమునకుఁ బాధాప్రదాన మొనగుచుండె నని బాజీరావు విని 'రామచంద్రగణేశ్' అను మహారాష్ట్రవీరసేనానిని సేనాసహితముగ చౌతుసర్ దేశముఖీ రూపకరాజస్వసంగ్రహణమునకు, ఖాందేశమున కనిపెను. ఖాందేశములోని మొగలాయీలు, రామచంద్రగణేశునకు, రాజస్వప్రాప్తి యొనరించుకొనుటలో నిష్ఠుమంతయు వెనుదీయక సర్వవిధముల విఘ్నముల నాపాదింప మొదలిడిరి. కాని మహారాష్ట్రసేనాపతి తనబాహుబల మాధారముగఁ గొని సాహూజీకి ప్రాప్యమగు రాజస్వసత్వముఁ బ్రాప్తమొనరించుకొని

ప్రత్యాగతుఁ డయ్యెను. మరుచటిసంవత్సరములో మరల మొగలాయీలు మహారాష్ట్రదాయమునకు బాధక మాపాదింపఁజొచ్చిరి. మరల బాజీరావు, 'ఉదయజీప్రమా' రనుసేనాపతిని సేనాసహితముగ గుజరాతుఖాందేశములలో రాజస్వసత్వములను సంగ్రహించుటకును మాలవదేశము నాక్రమించుటకు నాజ్ఞయిడి పనిచెను. క్రీ.శ. 1698వ సం॥ నుండియు,మహారాష్ట్రులు మాలవదేశములో చౌతుపద్ధతిఁ బ్రవర్తిత మొనరించుటకుఁ బ్రయత్నమొనరించుచు వచ్చుచుండిరి. క్రీ.శ. 1719-వ సం॥ రములో పేష్వాబాలాజీవిశ్వనాథుపంతు. ఢిల్లీశ్వరులవలన మాలవదేశములో చౌతుపరివర్తనాధికారస్వత్వపత్రముఁ గైకొనియెను. కాని యాతని కా.కాలములోని రాజకీయవ్యవహార బాహుళ్యము ఢిల్లీశ్వరప్రదత్తాధికారానుసరణిఁ జౌతుసంగ్రహణమునకు సమయ మలవడనీయకపోయెను. అనంతరము బాజీరాయనియా దేశమున నుదయజీప్రమార్, తనబాహుబలమువలనను, కార్యపటుత్వమువలనను క్రీ.శ. 1722,1723-వ సం॥ రములకు ప్రాప్యమగు చౌతురూపకాదాయముఁ బూర్ణముగ సంగ్రహించి సతారానగరమున కరుదెంచెను.

మాలవదేశములో మొగలాయీపక్షమున రాజాగిరిధరరావు సర్దారుగ వ్యవహరించుచుండెను. అతఁడు విద్రోహమండలములోఁ జేరి, తద్దేశములోని సాహూయధికారమునకు భంగ మాపాదింప మదినిశ్చయించి తత్ప్రయత్నముల నొనరింప నుపక్రమించెను. ఈసంపాదమును విని, బాజీరావు సేనాసహితముగ నుదయజీప్రమారును గనిష్ఠభ్రాతయగు చిమణాజీని వెంటఁగొని చని 1723-వసం॥ము డిశంబరు నెలలో మాలవదేశములో నుపస్థితుఁడయ్యెను. రాజాగిరిధరరావు మొగ

లాయీపత్యావలంబియై తత్సాహాయ్య మలవఱుచుకొని బాజీ
రాయుని నాక్రమించెను. కాని, గిరిధరరావు సమరాగ్నిఁ బడి
భస్మీభూతుఁ డయ్యెను.

### బాజీరాయనినీతికౌశలము.

ఆకాలములో మహారాష్ట్రవీరుల కుత్తరభారతమున కరు
గుటకు మాలవదేశము ద్వారరూపముగ నొప్పియుండెను.
ఆకారణమున బాజీరావు ప్రథమమున మాలవదేశముఁ గర
గత మొనర్చుకొని యనంతరము క్రమక్రమముగ నుత్తరభార
తములోని మొగలాయీశాసితప్రదేశములలో మహారాష్ట్ర
శాసనాధికారమును విస్తరింపఁ గృతనిశ్చయుఁడై, బాజీరావు
తత్ప్రయత్నములో నిరంతరము మెలఁగుచుండెను. కాని, ప్రతి
నిధి శ్రీపతిరావు, ఆతనియెడ నీర్ష్యాపరతంత్రుఁడై ప్రతిపక్ష
మూని, శౌర్యసాహసములకుఁ బుట్టినిల్లని ప్రఖ్యాతి గాంచిన
బాజీరాయునకు నిజవిక్రమమును కార్యదక్షతను ప్రకాశమొన
రించుట కవకాశ మలవడనీయకుండఁ జేయుచుండెను. ఆ
కారణమున నాతఁడు మహారాజునకు ప్రీతిపాత్రుఁడై యంత
రంగమున మెలంగనేరకుండెను. బాజీరావు రాజసమ్ముఖ
మున నుత్తరభారతయుద్ధాభియానముఁ గూర్చి ప్రసంగోత్థా
పన మొనర్చునపుడెల్ల శ్రీపతిరావు తర్కవితర్కముల నవతా
రణ మొనర్చి యాతనిప్రస్తావనఁ బ్రతిపన్న మొనర్చుటలో
నగ్రేసరుఁడై మెలఁగుచుండెడివాఁడు. బాజీరాయనిఁబోలె
సాహసి యుత్తరభారతములో నిజాధిపత్యమును విస్తరింపఁ
జేయుతమకమున నొప్పియుండినను, శ్రీపతిరా వీవిషయముఁ
బలుసారులు ఖండించినందున నాతఁడు కర్తవ్యవిమూఢుఁడై

తుదకు సచివసామంతసంభ్రాంతసభాంతరములో యుత్తరభార తయుద్ధాభియానవిషయము సిద్ధాంత మొనరింప నిశ్చయించెను. ఆప్రకార మొకదినమున సచివసామంతసర్దారుగణమును కర్మ చారబృందమును రావించి యొకగొప్పకొలువుఁదీర్చెను. ఆకొ లువులో సేనాపతియు దాక్షిణాత్యదళపతులు ఉచ్చపదాధి కారులు రాజకర్మచారులు శూరసామంతసచివసేనాపతులు సభాంతరములో నర్హాసనముల నలంకరించి యుత్తరభారత యుద్ధాభియానాంతిమమీమాంసాశ్రవణముఁ గూర్చి యుత్క ర్షహృదయులై ఛత్రపతి వీరతావిజడితసభాసౌభాగ్యము ద్వి గుణీకృత మొనర్చుచుండిరి. సాహూ సభాధిపత్యముఁ బూని నిజాసనమున విరాజమానుఁడైన పిమ్మటఁ బ్రతినిధి శ్రీపతిరావు బాజీరాయని శౌర్యసాహసములను కార్యసాధనతత్పరతను నుగ్గడించుచు యుద్ధాభియానఖండనానుకూలప్రతివాదావరణ మొనరించి,—

''పేష్వాబాజీరావు స్వపక్షపరపక్షబలాబలవిచారణమిం చుకైనను నొనర్పక, కేవల మాగ్రహదురాశావివశుఁడై యుత్తర భారతవిజయకాంక్షఁ బూని తదనుగుణప్రసంగోత్థాపన మొన ర్చుచున్నవాఁడు. వర్తమానమున మన మొకసామాన్యవిద్రో హనాయకుని దమన మొనర్చుట కశక్తులమై యున్నవార మనుట కేవలము నిర్వివాదాంశముకదా! నిజాముల్ముల్కు సేనాసహి తముగ మనద్వారదేశమున నుపస్థితుఁడై యుద్ధమునకు నిరం తరముఁ గాలుద్రవ్వుచుండెను. ఈయువనవీరుని రణౌత్సుక్యము దూర మొనర్చుట కసమర్థులమై బిక్కమొగములు వైచి యుం టిమి. మనకు ప్రాప్తము కానున్న చౌతుసరదేశముఖీరూపకా

దాయమును నిర్విఘ్నముగ గ్రహియింప నేరకుంటిమి. అట్టి సందర్భములో విదేశవిజయ మభిలషించుట వట్టి దురాశా భూయిష్ఠమని యించుక పరికించినఁ దెల్లము కాకమానదు. స్వరాజ్యమును నిరుపద్రవముగ నొనర్చుకొను యత్నమునఁ బ్రవృత్తి నొందుట ప్రకృతప్రధానకర్తవ్యము. కొల్లాపురాధిపతి యగు శంభాజీతో మనకు నడచుచున్నవిరోధమును దూరమొనర్చు యత్నముఁ గూర్చియు, కర్ణాటాంచలములో మహాత్ముఁ డగు శివాజీసంపాదించిన రాజ్యముఁ బునరుద్ధారణ మొనర్చువిషయముఁ గూర్చియుఁ బరిష్కృతముఁ గాకుండ, మహారాష్ట్ర సామ్రాజ్యహితకాంక్షి నగు నేను తరభారతయుద్ధాభియాన విషయకోపన్యాసమునకుఁ జెవి యొగ్గనేరను. నవయావనుఁడగు బాజీరాయునకుఁ బోలె నాకును శౌర్యసాహసములు గలవు. నాకును మహారాష్ట్రసామ్రాజ్యవిస్తృతవిషయాభిలాషము పూర్తిగఁ గలదు. కాని యాసన్నవర్తియగు శత్రునిఁ దునుమాడక విదేశమునకేగి శౌర్యసాహసములఁ బ్రకటింప నెంచుట యుక్తియుక్తము కాదు" అని నుడివెను.

శ్రీపతిరాయని యుపన్యాస మీర్ష్యాపూరిత మనియు, నిందాగర్భితమనియు గ్రహియించి సభాసదులు బాజీరాయని దిక్కు మొగ మైరి.

ఆకాలములో బాజీరా వొకసుప్రసిద్ధసువక్త యని గణింపఁబడుచుండినవాఁడు. ఆతఁడు శ్రీపతిరాయని ప్రతివాదరూపకోపన్యాస మాద్యంత మాలించి తదనంతరము నిజప్రస్తావనపోషణానుకూలమగు నొకదీర్ఘోపన్యాసము నొసంగెను. అందలిమర్మ మీవిధమై యుండెను.

### బాజీరాయనివక్తృత్వము.

ప్రతినిధిమహాశయుఁడు శ్రీపతిరాయనియుపదేశ మత్యంతవిస్మయవిషాదములఁ గలుగఁజేయుచున్నయది. దేశమందలి ప్రస్తుతావస్థ శ్రీపతిరాయనికి హృదయంగమ మయినటుల నేను దలఁపఁజాలను. ప్రస్తుతమున మొగలాయీసామ్రాజ్యమహావృక్షము విద్రోహాగ్నిమున కాకరమై జీర్ణావస్థకుఁ బాల్పడిన యది. ఈసమయమున వ్యతీత మొనరించినచో, దానిమూలమునఁ*గుఠారాఘాత మొనర్చుటకుఁ దగుసమయము మఱియొకప్పు డలవడు ననుట యసంభవము. డిల్లీశ్వరుఁ డీతరుణములో మహారాష్ట్రముఖాపేక్షిపియై యున్నవాఁడు. అతఁడు మహారాష్ట్రులసాహాయ్య మలవఱచుకొని, తనసామ్రాజ్యమును రక్షించుకొన నభిలషించియున్నవాఁడు. అందులకుఁ దగువిధమున నాతఁడు మెలఁగుచుండె ననువిషయ మెల్లరకుఁ దెల్లము. ఈయుద్విగ్నావస్థయందు మన మూరకొనక యథోచితపరాక్రమముఁ బ్రదర్శించినచో భారతభూమియం దంతటను స్వరాజ్యముఁ బ్రతిష్ఠింప సమర్థులమగుదుము. మొగలాయీశాసనపరివర్తనమున భారతవర్షము విదేశీయులపాలు గాక హిందూశాసనమున నిమిడి యుండు. నిజాముల్ముల్కునకు వెఱచి

---

* కుఠారాఘాతము, వైరినిర్యాతనము నాకాలమందలి మహారాష్ట్రవీరుల వంశపరంపరాగతమగు ధర్మవర్తనము. అదియట్లుండ నౌరంగజేబువలన శివాజీకుమారుఁడు శంభాజీకిఁ బ్రాప్తమయిన యకాలభయదమృత్యువు మహారాష్ట్రవీరుల నుత్తప్తహృదయులఁ జేయుచు ప్రతీకార మొనరింపఁబురికొల్పుచుండెను. ఆకారణమువలన వీరచక్రచూడామణి యని ప్రసిద్ధిఁ గాంచిన బాజీరావు మొగలాయీశాసనోచ్ఛేదనాభిలాషి యయ్యెను.

మొగలాయీశాసనమును నాశన మొనర్చుటకుఁ బ్రాప్తమయిన యీసుయోగమును బరిత్యజించుటగాని, పరిత్యజింపవలసిన దను యుపదేశమును స్వీకరించుటగాని కార్యవాదులకును బుద్ధిమంతులకును లక్షణముకానేరదు. ప్రతినిధిమతానుసరణముగ మనము భీతచిత్తులమైనచో రాజ్యాభివృద్ధి నెట్లు చేయఁగలము? పరలోకగతుఁడైన శివాజీమహారాజు దౌలతాబాదునందొరంగజేబువంటి భీషణపరాక్రాంతుఁడగు శత్రువవస్థితుఁడై యుండిన సమయమందు సయితము బీజపూరు గోలుకొండసులతానులకు విరుద్ధముగ యుద్ధయాత్రకరుగుటయందు విరతుఁడు గాలేదు. పిమ్మట బీజపూరు, గోలుకొండసులతానులను పూర్ణరూపముగ దమిత మొనర్చుటకుఁ బూర్వము కర్ణాటదేశములో నిజాధికారముఁ బ్రతిష్ఠింపఁ బ్రాప్తమయిన సమయముఁ బరిత్యజింపనివాఁడయ్యె. శంభాజీమహారాజు మరణానంతరము, మహారాష్ట్రదేశము సంపూర్ణముగ డిల్లీశ్వరునిహస్తగత మయ్యెను. మహారాజు సాహూపాదుషాహీబందిగమునకుఁ బాలయ్యెను. అట్టిసమయమున మహారాజు రాజారామిసుమంతయు భయమొందక జంజీదుర్గములో నుపస్థితుఁడై పాదుషాహీ శాసనోచ్ఛేదనమున కనువగుయత్నముల నొనరింప సమకట్టెను. స్వదేశము ఘోరవిపదంబుధిఁ బడి దరిగాననితరుణమందు మహారాజరాజారాము సర్దారు లౌరంగాబాదుప్రభృతి పాదుషాహీశాసితప్రదేశముల నాక్రమించి యుండిరి. ప్రతినిధిఁబోలె వారుకూడ నాసమయములలో భీరుత్వముఁ బ్రకటించినచో నేకార్యమును సాధింపఁ జాలనివారగుదు రనుటకిసుమంతయు సందియము లేదు.

నిజాముల్ ముల్కునకు వెఱవఁ దగు కారణ మెట్టిదియో యెఱుఁగఁబడదు బంధుప్రియుఁడగు సాహుమహారాజు కొల్లాపురాధిపతితో విరోధభావమూనుట ధర్మవిరుద్ధము. మన కిష్టమైనచో సంధిసంస్థాపనమున మైత్రి నెఱపుకొన నగును. అందువలనఁ గర్ణాటము సువ్యవస్థఁ గనఁగలదు. చక్రధరునికృపాకటాక్షమునకుఁ బాత్రులమై బాదుషాహిబందిగమునుండి సురక్షితముగ వెలువడినమహారాజుఁ గనఁగలిగితిమి. ప్రనష్టప్రాయమైన స్వరాజ్యముఁ బునరుద్ధారణ మొనర్చుటలో సఫలమనోరథులమైతిమి. డిల్లీశ్వరునకు సాహాయ్యమొసంగితి మనుప్రఖ్యాతిఁ బడసియలౌకికయశశ్చంద్రికల దిగంతములఁ బ్రకాశింపఁ జేయఁ గలిగితిమి. అంతియ కాక మహారాష్ట్రవీరవాహిని, హిమవత్పర్వతశిఖరస్థితమగు 'అటక్' నగరములో సైన్యము సాహూవిజయవైజయంతిఁ బూరింపఁగల సామర్థ్యముఁ బడసియున్నది. వైదేశికశాసనకర్తలను వితాడితులఁ గావించి హిందూశాసనమును నెలకొల్పసామర్థ్యము గలమహారాష్ట్రవీరవాహినిఁ బ్రతినిధిమహాశయుఁడు మాకుమాలి నడఁగఁ ద్రొక్క నుదినెంచుట యెంతటివిషాదకరవిషయమో యించుక విచారింపుఁడు. మొగలాయిశాసనము నున్మూలముఁ గావించి మహారాష్ట్రసామ్రాజ్యమును విస్తరింపఁ జేయనినాఁడు, మహారాష్ట్రాధిపునిచే నేనుచ్చపదమునఁ బ్రతిష్ఠింపఁబడినందులకు సార్థకమేమి? మహారాజు కేవలమాజ్ఞాప్రదాన మొనరించినచో, నేను నూతనసైన్యమును సమకూర్చి మొగలాయిసామ్రాజ్యముపై సాహూయధికారమును విస్తరింపఁ జేసెదను. అంతియ కాక నిజాముల్ ముల్కు బలదర్పముల ధ్వంసము చేయుభారమును

గూడ వహించెదను. భారతవర్షమందు, యవనశాసనోచ్ఛేదన మొనర్చి హిందూశాసనమును ప్రతిష్ఠించుట ఛత్రపతిశివాజీ ముఖ్యోద్దేశము. కానియామహామహుఁడకాలమునభీషణమృత్యువువాతఁ బడుటవలన నాతనిసంకల్పము సిద్ధసంకల్పమయినది కాదు. మహారాజు సాహూపుణ్యబలమున నేనీతని బితామహుని సంకల్పముఁ బూర్ణ మొనరించెదను. నేను పూజనీయులగు నాజనకునివెనువెంట నుత్తరభారతమున కేగి యందలివ్యవస్థావస్థలను ప్రత్యక్షముగ బరికించి యున్నవాఁడను. హిందూస్థానమందలి యపరాపరనరేంద్రపుంగవులతో నింతకుఁ బూర్వమేసంధిమూలకముగ మైత్రి నెఱపుకొనియున్నవారము. నేను మహారాజాజ్ఞకుఁ బాత్రుఁడ నైతినేని, మొగలాయీశాసనోన్మూలమున కనువగు సామర్థ్యముఁగలవాఁడ నగుదును. కర్ణాటకొల్లాపురవ్యవహారములు ప్రతినిధిమహాశయున కత్యావశ్యకములుగఁ దోఁచినయెడ, ప్రకృతమున సుశిక్షితఁ బడసి సుసజ్జితమై వఱలుచున్న సేనాసమూహముఁగొని యాతఁ డావంక కరుగనగును. ఉత్తరభారతవిజయభారమును, మహారాజాజ్ఞ యొసఁగినచో నేను స్వీకరించెదను.

—సభాపతిప్రశంసావాదము.—

వీరవల్లరీవిరాటు పేష్వాబాజీరాయని యుత్సాహపూరిత విక్రమవిఘూర్ణిత దీర్ఘోపన్యాసమును సాంతముగ సావధానముగ నాలించి సాహూప్రసన్నహృదయుఁడై యాతని నతిశయముగ నుగ్గడించుచు—"పేష్వాబాలాజీపంతునిఁబోలు శౌర్యసంపన్నుఁడు, కార్యదక్షుఁడు వేఱొకఁడు గానరాఁడు. అట్టి వీరేంద్రుఁడు, స్వపక్షము గ్రహించి మించియుండ గగనవి

దారియగు హిమవత్పర్వతశిఖరమున రాజిలు కిన్నరనగరము
లో విజయఘోషణ మొనరింపఁ జేయుట నాకసాధ్యవిషయ
ము కాఁజాలదు. ఇఁక హిందూస్థానవిజయ మనిన నొకలెక్క
యా! నాయాంతరికాభిలాష బూర్ణముగ గ్రహించి, తద
నుగుణపోషణప్రస్తావన మొనర్చిన బాజీరావు సహర్షముగ
నుత్తరభారతవిజయమున కేఁగనగును. నిజాముల్ముల్కు కర్ణా
టవిజయముల భారమును మేము వహించెదము" అని పలికి
సభాసదులహృదయపద్మముల వికసింపఁ జేసెను.

పేష్వా యుపపాదన మొనరించిన యుత్తరభారతవిజయ
ప్రస్తావనను సాహూ సాదరముగ గ్రహించి, తదనుగుణాదేశ
మొసంగుచు, సువర్ణవిరచితములగు ఛత్త్ర, దండ, భూషణపరి
ధానముల బహుమాన మొసఁగి గౌరవించెను. ఆదినమున
బాజీరా వొసంగినయుపన్యాసము, వీరసామంతసర్దారుసమా
జమును శౌర్యసాహసోత్సాహముల నోలలాడించెను. బాజీరా
యునిఁ గూర్చి సభ్యులొనరించు ప్రశంసావాదమునకు మేరగాన
రాదు. ఇంతవఱకు మహారాష్ట్రదేశములో శ్రీపతిరాయనికిఁ
గలయధికారగౌరవ ప్రపత్తులు కీసంఘటనమువలన వైలక్షణ్యము
సంప్రాప్తమయ్యెను. బాజీరాయున కధికగౌరవ మలవడెను.
మహారాజా సాహూ కూడ బాజీరాయునియెడ నత్యంతము
ప్రీతచిత్తుఁ డయ్యెను. ఈచిరస్మరణీయసంఘటనము క్రీ. శ.
1725-న సం॥ రములో ఘటిత మయ్యెను.

### బాజీరాయనిస్వభావము

రాజసభామధ్యమున నొసంగినవీరరసపూరితవ్యాఖ్యా
నమున కనురూపమగు శౌర్యబలసాహసముల బాజీరావు కొ

పడినవాఁడుకాఁడు. అతఁడు స్వతస్సిద్ధముగ బలిష్ఠుఁడు. కష్ట సహిష్ణుఁడు, అమాయకుఁడు. దయార్ద్రహృదయుఁడు. ఋజుమార్గప్రవర్తకుఁడు. ఆడంబరవిదూరుఁడు. అతఁడు, యుద్ధసమయములలో, భోజనాదికములకుఁ దగుసమయములవడనియెడల, పదిపదునైదుదినములపర్యంత మశ్వపృష్ఠమున నారూఢుఁడై, పచ్చియరటికాయలను, పచ్చిసెనగలను నాహారముగఁ గైకొని కాలాతిపాత మొనరించుచు శత్రుసైన్యముల నుఱుమాడు చుండెడివాఁడు. అతఁడు తలఁచినకార్యమును సాధింపకుండ విడఁచు స్వభావము కలవాఁడు కాఁడు.

బాజీరాయనిచిత్రపటము.

బాజీరావు, పేష్వాపదమునఁ బ్రతిష్ఠితుఁడై, యుచ్ఛపదవిఁ బడసియున్నను, యుద్ధసమయములయందద్వితీయుఁడై, యశ్వారోహణ మొనర్చి సామాన్యసైనికునిఁ బోలి శత్రులవంకకు ధావమానుఁ డగుచుండెడివాఁడు. ఆకారణమున నాతని నెవ్వరును మహారాష్ట్రవీరసేనావాహినికి నాయకుఁ డని గుఱుతిడఁ జాలక యుండెడివారు.

నిజాముల్ ముల్కు, బాజీరాయనితోఁ బెక్కుసారులు యుద్ధమొనరించి యున్నవాఁడు. కాని యాంతని గుఱుతిడ నేరక, యాతఁడు యుద్ధరంగములలో నుపస్థితుఁడగుసామర్థ్య మాతనికడ లేదని భ్రమపడుచుండెడివాఁడు. ఆకారణమున నిఁక బాజీరాయనిరూపముఁ బ్రత్యక్షముగఁ గనుఁగొనుట సంభవింపనేరదని నిశ్చయించి, క్రీ. శ. 172--వ సం॥రములో నాతని రూపమును సంపూర్ణముగ లిఖించి కొనితేర నొకనుదక్షచిత్రకారున కాజ్ఞనొసగెను. బాజీరావు మాలవదేశవిజయాభియాన

మున కరుగ నగ్రేసరుఁడై యుండునవుడు యమున నాచిత్రకారుఁడాతనిసమ్ముఖమున కేగి, యాతనియాజ్ఞఁ గైకొని, యాయవస్థయందలిరూపము నంకితముఁ గావించెను. ఆకాలమందు బాజీరావొకయున్నతమగు నారబుదేశీయోత్తమాశ్వముపై నాసీనుఁడై, భుజస్కంధమున వైరివీరులకు హృదయవిదారకమగు బల్లెమును నెలకొల్పి, పచ్చిసెనగలఁ జేతులతో నలిపి పప్పు చేసి భక్షించుచు నగ్రేసరుఁ డయ్యెను. మస్తకముపై నమరియున్నలోహనిర్మితశిరస్త్రాణము వస్త్రాచ్ఛాదితమై యుండెను. శరీరమందు, లోహవిఘటితాత్మకవచమును కప్పిపుచ్చు నంగరఖాయును (కుల్లాయి) కటితటసంలగ్నవిలంబితోల్లంగ దీర్ఘకృపాణమును, జంఘాదిపదపర్యంతవ్యాపితలోహజ్వాలాచ్ఛాదితపాదరక్షలును, సాసురపదత్రాణమును, గళమునందు గ్రీవారక్షికయును గలిగి, భయదాకారుఁడై యాతఁడు చూపఱులగుండె లవియించుచుండెను.

బాజీరాయునియాయద్భుతపూర్వవీరత్వబోధకచిత్రపటముఁ బలుసారులు పరికించి, భయవిహ్వలుఁడై, "ఈవ్యక్తిని మనుజుఁ డని తలంప వలనుపడదు. దుర్జయపరాక్రమసంపన్నుఁడగు రాక్షసుఁడై యుండనోపు. లేనినాఁ డీయప్రతిహతవిశిష్టబలసంపదను బడయుట పొసఁగనేరదు. తగునంత సైనికబలమును సమకూర్చుకుండ నీతని నెదుర్కొనుట ముప్పునకు మూలము." అని నిండుకొలువులో తనయధీరతఁ బ్రకటించుచు నిజాముల్ముల్కు పలికినటులఁ జరిత్రములు ఘోషించుచున్నవి.

నిజాముల్ముల్కు యథాశక్యముగ సైన్యబల మెంత

యులవఱచుకొని బాజీరాయని నెదుర్కొనినను, బలుసారు లాయభేద్యబలసంపన్నుని, ఆదుర్జయరణపండితుని హస్తముఁ బడి విడంబితుఁడు గావలసినవాఁడయ్యెను.

## నవీనసేనాసంఘటనము.

సాహూరాయనుమతికిఁ బాత్రుఁడై బాజీరావు రెండు లక్షలరూప్యములను ఋణమూలకముగ సంగ్రహించి నూతన సైన్యమును సమకూర్పనారంభించెను. అవసరసమయములందు సమకూర్చు నూతనసైన్యముల నస్థిరభావముగ పరిగణించుచు, దోపిడులలో ప్రాప్తమగు ద్రవ్యమందొకభాగమును వేతనరూపకముగ నొసంగుచుండుట యనూనాచారమై యుండెను. బాజీరావాచారముఁ జాలనఱకుఁ దొలఁగించి, వేతనముల నొసంగుచు స్థాయీభావమున సైన్యపోషణ మొనర్చుపద్ధతి నవలంబించెను బాలాజీవిశ్వనాథునిమూలకముగ నుత్తరభారతములో మహారాష్ట్రాధిపతి సుగుణసంపద విశేషముగ వ్యాప్తమయినకతమున నందలివాస్తవ్యులు పెక్కండ్రు మహారాష్ట్ర సైనికవర్గమునఁ జేరి, మహావీరులయి, యోధలయి భవిష్యత్కాలములో సుప్రసిద్ధపదవులఁ బడయుటకు సమర్థు లయిరి. ఈసందర్భమున, మల్హరరావుహోల్కారు, రాణోజీసేంధియా, గోవిందరావుబుందేలా, ఉదయజీప్రమార్ మొదలుగాఁ గల వీరవరులనామముల నిందుదహరించుట యత్యావశ్యకము.

మల్హరరాయనిజనకుఁడు పూనాజిల్లాంతర్గతనీరానదీతీరవర్తి, "హోల్" నామకగ్రామరక్షకుని (చౌగులా) కర్తచారులలో నొకఁడు. మేషపాలన మాతనివంశానుగతవ్యవసాయము. మల్హరరావుకూడ తనబాలప్రాయములో మేషపాలక

మొనర్చియుండెను. యౌవన మంకురించినపిమ్మట నాతఁడు మహారాష్ట్రసైనికవిభాగమందు ప్రవృత్తుఁడయ్యెను. బాజీరా వాతనిబుద్ధిబలమును బరాక్రమసంపదను బరికించి యాతనిస్వీయదళమునఁ జేర్చుకొనెను. తదనంతరమున మల్హారురావు క్రమక్రమముగ నున్నతిఁగని శేషకాలములో నొకవిశాలభూమండలమున కధీశ్వరుఁ డయ్యెను.

రాణోజీ సేంధియా, గ్వాలియర్ సేంధియావంశమునకు మూలపురుషుఁడు. ఆతఁడు ప్రథమమున మోగలులయాధీనమున జీవనము నడుపుచుండెడివాఁడు. పిమ్మట మోగలుల యౌన్నత్యపతనశీలతను మహారాష్ట్రులయభ్యుదయమునుఁ బరికించి యాతఁడు బాలాజీవిశ్వనాథునికడ కరుదెంచి యాతని యనుగ్రహమునకుఁ బాత్రుఁడై, యశ్వసాదిగణములోఁ జేరెను. రాణోజీ, సామాన్యభృత్యభావముననే చిరకాల మతివాహిత మొనర్పవలసినవాఁడయ్యెను. బాజీరా వాతనికష్టసహిష్ణుతను, కార్యసాధనతత్పరతను గ్రహియించి, యాతని నుచ్చపదస్థునిఁ గావించెను హోల్కరునకును సేంధియాకును విశేషముగ సంబంధము కలిగియుండెడిది.

గోవిందరావుబుందేలా, రత్నగిరిమండలాంతర్గతము గు 'నేవూర్' గ్రామ 'కుల్కర్ణి' శేఖరునిపుత్రుఁడు. జనకుని మరణానంతరమాతఁడు నిష్ఠురదారిద్ర్యముచే పీడింపఁబడి పిమ్మట బాజీరాయునికడ కరుదెంచి సేవకత్వమునుగ్రహించెను. నియుక్తకార్యనిర్వహణపరాయణత్వమువలనను, శౌర్యసంపదవలనను గోవిందరావుబుందేలా క్రమక్రమముగ నున్నతపదవిఁ గనుచు క్రీ. శ. 1733-వ సం॥ రములో బుందేలుఖండమునకు సుబేదా

రుగ నియుక్తుఁ డయ్యెను. ఈతఁడు పానిపట్టుయుద్ధములో తన యకుంఠితపరాక్రమమును వెలువఱిచి వీరస్వర్గముఁ జూఱఁగొనెను.

ఉదయజీప్రమారుని పూర్వచరితము లభించుటలేదు. కాని యాతఁడుకూడ బాజీరాయనివలన నున్నతిఁ గనినటులఁ గానవచ్చుచున్నది. పైనుదహరించినమనుజులు ప్రప్రథమమున సాధారణభృత్యకోటిలో చేరినవారైనను, బాజీరాయనిసహచర్యవలన ననంతర (పశ్చాత్) చరితమందుచ్చపదప్రాప్తిఁ గను యోగ్యత గడియించిరి.

### మాలవదేశాక్రమణము.

ఉత్తరభారతవిజయమున కాజ్ఞాపత్రముఁ గైకొని బాజీరావు భల్లాలు క్రీ. శ 1725వ సం॥ రములో రెండుసారులు మాలవదేశము నాక్రమించెను. రెండుసారులును తదీశ్వరుఁడగు రాజాగిరిధరరావు పరాజితుఁ డయ్యెను. మాలవదేశము సంపూర్ణముగఁ దోఁచుకొనఁబడెను. ఈదోపిడులవలన లభించిన యావద్ధనమును, పూర్వపుపథము పరివర్తన మయినందునఁ బాజీరాయనికరగత మయ్యెను

రాజాగిరిధరరాయనిఁ బరాజితునిఁ గావించుసందర్భములో హోల్కరు సేంధియా, ప్రమారులు తమతమపరాక్రమములను సంపూర్ణముగఁ బ్రకటించిరి. అందువలన బాజీరావు వారియెడ మిగుల ప్రసన్నుఁడై సేనాసంరక్షణమునకుఁ గాను మాలవదేశములో లభించి చౌతుసర్ దేశముఖిరూపకాదాయమునం దర్ధభాగమును గ్రహించునధికారమును వారలకు పురస్కారపూర్వకముగ నొసఁగెను.

ఈసందర్భమందు సుప్రసిద్ధచరిత్రకారుఁడగు మాల్కమ్ దొరగారు "బాజీరాయని శాసనసుప్రబంధము మహారాష్ట్ర సేనానులవర్తనమును సత్పథమునఁ బ్రవర్తింపఁజేసినందున, మొగలాయీశాసనపీడితులగు మాలవ్యులు మహారాష్ట్రాధీనతఁ గడుసనురక్తిఁ గ్రహియించిరి. ఆకారణమువలన విస్తృత ప్రదేశమగు మాలవదేశము సంపూర్ణముగ ప్రయాసరహితముగ ననతికాలములో మహారాష్ట్రపతిహస్తము నలంకరించినది" అని నుడివిరి.

### కర్ణాటయుద్ధాభియానము.

కర్ణాటదేశము శివాజీయమోఘపరాక్రమమువలన మహారాష్ట్రాధికారమునకు లోనయ్యెను. అయ్యది కాలాంతరమున దక్షిణభారతమునకు సుబేదారుగ నియుక్తుఁడై చనుదెంచి మహారాష్ట్రవిద్రోహిగణములోఁ జేరిన నిజాముల్ముల్కు యాధీనమయ్యెను. ఈపరాధీనమయిన ప్రదేశమును బునరాధీనమొనర్చుటకు శ్రీపతిరావు విశేషోత్సుకుఁడై క్రీ. శ. 1720 వ సం॥ లో ననేకసారు లాదేశమాక్రమించి నిజాము నెదిరించెను. కాని, యందువలన ఫలమావంతయుఁ గానరాలేదు. అంత సాహూ శ్రీపతిరాయని యుపదేశక్రమముగ మహారాష్ట్ర సేనానుల కందఱకు నొక్కపరి నలువైపుల నిజాము నాక్రమించుట కాజ్ఞ నిడ నుద్యుక్తుఁడై యుండెను. ఇట్లుండ క్రీ. శ. 1726-వ సం॥ములో బాజీరావు మాలవదేశముజయించి స్వదేశమున కరుదెంచెను.* తోడనే సాహూ కర్ణాటయుద్ధాభియానమున కాతని కాజ్ఞ నొసఁగెను. ఆసమయము కర్ణాటయుద్ధాభియానమున కుపయుక్తసమయము కాదు—ఆసంగతి బాజీ

రా వెంతబోధించినను నాసందర్భమందు సాహూకడ శ్రీపతి రాయనియుపదేశబల మతిశయమై యుండినందున నాతఁడాన మయముననే యుద్ధయాత్ర కరుగవలసినవాఁ డయ్యెను. బాజీ రాయని యకుంఠితపరాక్రమమువలన కర్ణాట దేశమునుండి ప్రా ప్యమగుచౌతునర్ దేశముఖిరూపకాదాయము ప్రాప్తమగుటయే కాక, తత్ప్రదేశములో నధికాంశము సాహూయాధీనమయ్యె ను. కాని, యాదేశములోనియస్వాస్థ్యకరములగు జలవాయు వులదోషమువలన మహారాష్ట్రసైనికు లనేకులు రోగగ్రసి తులై మృత్యుముఖమునఁ బడవలసినవారైరి.

---

## ఐదవప్రకరణము.

---

### సైజామునిశ్చయము.

పాదుసాహీసభాంతరములో వజీరాజమ్ 'ప్రధాన మంత్రి' పదమునకయుటయే జన్మసాఫల్యమని తలఁచి యున్న నిజాముల్ ముల్కునకు దక్షిణదేశను బేదారీపదము మొదటినుం డియు తృప్తికరముగుటలేదు. ఆకారణముననుబేదారీపదవిఁబడ సిన పిమ్మటఁ గూడ నాతఁడు వజీరాజమ్పదమును వడయుటకు యత్నమొనరించుటలో విరతుఁడు కాలేదు; కాని యాకాల ములో బాదుషాదర్బారులో సైయదులప్రతిపత్తి విశేషముగ నుండుటవలన నాతనియత్నములు ఫలభరితములు కాకపో యెను.

క్రీ. శ. 1722-వ సం|| రములోఁ గారణాంతరమున నిజాముల్ ముల్కు డిల్లీనగరమున కరుగవలసినవాఁడాయెను. ఆకాలములోఁ బతనోన్ముఖమై శోచనీయావస్థకుఁ బాలగుచున్న పాదుషా సామ్రాజ్యవ్యవస్థావిశేషములఁ బ్రత్యక్షముగఁ బరికించిననిజాము, వజీరాజమ్ పదము గౌరవదాయకమును లాభకారియును గా దని నిశ్చయించి, తనప్రథమనిశ్చయముఁ బరిత్యజించి మరల దక్షిణమున కరుదెంచి స్వతంత్రరాజ్యసంస్థాపన మొనరించు సంకల్పముఁ బూనినవాఁడాయెను.

దక్షిణమున, స్వతంత్రరాజ్యసంస్థాపనానందర్భమునఁ బాదుషావలన విఘ్న మొనగూడు నను భయము నిజాముహృదయమున నిసుమంతయుఁ బొడఁగట్టుట లేదు. కాని మహారాష్ట్ర సామ్రాజ్యమును విస్తరింపఁ జేయుట పేష్వాపదప్రతిష్ఠాపనమునకు సార్థక్య మని నిశ్చయించి ప్రబలయత్న మొనరించుచున్న బాజీరావు నిజాముహృదయమునకు కంటకప్రాయ మగుచుండెను. అట్లని నిజాము విముఖుఁ డగుట లేదు. ఆతఁడు తన సంకల్పము బూర్తియొనరించుకొనుట కనువగుయత్నములఁ బ్రవృత్తుఁ డగుచు మహారాష్ట్రవీరుల కభిప్రాయ భేదములు గల్పించి తదనంతరము డిల్లీశ్వరునకుఁ బ్రతిఘటించి తద్రక్షితమగు ఆశీరగడమును స్వాధీన మొనర్చుకొని, దక్షిణభారతమునకు దాను స్వతంత్రాధిపతి నని నలుగడలఁ బ్రచార మొనరించెను. ఆకాలములో సాహూమంత్రివర్గమందు ప్రతినిధి శ్రీపతిరావు విశేషముగ గౌరవప్రతిపత్తులుగలిగినవాఁడు. ఆతఁడు స్వలాభపరాయణుఁడై నిజాముపక్షమును గుప్తభావముగ గైకొన్నియెను. అయ్యది మునుముందు విస్పష్టము. కారణాంతరమున

బాజీరావు నిజాముమార్గమున కవరోధ మొనఁగలేకపోయినను రెండుమూఁడుసారు లాతనితోఁ బోరాఁడవలసివచ్చెను. ఆపోరాటములలో నైనను సైనికనష్ట మలవఱచెనేకాని, యాతనిసంకల్పమునకువిఘ్న మొనఁగలేదు. అందువలన నాతఁడు తనప్రయత్నమున విముఖుఁడుకాక సైన్యబల మలవఱచుకొనుచు, మొగలాయీశాసితప్రదేశములతోఁ బాటు మహారాష్ట్రశాసితమగు కర్ణాట దేశము గూఁడ నాక్రమించి, మహారాష్ట్రసామ్రాజ్యమునకు బలవద్విరోధియగుట తటస్థమయ్యెను.

అంతట కొంతకాలమునకు నిజాముకుటిలవర్తనము బయలుపడెను. మహారాష్ట్రవీరులు కన్నులఁ దెఱచిరి. ప్రతినిధి శ్రీపతిరావు నిజామునకు విరోధి యయ్యెను. కర్ణాటదేశమును మఱల గ్రహియించు సందర్భమున, మహారాష్ట్రాధిపునిఁ బురికొల్పినందున నాతఁడు బాజీరాయని తన్నియోగమున నియోగించెను. బాజీరావు కర్ణాట దేశోద్ధారణసందర్భమున నిజామును పూర్ణరూపముగఁ బరాజితుఁ గావించెను.

కర్ణాటయుద్ధములో గాఢప్రహారజర్జరీకృతశరీరుఁడైన నిజాముల్ ముల్కు, అప్రతిహతశక్తియోపేతుఁడైన బాజీరాయని యభ్యుదయమునకు విఘ్న మాపాదించినఁ గాని తన మనోరథము కొనసాగనేరదని నిశ్చయించెను.

## నిజాముసంతసము

కర్ణాటయుద్ధమున విజయముఁ బడసినయనంతరము బాజీరావు, గుజరాతు యుత్తరభారతములలో మహారాష్ట్రాధిపత్యమును విస్తరింపఁ జేయుతలఁపుతో సన్నాహ మొనరించుచుండుటఁ గని నిజాము కియత్పరిమాణసంతుష్టహృదయుఁడై

తనలోఁ దాను మురియఁ జొచ్చెను. బాజీరాయనిదృష్టి యుత్తరభారతమువంక మరలినందున స్వబలాభివృద్ధి యొన రించుకొనుట కవకాశ మలవడెననియు, ఈయత్నమున బాజీ రాయునకును బాదుషాకును ఘోరముగు పోరుపొసఁగుననియు నం దుభయపక్షములు బలక్షయములగు ననియు, నందువలన తనకాంక్షితము సఫలతఁ గనుటకు సందియ ముండనేరదని నిజాము కడుంగడు సంతసింపఁ జొచ్చెను. పాదుషాకీర్తిల భము బాజీరాయనిప్రతాపాగ్నిఁ దరికొననేర దనునందియ మప్పు డప్పు డాతనిహృదయమునఁ బొడసూపి తనసంతసము భ్రాంతిమూలకము కాగలదని కొంతవఱకు నిస్పృహఁగలిగించు చుండినను స్వకార్యసాధనమును పరిత్యజింపక బాజీరాయుని బారి నుండి యాత్మరక్షణ మొనర్చుకొనునుపాయముల నన్వే షింపఁ బ్రవృత్తుఁ డగుచుండెను.

### నిజాముకౌశలము.

పాదుషాప్రదత్తస్వత్వ (సనదు) మాధారముగఁ గొని, నిజభుజబలమూలకముగ నిజామురాజ్యములో మహారాష్ట్రాధి పతి, చౌతుసర్ దేశముఖీరూపకాదయముఁ బరిగ్రహించు చుం డెను. ఈయుపలక్ష్యముసఁ బ్రతివత్సరము మహారాష్ట్రవీరుల యాగమనమును, అందువలన ననేకస్థలములయందలి సేనా, దుర్గ, ప్రభృతివ్యవస్థావలోకనమును సంభవించు చుండునాచా రము ప్రాయికమయి యుండెను. ఈయాచారవిలంబనము నైజా మునకు గడునసంతుష్టిఁ గలిగించుచుండినందున నద్దానిఁ దొలఁ గింప నుదినెంచి, సాహూ తనరాజ్యముండి లభించుచౌతుసర్ దేశముఖీరూపకాదాయముఁ బరిత్యజించిన నందులకుఁ బ్రతి

ఫలముగఁ గోటిరూప్యములును, తనశాసనాధీనములోని 'ఇందాపురము'నకు నికటస్థమగు నొకానొకపరగణా నిష్కరజాగీరుగ సమర్పించుటకు నిశ్చయించి, తత్ప్రస్తావమును మహారాష్ట్రాధిపునిసమ్ముఖమునఁ బ్రేరణ మొనరించుటకుఁ దగుసమయ మరయఁ జొచ్చెను. రాజనీతిధురంధరుఁడగు బాజీరా వీప్రస్తావమున కంగీకరింపఁ డనుసందియ మాతనిహృదయముఁ బీడించుచుండుటచే చతురమతియగునిజాము బుద్ధివిచక్షణుఁడగు బాజీరావుకార్యాంతరమున దూరదేశమున కరిగినసమయములో, తనప్రస్తావమును సాహూ సమ్ముఖమున నుపస్థితముఁ గావించి తనప్రస్తావమును సమర్థించిన బరారుప్రదేశమును జాగీరురూపముగ శ్రీపతిరాయున కొసఁగుటకు వాగ్దాన మొసఁగి యాతనిఁ దనపక్ష మొనరించుకొనెను. యవనచాణక్యుఁ డనదగిన నిజామునకును, మహారాష్ట్రప్రతినిధి శ్రీపతిరాయునకును జరిగిన యీయాంతరంగికవాగ్దానవిషయికవ్యాపార మాయిరువురిలోనే యిమిడిన దయ్యెను. లోభగ్రసితుఁడును, లఘుమతియు, విశ్వాసహంతయు, స్వలాభపరాయణుఁడును నగుశ్రీపతిరావు తగుసమయ మరసి నిజాము ప్రస్తావనను సాహూసమ్ముఖమునఁ బ్రవేశపెట్టి, తదంగీకారమువలన మహారాష్ట్రమండలమున కధికలాభ మలవడగలదని సమర్థించి పలికెను. సరళమతియగు సాహు, ప్రతివాదరహితమగు ప్రతినిధి యుపదేశానుసరణిని నిజాము ప్రస్తావ మంగీకరించి తనసమ్మతిఁ బ్రకటించెను.

## రహస్యోచ్ఛేదము.

కర్ణాటయుద్ధములో బాజీరాయనిచేఁ బరాజితుఁ డయిననిజాము, విశ్వాసపాత్రులగు కొందఱిసర్దారులపై తద్దేశనం

రక్షణభారమును నిడి, తాను మహారాష్ట్రదేశోత్తరదిగ్భాగ మాక్రమించునాయోజనమున నందుండి యరుదెంచెను. ఆ కారణమువలన, కర్ణాటమునుండి బయలువెడలి స్వదేశమున కరుదెంచుచున్న బాజీరాయనితో, ఔరంగాబాదునందలినిజాముప్రతినిధి యుద్ధమొనరించుట తటస్థమయ్యెను. ఈయవాంతరయుద్ధము బాజీరాయనిస్వదేశగమనమునకుఁ గొంత వ్యవధిఁ గలుగఁజేసెను. ఈవ్యవధిసమయమే నిజామునకు తనప్రస్తావమును సమర్థింప ననుమయమయ్యెను.

ఔరంగాబాదునందు జరిగినయుద్ధమందు విజయుఁడై బాజీరావు స్వదేశమునకరుదెంచెను. మార్గమధ్యముననే కూటనీతిధురంధరుఁడగు నిజామునకును, సరళహృదయుఁడగు సాహూజీకిని ఘటితమయిన ఘటనాఘటనవ్యవహారవిషయక చరిత్ర మాద్యంతము బాజీరావునకు గోచరమయ్యెను. అందువలన బాజీరావు సాహూసమ్ముఖమున, "మహారాష్ట్రాధిపునివలని భయము నిజాముహృదయమును పీడించుచుండుటచేఁ దద్రక్షణమున కనువగుసాధనసంపత్తి గుప్తరీతి బలపఱుచుచున్న నిజాము తనరహస్యము నేఁటట చౌతుసర్దేశముఖులస్వత్వసంగ్రహణమున కరుదెంచు మహారాష్ట్రనాయకులు కనుఁగొనుట కవకాశ మలవడునని యాతఁడు పూర్ణముగ గ్రహియించియుండినవాఁడగుటవలన నీయప్రస్తుతప్రస్తావనకుఁ బ్రేరకుఁడయ్యెను. ఆతనిమార్గమునకుఁ బ్రథమమం దవరోధమొసఁగమి నాతఁడిపుడు మహారాష్ట్రమండలమునకు బలవద్విరోధి యయ్యెను. అందుల కనుగుణముగ నీప్రస్తావన మంగీకరించిన నిజాము రాజ్యములో మనకుఁ గలప్రతిపత్తి విధ్వంసమగుటయే కాక

స్వరాజ్యస్వాతంత్ర్యమునకు భంగ మొనఁగూడు" ననుతన ప్రతి వాదము నుపపాదించెను. సాహూ బాజీరాయనివాదనుం దలి సారముఁ జక్కఁగ గ్రహియించి పూర్వప్రకటితాంగీకారము తనకిపు డసమ్మతముగఁ దోఁచెనని నిజామునకుఁ దెలియఁ బజిచెను. అంతట, శ్రీపతిరావు నిజాములకు జరిగినబరారు విషయకరహస్యవ్యాపారము తనంతటనే బయలువెడలెను. మహారాష్ట్రపతికి శ్రీపతిరాయనియెడ నసంతోషము నాగ్రహము నుదితమయ్యెను. శ్రీపతిరాయునకు తనపురోభివృద్ధికి విఘ్న మొనఁగిన బాజీరాయనియెడ మత్సర మధికమయ్యెను. ఇదియే పేష్వాయెడ ప్రతినిధికిఁ గల వికటబద్ధవైరమునకు మూలకారణము.

## నిజాముకుటిలవర్తనము.

నిజాము, తనపన్నినమాయాజాలము విచ్ఛిన్నమయిన పిమ్మట నాతఁడు కొల్హాపురాధిపతియగు శంభాజీపక్షము గ్రహించి మహారాష్ట్రమండలములో గృహవివాద ముదయింపఁజేసి వృద్ధి యొనరింపఁజొచ్చెను

సంవత్సరాంతమున సాహూకర్మచారగణము నిజాము రాజ్యములో చౌతుసర్‌దేశముఖులస్వత్వసంగ్రహణమున కుపస్థితముకాఁగా, "మహారాష్ట్రసామ్రాజ్యమునకు నారాజ్యము నుండి ప్రాప్తముగానున్న చౌతునర్‌దేశముఖీరూపకాదాయము గ్రహించుట కధికారము నాకుఁగలదని సాహూశంభాజీ లిరువురు వివాదమూని తదాదాయమును తమ కొసంగవలసినదని నన్ను ప్రార్థించుచుండిరి. అందువలన నీయిరువురిలో మహారాష్ట్రరాజ్యమునకుఁ బ్రకృతాధిపతి యెవరో విస్పష్ట మగునంతద

నుక చౌతుసర్ దేశముఖులనేరికిని నొసంగజాలను" అని యొక
విచిత్రహేతువాదము నుత్థాపన మొనర్చి నిజాము, సాహూ
కర్మచారగణమును స్వరాజ్యమునుండి విత్రాడన మొనరించెను.
నిజా ముపపాదించిన యీవికటహేతువాదము బాజీరాయున
కుఁ బ్రథమముననే పరిజ్ఞాతమై యుండెను. అందువలన నాతఁ
డవలంబించిన యీయకాట్య హేతువాదమునకుఁ బ్రత్యుత్తర
ముగ "డిల్లీశ్వరుఁడొసంగినయధికారపత్రము 'సనదు' ఎవరిపేరున
ప్రవర్తితమై యుండెనో వారికి చౌతుసర్ దేశముఖుల సమర్పిం
చుట నిజామునకు నిహితకర్తవ్యము. అందులకు వ్యతిరిక్తము
గఁ బ్రవర్తించిన నాతఁడు దండనార్హుఁడగు. మహారాష్ట్రసా
మ్రాజ్యాధికారనిర్ణయమున కాతఁ డెవఁడో మునుముందు నిజా
ము తెలియపఱుపవలసియున్నది." యని పేష్వ వర్తమాన
మంపెను.

సతారా కొల్లాపురాధిపతులనడుమ వివాదదావానల
ముఁ బ్రజ్వలింపఁజేసి యిరువురను యుద్ధరంగమునకు ద్రోచి
యిరువురను క్షీణసత్త్వులఁ జేయనెంచుటయే నిజాముయొక్క
యీవితండవాదమునకు మూలకారణమని బాజీరావు సహే
తుకముగ సాహూనరపతికి నుపదేశ మొనరించెను. అంతట
నిజాముయొక్క గర్హితరాజనీతికౌశలమును పూర్ణముగ గ్రహి
యించి యాతనిఁ గరాళకృపాణధారకు గుఱియొనర్చ చౌతు
సర్ దేశముఖులసంగ్రహించుటకుసతారాధిపతియగు సాహూ,
బాజీరాయున కాజ్ఞ నొసఁగెను. సాహూయాజ్ఞానుసరణముగఁ
బాజీరావు క్రీ. శ. 1727-వ సం॥ రము సెప్టెంబరు నెలలో నిజా
ముతో యుద్ధ మొనరింప బయలువెడలెను.

నిజాము కొల్లాపురాధిపతియగు శంభాజీపక్షము గ్రహించియున్నవాఁడు. బాజీరావు, తన్ను శిక్షింప నరుదెంచుచున్నవాఁ డని వినినంతనే యాతఁడు కొల్లాపురాధిపతికిఁ గోపనీయముగ నాకాళకుసుమమును హస్తమున నిడి, యాతనిని స్వీయసేనాదళమున కగ్రభాగమునఁ బ్రస్థితునిఁ గావించి ఔరంగాబాదువద్ద బాజీరాయనిఁ దలపడుటకు సర్వసన్నద్ధుఁ డయ్యె.

### బాజీరాయనిపరాక్రమము.

ఔరంగాబాదువద్ద నిజాముబాజీరావులకుఁ బోరు ఘోర మయ్యెను. ఆపోరునందు బాజీరావు తనయసాధారణ రణపాండిత్యమును పూర్ణరూపముగఁ గనఁబఱచి నిజామును తత్పక్షావలంబుల జర్జరితులఁ గావించెను.

బాజీరావు సింహకిశోరంబుభాతి నిజాముఁ దలపడి ప్రప్రథమమున తచ్ఛాసనాధీనమగు 'జాల్నా'ప్రదేశమాక్రమించి, యందలి మొగలదళమును విదళన మొనర్చి తదైశ్వర్యము జూఱఁగొన నారంభించెను. అంతట 'ఇవాజ్ ఖాను'అను వేఱొక నిజాము సేనాపతి బాజీరాయనిమార్గమున కవరోధ మొనరింప నగ్రేసరుఁడయ్యెను బాజీరా వివాజ్ ఖానుతో కొండొకకాలము యుద్ధమొనరించి, పిమ్మట మాహూరునగరమున కరుగువానివలె కొంతద వ్వరిగి, శత్రుదళమును బంధురభ్రమాంధకారమున నిమగ్నమొనర్చి, వెనుదిఱిగి ఔరంగాబాదు నొక్కపరి నలువైపుల ముట్టడించి నిజామును కలగుండువఱచెను. అనంతరము వీక్షించి బుడాన్ పురము, ఖాం దేశములలోఁ బ్రవేశించె. ఈయనర్థమును వీక్షించి బుడాన్ పుర రక్షణోద్యోగియై

నిజాము సమగ్రసైన్యమును వెంటఁగొని యావంక కరిగెను. బుడాన్‌పురయుద్ధరంగము ననేకతృతమయిననిజాము బాజీరావును పరికించి స్వల్పసంఖ్యాకులగు సైనికులనందుఁ బోరొనర్ప నియోగించి తాను కొంతసైన్యముఁ దోడ్కొని చని గుజరాతుదేశములోఁ బ్రవేశించి యందలిసూబేదారుఁడగు 'సర్‌బులందుఖాను'ని బరాజయమొనర్చి, యందలి సర్వస్వముఁ దోచుకొని, యాదేశము ధనకనకరత్నవిహీన మొనర్చెను

## నిజాము పంజరబద్ధుఁడగుట.

బాజీరాయనిరాక కపేక్షించి, నిజాము బుడాన్‌పురములోఁ గొంతకాలము వ్యర్థముగ వ్యతీత మొనరించినపిమ్మట నాతనికి బాజీరాయని గుజరాతుదేశాక్రమణమును, సర్‌బులందుఖానునిపరాజయమును మొదలుగాఁగలసమాచార మాద్యంతము కర్ణగోచరమయ్యెను. బాజీరాయనికరగతుఁడై యీవిధముగ ప్రతారితుఁడైన నిజాముల్‌ముల్కు క్రోధోద్ధృత మానసుఁడై, పూనానగరమును భస్మమొనరించునుద్దేశమూని దక్షిణమున కరుగనెంచి సేనాసహితముగ బయలుదేరెను.నిజాము దక్షిణమున కరుగుచున్నవాఁడనుసమాచారము వినినంతనె బాజీరావు గుజరాతునుండి బయలువెడలి మధ్యమార్గమున మొగలాయీశాసితప్రదేశములను కొన్నిటిఁ దోఁచుకొనుచు, కొన్నిటి భస్మీభూతము కావించుచు, వాయువేగమున నరుదెంచి యహమదునగరసమీపమున నిజాముసైన్యపృష్ఠభాగ మాక్రమించి యద్దాని వెన్నంటి చనఁ జొచ్చెను. స్వసైన్యపృష్ఠోపరిభాగ మాక్రమించి సమాగతుఁ డగుచున్న బాజీరాయని వీక్షించి నిజాము పూనాయాత్రాపరిత్యాగియై

వెనుదిఱిగి యాతనితో యుద్ధమొనరింపవలసినవాఁ డయ్యెను. చతురమతియగు నిజాము, రణపండితుఁడగు బాజీరాయనితో వివిధములగు ఖండయుద్ధముల నొనర్చుచు వెనుకంజయిడి క్రమక్రమముగ నేఁగియేఁగి తుదకు గోదావరీతీరవర్తియగు బాలఖేడానామక గ్రామసమీపమందలి మహారణ్యము నాశ్రయముగఁ గొని యం దుపస్థితుఁ డయ్యెను. ఇంతవఱకుఁ దనకు సంభవింపనున్న విపత్పరంపరను నిజాము గుర్తించుట లేదు. నిజాము సైన్యయుతముగ నాశ్రయముగఁ గొనిన సఘనవృక్షాచ్ఛాదితమహారణ్యమును విదగ్ధ మొనరించి యాశ్రయహీన మొనరించి, బాజీరా వతని సైన్యయుతముగ నవరుద్ధునిఁ గావించెను. అంతట నిజాము తనకు సంభవించినదురవస్థఁ బూర్ణముగ గ్రహించి బాజీరాయనితో ప్రాణపణముగఁ బోరాడుటకుఁ గడంగెను. నిజాము ఫిరంగులగమి మహారాష్ట్రఫిరంగుల నతిశయించి యుండినందున నీయుద్ధమందు బాజీరాయనిసైనికులు విశేషముగ మడిసిరి. అయినను బాజీరావు విచలితహృదయుఁడై రణరంగమును వీడక ముట్టడిని వదలక నికటస్థములగు పురనగరగ్రామములనుండి నిజాముసైన్యమున కలవడుచున్న ఖాద్యవస్త్రశస్త్రాదికసహాయ మలవడనీక యుద్ధోపకరణసంగ్రహమున కవకాశ మొసఁగక నిజాముసైన్యమును నురుమాడఁ జొచ్చెను. ఇందువలన నిజాము మఱింతదుర్దశకుఁ బాల్పడి విగతధైర్యుఁ డయ్యెను.

### నిజామున కలవడినదుర్దశ.

ఈమహాసంగ్రామమునకు శంభాజీ, సేనాపతిచంద్రసేన యాదవుఁడు, రావురంభానింబాల్కరుప్రభృతి పెక్కండ్రు

మహారాష్ట్రవీరులు సేనాసహితముగ నరుదెంచి నిజామునకు
బాసటయై తత్సైన్యమును ద్విగుణ మొనరించిరి. ఈమహారా
ష్ట్రవీరులసాహాయ్యమున బాజీరాయని బరాజయ మొనరింప
నగునని నిజాము కడు సంతసించుచు, బాజీరాయనిఁ దలపడ
శంభాజీని పురిగొల్పెను. ఈసందర్భమున నిజాము సేనానుల
కును మహారాష్ట్రనాయకులకును నడుమ మనోవైకల్యదమయి
నందున వారలు వాదప్రతివాదములకు డీకొనిరి. ఈవాదప్రతి
వాదములలో మరల నాయకులమతములు భేదిలినందున నిజా
ముసైన్యమం దంతట కలవర ముదయించెను. అంతఁ జంద్ర
సేనయాదవు ముందంజ వైచి "నాయాధీనములోని మహారా
ష్ట్రసైనికులసంఖ్యకంటె మొగలాయీసైనికులసంఖ్య ద్విగు
ణమై యుండినను మహారాష్ట్రసైనికులవలె రణకుశలులును
కష్టసహిష్ణులును కారు. అందువలన నీసైనికుల వెంటఁ గొని
రణకర్కశుఁడగు బాజీరాయనిఁ దలఁపడ నోప"నని నిజాముతో
ననియెను. చంద్రసేనయాదవునిపలుకులను వినినంతనె, శంభా
జీ, "నాయాధీనములోనిసైన్య మతిస్వల్పము. అందుఁ
జెక్కండ్రునాయకులు రహస్యముగ బాజీరాయనిపక్షము
గ్రహియించి రనుసందియము నామనమున నంకురించుచున్న
యది అయినను, ఈయుద్ధాంతమందు నాభాగమునకు లభిం
పనున్నద్రవ్యమును నాహస్తమం దిడుదు నని నిజాము వాగ్దా
న మొనరించిన నేను బాజీరాయనిఁ దలపడుట కరుగ సిద్ధముగ
నున్నవాఁడను"అని తనమతమును ప్రకటించెను. శంభాజీప్రక
టనమును వినినంతనె, యాతనిసేనానులు "శంభాజీహస్తమున
ద్రవ్యమిడినచో, నాతఁ డద్దానిని విలాసములయందును వ్యస

నములయందును వ్యయపఱచును. అందువలన సైనికు లన్న వస్త్రములకు దూరులై వెతలఁ గుడువవలసివచ్చును. ఈ సందర్భమున నిజాము చక్కఁగ గమనింపనియెడ సైనికులు విద్రోహాఘోషణమునకు నమకట్టుదురు." అని పలుకఁజొచ్చిరి మహారాష్ట్రవీరులనోట వెలువడుచున్న హాస్యోపవాక్యముల నాలించి నిజాము చింతాకులచిత్తుఁడై, "మీరందఱు వీరమహారాష్ట్రవంశములలో జన్మించినవారలు. బాజీరావు కూడ మీవలె మహారాష్ట్రకులసంభూతుఁడైనవాఁడు. అంటు నను మీవంశములో జననమందినబాజీరాయని బలదర్పములను సమరకౌశలమును గుర్తెఱుంగ నన్ను విపదంబుధిఁ బడఁద్రోచితిరి మీరలు నిక్కట్టులపాలయితిరి. మిమ్ములను నమ్మి మీపై కార్యభారము వైచి, కుడిచికూర్చుండక, ఉన్నదానితో తృప్తినొందక న్యాయకారణవైరమునకుఁ గాలుఁ ద్రవ్వితిని. అందులకు ప్రతిఫలముగ నీదుస్థితికిఁ బాలయితిని. ఈవిపత్కాలములో నీవిధముగ వృథావాగ్వివాదములకుఁ బూని కాలయాపనమొనర్చుచు కర్తవ్యవిముఖులమైనచో మనగతి యేమి కానున్నదో యించుక విచారింపుఁడు. ఖాద్యద్రవ్య మభావమయినందున, మహాసమున కెనయగు చతురంగసేనానివహము దినదినము క్షీణింప మొదలిడినది. ఇందులకుతోడు బాజీరాయనిఫిరంగులు వజ్రతుల్యములగు ప్రజ్వలిత గోళములను సంతతధారావృష్టిగ వర్షించుచు శిబిరమును శ్మశానవాటికగఁ జేయుచుండెను. ఈసమయమున మీ రందఱేకనుతావలంబులై న్యాయాసన్నవిపదంబుధిఁ దరియించునుపాయ మరసి నన్నుద్ధరించు భారము గ్రహియించుట ప్రస్తుతకర్తవ్యకార్యము"

అని తనవ్యాకులము సేనానాయకుల సమ్ముఖమున వెడలఁ గ్రక్కెను.

పతనోన్ముఖమై ప్రతిక్షణమును బతనశాప్రాప్తి నందుచున్న నిజసేనానివహముఁ గని చింతిలుచు రక్షణోపాయముఁ గానక నిజాముల్ముల్కు బాజీరాయనితో సంధి యొనర్చుకొనుట కొడఁబడి, వినయవినమితప్రార్థనాపూరితపత్రమును బాజీరాయనికడ కనుపుటయే కాక, అనశనక్లిష్టనిజానుచర రక్షణార్థము ఖాద్యద్రవ్యములకొఱ కాతని వేడుకొనియెను.

### బాజీరాయనిహృదయధర్మము.

ఈసమయమున బాజీరాయని సేనానాయకులలో పెక్కండ్రు క్రోధోద్దీపితులై నిజామును సంపూర్ణముగ ధ్వంస మొనరింప మదినెంచి, యట్లొనర్చుట కాజ్ఞ నిడవలసినదని బాజీరాయని ననురోధపూర్వకముగ వేడుకొనిరి. అట్లొనర్చుట తన కసమ్మతమని ప్రకటించుచు, వీరవర్యుఁడగు బాజీరావు, "విపన్నులును, ఆశ్రయప్రార్థితులును, శరణాగతులును నగువా రెంతటి శత్రువైనను వారిని ప్రహరించుటయుఁ బీడించుటయు బరిహరించుటయు వీరధర్మమునకు విరుద్ధము. అందువలన వీతబలుఁడును, శరణాగతుఁడును, అనశనపీడితుఁడును నగునిజామునకు ఖాద్యపదార్థముల నొసఁగియాతనిప్రార్థనానుగుణముగ నాతనితో సంధి కొడఁబడుట మనకు కర్తవ్యము శ్రేయస్కరము." అని సేనానులకు బదులొసఁగి వారికోప ముపశమింపఁజేసెను.

### సంధినియమములు.

అనంతరమిరువంకలయధికారులసమ్మతిచొప్పుననిజాము,

1. కొల్హాపురాధిపతిపక్షముఁ బరిత్యజించుటయు,

2. స్వరాజ్యములో చౌతుసర్ దేశముఖులస్వత్వసంగ్రహణమునకు ప్రతివత్సర మరుదెంచి మహారాష్ట్రకర్మచారుల రక్షణార్థము స్వరాజ్యములోని కతిపయదుర్గములను, రక్షకస్థానములను మహారాష్ట్రాధిపునకు సమర్పించుటయు,

3. గతవత్సరములలో చెల్లవలసియున్నచౌతుసర్ దేశముఖసంక్రాంతసమస్తప్రాప్యద్రవ్యమును సమగ్రముగ వినావిలంబముగ నొసంగుటయు,

4. వర్తమానయుద్ధమునకై నవ్యయమునకై కోటిముద్రలు సమర్పించుటయు

ననునియమముల ననుసరించి బాజీరావుమూలముగ మహారాష్ట్రాధిపునితో సంధి యొనర్చుకొనెను..

### బాజీరాయనిసాహసము.

సంధివ్యవస్థ స్థిరముయినయనంతరము వీరకులశిరోమణి యగు పేష్వా బాజీరాయుని యభ్యర్థన మొనర్చుటకై నిజామాతనిఁ దనశిబిరమున కరుదేర నాహ్వానించెను. అసాధారణసాహససంపన్నుఁడగు బాజీరావు తదాహ్వానముచొప్పున నిద్దఱుముగ్గురు సాధారణానుచరులవెంట నిడుకొని బలవద్విరోధియగు నిజాముల్ముల్కుశిబిరమున కేగి యాతఁ డొసఁగిన యభ్యర్థనమును గ్రహియించెను. అంత నింతకుఁబూర్వమే నిజాము నియుక్తముగ గుప్తముగ నొదిగియున్న మొగలాయీవీరులు పెక్కండ్రాతనిసాంకేతికానుసరణిఁ బిరబిరఁ జనుదెంచి యొరలనుండి సునిశితకరవాలముల నూడఁబెరికికరముల ధరించి జళిపించుచు బాజీరాయని పైకొని. యాతనిశిరమును ఖండింప నమకట్టిరి. అంత నిజాము బాజీరాయునిదిక్కు మొగమై,

“వీరాగ్రణీ! ఈవీరులు నీప్రాణములఁ బొరిగొనకుండ విడుచు
వారు కారు. ఈసమయమున నీ ప్రియమిత్రులగు వీరసర్దారులు
సేంధియాహోల్కారు లెందడఁగియున్నవారలు? వీరిబారినుండి
నిన్ను రక్షించువార లిందేరు గలరు?” అని సపరిహాసముగఁ
బలుకఁ జొచ్చెను. మొగలసైనికులయాక్రమణమును గనియు
నిజామునోటినుండి వెలువడినసపరిహాసవాక్యములను వినియు,
రక్తారుణితనేత్రుఁడై బాజీరావు తత్క్షణమున నిజకరవాల
మును నొరనుండి పెరికి జళిపించుచు, “ఎంతవఱ కీకరవాలము
నాకరమునఁ బ్రస్థితమై యుండునో అంతవఱకు నిట్టివీరులు
లక్షలకొలంది చుట్టుముట్టి వ్యూహము పన్ని నిలిచినను, నిర్ల
క్ష్యముగ నావ్యూహమును ఛేదించి యాత్మరక్షణ మొనర్చు
కొనుసామర్థ్యము నాకడ నుండియుండ, సేంధియాహోల్కారు
లెందుండిన నేమి? అయినను నీయొనర్చిన యీవిశ్వాసఘాతుక
మును వా రింతకుఁ బూర్వమే కనియున్నవారు. వారీక్షణమున
నీప్రాణములఁ బొరిగొన నిం దరు దేరఁ గలరు” అని ప్రత్యుత్తర
మొసఁగుచు నిజామునిమీఁది కురికెను. ఆసమయముననే, సామా
న్యభృత్యవేషమున నొప్పియున్నరాణోజీహోల్హారు లిరువురుఁ
గటితటవిలంబితకృపాణముల నొరలనుండి పెఱికి కరములధరిం
చి బాజీరాయునకు బాసటలై నిలిచిరి. బాజీరాయనిభీషణా
కారమును అసాధారణసాహసమును, వీరపూరితసరళవక్తృత్వ
మును గని విని విగతధైర్యుఁడును, విస్మితహృదయుండును నై
నిజాముల్ముల్కు “ఇస్ముల్కుమేం ఏక్ బాజీ! ఔర్ సబ్ ఫా
జీ!” ఈభూమండలములో వీరుఁ డనిన బాజీరావే వీరుఁడు. మిగి
లినవీరులు వీరశబ్దమును చెఱుచునధములు. భీరులు. అని

ప్రొవ్వునఁ గేల వైచి బాజీరాయనిపదముల స్పృశించి ముద్దిడి లేచి నిలిచి తనయకృత్యమును మన్నించి క్షమింప వేఁడు కొనెను

---

## ఆఱవప్రకరణము.

---

### ఛత్రసాలునిప్రార్థనము.

పాలఖేడాయుద్ధములో నిజామును జయించి యాతని సంధిబద్ధునిఁ గావించి క్రీ. శ. 1728-వ సం॥ రము జూలయి మాసములో బాజీరావుసితారానగరమునకరుదెంచెను. అంతట వర్షాకాల మాసన్నమయినందున యుద్ధాభియానముల తలంపు దూర మొనర్చి యాతఁడాంతరంగికరాజ్యవ్యవస్థఁబరిశీలించుచు వర్షాకాలమంతయు నందుఁ గడపెను. శరత్కాల మరుదెంచినం తనే యాతఁడు విజయదశమినాఁటి విజయముహూర్తమం దుత్తరభారతవిజయమునకు బయలుదేఱెను.

ఉత్తరభారతాంతర్గతమగు బుందేలుఖండురాజ్యాధిపతి యగు ఛత్రసాలుఁడు, ముసల్మానాక్రమణమువలన విపన్నుఁడై, ఉత్తరదిగ్విజయమున కరుగుచున్నబాజీరాయని, సహాయార్థ మరుదేర వేఁడుకొనెను.

### బుందేలుఖండరాజ్యము.

బుందేలుఖండ మను ప్రదేశ ముత్తరభారతాంతర్గతము. అద్ద్యది మొగలాయీశాసనాధీనము. శివాజీమిత్త్రుఁడగు ఛత్ర

సాలుఁడను నొకక్షత్రియవీరుఁ డాతనిప్రేరణమున నాప్రదేశ మండలిమొగలశాసనము నున్మూలింప కంకణము కట్టికొనెను. శివాజీయుపదేశసాహాయ్యములవలన ఛత్రసాలుఁడు తనయుద్యమమున కృతకృత్యుఁడై బుందేలుఖండమును మొగలశాసనాధీనమునుండి వెలివఱిచి నిజాధికారమునకు లోఁగొనెను.

అదృష్టహీనతను బుందేలుఖండశాసనాధికారమునకు దూరులైన మొగలాయీసర్దారులు చిరభుక్తమయిన యీదేశమండలి యాశ విడఁజాలక పలుసారులు ఛత్రసాలుని నాక్రమించి విఫలమనోరథులైరి.

## మహమ్మదుఖాన్ వంగాశ్.

ఈతఁడు రోహిలావంశమున జన్మించినయొకవీరసర్దారుఁడు. మాలవదేశసూబేదారుఁడు. ఫరుక్కాబాదునగరనిర్మాణకుఁడు. ఈతఁడు ప్రథమమున అలహాబాదుసుబాకుసూబేదారుగ నుండినవాఁడు. బుందేలుఖండపునరుద్ధారణమున విఫలమనోరథులైన మొగలాయీసర్దారులప్రార్థనానుగుణముగ నీతఁడు విపులసేనాసహితముగ నరుదెంచి 1728-వ సం॥ లో బుందేలుఖండ మాక్రమించెను రాజాఛత్రసాలుఁ డీతని నిరువదివేలయశ్వసైనికులతో నెదిరించి యమితనష్టమునకుఁ బాత్రుఁ డయ్యెను. బుందేలుఖండమునకు సమీపమున నున్నహిందూరాజులు, జమీందారులు మహమ్మదుఖాన్ వంగాశ్ పక్షము గ్రహించి యాతనికి సహాయ మొసంగుచుండుటవలనను, ఆత్మజులు దూరగతులగుటవలనను తనకు వృద్ధాప్యము పైఁబడుటవలనను ఛత్రసాలుఁ డీబలవద్విరోధియాక్రమణమును నిరోధింప నసమర్థుఁడయ్యె. అందువలన వంగాశుసైనికులు బుందేలుఖండము

దోఁచుకొని నైశ్వర్యహీనముగ జేయ మొదలిడిరి. అంతట ఛత్రసాలుఁడు స్వరాజ్యరక్షణోపాయాంతరముఁ గానక హిందువుల కేకమాత్రాపదోద్ధరకాప్తబంధుఁడై రాజిలుచున్న పేష్వా బాజీరాయని, నీప్రస్తుతవిపత్పయోధి పార మొందించి రక్షింపు మని ప్రార్థించుచు నాతనికడ కొక *కరుణాపూరితపద్యాత్మకపత్రమును లిఖించి పంపెను. ఛత్రసాలుఁడు వీరుఁడని పేరు వడయుటయే కాక పండితకవియని కూడఁ బేరు వడసినవాఁడు. ఛత్రసాలుని కరుణాపూరిత ప్రార్థనాపత్రమును సాదరముగ గ్రహించి పఠించినంత నందలి కవిత్వపటుత్వము కాతరతాపూరితవాగ్జాలము బాజీరాయనిహృదయమున మోద ఖేదము లొక్కుమ్మడి నలముకొని దయారస ముప్పతిల్లఁ జేసెను. తోడనే యాతఁడు యవనకరాళదంష్ట్రా ప్రపీడితబుందేలుఖండహిందూ సామ్రాజ్యోద్ధారణమునకు బద్ధకంకణుఁడై, సాహూయనుమతిఁ గైకొని వినావిలంబముగ పదునిద్దరవీరసేనానులను నిరువదివేల సైనికులను వెంటఁగొని మహమ్మదుఖానువంగాశునకు విరుద్ధముగ యుద్ధమొనరింపనరిగెను.

---

*ఈపత్రము హిందీభాషాత్మకమై 100 దోహావృత్తములు గలిగి యున్నదని యొకజనశ్రుతి కలదు. అం దొకదోహామాత్రము లభించినది కాని పూర్ణముగ లభించుట లేదు.

దోహా. జోగతి గ్రాహ్ గజేంద్రకీ, సోగతి మేరీ ఆజ్,
బాజీ జాత్ బుందేల్‌కీ, రాఖో బాజీ! లాజ్!.

మకరిచే గ్రసితుఁడైన గజరాజు వీతబలుఁడై యాపన్నివారణుఁడగు మధుసూదనుని నేవిధముగఁ బ్రార్థించెనో, యావిధముగ మహమ్మదుఖాన్‌రూపకక్రూరగ్రాహగ్రసితమతంగరూపుఁ డనగ నేను విపన్నుఁడనై మధుసూదనరూపుఁడవగు నిన్ను ప్రార్థించుచున్నాఁడను.

### సంగ్రామనిపుణత.

ఛత్రసాలుఁడు పుత్త్రమిత్త్రకళత్రబంధుబాంధవామాత్య వర్గముతోఁ జేతపురదుర్గమున మహమ్మదుఖాను వంగాషుచే నవరుద్ధుఁడయి పెక్కుయిక్కట్టులఁ గుడుచుచున్నవాఁ డను వార్త విని యాతనికి సాయ మొనంగ బాజీరావు సేనాసహితముగ నాప్రాంతమున కరిగెను. క్రీ. శ. 1729 మార్చి నే 22 దీని వంగాషుబాజీరావులకు రణసంఘర్షణము ఘటిత మయ్యెను. ప్రథమమున బాజీరావు తనసైన్యము ఖండఖండములుగ విభజించి, యొక్కొక్కఖండ మొక్కొకసేనానాయకుని యాధీనమున నిడి, యొకరొకరుగ వంగాషునిఁ దలపడ నాదేశ మొసఁగెను. స్థానపరిత్యాగ మొనరింప నెంచి బాజీరా వీపన్నుగడఁ బన్నినవాఁడని వంగాషు గుర్తెఱుంగక, యీాతఁడు ద్రదళములతోడిపోరులందు విజయములు వడయుచు తనస్థానముఁ బరిత్యజించి బాజీరాయున కెదు రయ్యెను. అంత మహారాష్ట్ర ఖండదళము లేకత్రితమై వంగాషుని నలువంకల నాక్రమించి, తత్సైన్యమును కరాళకరవాలధార కాహుతి యొనర్పఁదొడఁగెను. ఈచతురరణపద్ధతివలన మహారాష్ట్రులు యువనసేనావాహిని నశ్రమముగఁ దరియించి విధ్వస్త మొనరించిరి. ఈపోరునందు మహమ్మదుఖానువంగాశ్ సహస్రసంఖ్యాకులగు సైనికులఁ గోల్పడి, యీావిపద్దశ స్థానపరిత్యాగమువలన నలవడినదని గ్రహియించి, మిగుల ఖిన్నుఁడై సాయంకాలమున రణవిరతుఁ డయ్యెను. ఆతఁడు రెండుమూఁడుదినములు విచారవితర్కముల మునిఁగి తే 25 దీని ప్రచండవిక్రమమున మహారాష్ట్రసైన్యముఁ దలపడియెను. రణకోవిదుఁడగు బాజీరావు

శత్రుసంహారణ మొనర్చుచు క్రమక్రమముగ వెనుకంజ నిడుచు నేగియేగి, యొకానొక కొండచరియను రక్షకస్థానముగఁ జేకొని యందు నిలిచెను. వంగాశుఁ డాదినమంతయు నాచరియపొంత వేచి నిశాసమయమున నాతనిఁ దలఁపడు తలఁపుఁ గొని యత్న మొనరింపసాగెను. వంగాశుఁ డొనరించు యత్నములవలన బాజీరా వాతనితలంపు గ్రహియించి యంధకారము వ్యాపృతమయినంతనే, తానే మునుముందు చరియ వీడి వాయువేగమునఁ జని యవనసైన్యము నాక్రమించెను. యవనసైనికు లానిశాసమయమున బాజీరాయని దలపడుయత్నముల బలిసియున్నవారైనందున నప్రమత్తులై మహారాష్ట్ర సైన్యము నగ్నిగోళముల ముంప నారంభించిరి. బాజీరావు తనయసాధారణపాండితివలన నానిశాయుద్ధమున సైనికనష్టమునకుఁ బాత్రుఁడు కాకుండ వెనుకకు మరలెను. వంగాశత్యంతపరిశ్రమమువలనను ననేకదుర్గ్మదరణవీరుల వినాశనసాహాయ్యమువలనను మహారాష్ట్రులగుల్మములఁ గొన్నిటిని ఒంటెలఁ గొన్నిటిని వశమొనర్చుకొనెను.

### బాజీరాయని విక్రమము.

మరుచటిదిన ముదయమున నిరుబలములు రణరంగమునఁ దాండవమాడఁ జొచ్చెను. తీక్ష్ణప్రతిభామండితుఁ డగు బాజీరా వీవల యుద్ధ మొనరించుచు, నావల వంగాశున కలవడు ఖాద్యపదార్థములును, అస్త్రశస్త్రాదియుద్ధోపయోగపదార్థములును నరికట్టుటకై యొకసేనానాయకుని నియోగించెను. రాత్రియైనంతనె మూఁడుప్రక్కల శత్రుదళము నరికట్టుటకు మతికొందఱిసేనానాయకుల కాజ్ఞ నొసగెను. ఈసేనానుల

యుద్యమమువలనను, బాజీరాయనివిక్రమమువలనను మహమ్మ
దుఖాను వంగాశు కొలఁదిదినములలోనే సంపూర్ణముగ సేనాస
హితముగ మహారాష్ట్రసైనికపంజరమున ననరుద్ధుఁ డయ్యెను.
అస్త్రశస్త్రాదియుద్ధోపకరణములును ఖాద్యపేయాదిభోజనపదా
ర్థములు నలవడుట దుర్ఘట మయ్యెను. శిబిరములోనిపదార్థ
ములు పూర్ణముగ ముగిసినందున సైనికులు క్షుత్పీడితులై
గుఱ్ఱములు, ఒంటెలు మొదలుగాఁ గలజంతుసమూహమును
సంహరించి భక్షింపఁదొడఁగిరి. ఈయవరోధకాలములో వం
గాశునిశిబిరములో పదిరూప్యములొసంగిన నొక సేరుగోధు
మలు లభించుట దుర్ఘట మయ్యెను. బుందేలుఖండదోపిడిలో
విపులధనము మహమ్మదుఖాను వంగాశునకుఁ బ్రాప్తమయియుం
డెను. అతఁ డాధనమును విచ్చలవిడి వ్యయ మొనర్చుచు అభి
మానధనమును వీడనొల్లక రెండుమాసములవఱకుఁ బరా
జయమును స్వీకరింపక పోరొనర్చెను. ఈరెండుమాసముల
దీర్ఘయుద్ధములో నలవడిన సైనికనష్టమునకు మేర లేదు. తుద
కాతని యభిమానము దురభిమానమై భీషణానర్థకఫలముల
గుడిపింపఁజొచ్చెను.

### వంగాశుని పరాజయము.

మహమ్మదుఖాన్ వంగాశ్ మహారాష్ట్రసేనాసముద్రమున
నిమగ్నుఁడై విపత్పరంపరఁ గుడిచికుడిచి దరిగానక తుదకుఁ
బరాజయమును స్వీకరింప మదినెంచెను. ఆసమయమున నాతని
కొమరుఁడు కాయమ్‌ఖాను అనునతఁడు మూడువేలసైనికుల
వెంటనిడుకొని యాతనిసహాయమునకై జేతపురదుర్గసమీప
మున కరుదెంచెను. ఆవార్త విని నంతనే బాజీరా వాతని నెది

రించుట కెదురేగెను. క్రీ.శ. 1729-వ సం॥ రం ఏప్రెల్ 29-వ తేదిని బాజీరావునకును గాయమ్‌ఖానునకును ఘోరసంగ్రామము ఘటిత మయ్యెను. క్రోధితమహారాష్ట్రవీరసైనికకరగత కరవాలవిద్యుల్లతికాసమూహ ముత్తుంగశృంగవిచ్యుతవర్షాకాలవారిప్రతాపప్రవాహము ననుకరించి శత్రుసైన్యముపైఁ బడి కాయమ్‌ఖానుని సేనాపతులను గకావిక లొనర్చి రణరంగమును వీడి పరుగిడఁజేసెను. సేనానులు ప్రాణరక్షణాతురులై పరుగిడినంతనె తత్సైనికులు చెల్లాచెదరై నలువంకలఁ బాఱఁ దొడఁగిరి. అంతట కాయమ్‌ఖానుఁడు వేఱుశరణము గానక తనసైనికులమార్గ మనుసరించెను. అనతికాలమున రణప్రాంగణము శత్రుశూన్య మయ్యెను. ఈసమరములో పదుమూఁడు రణదిగ్గజములును, మూఁడువేలనుశిక్షితోత్తమాజానేయంబులును ఆరుబంటెలును అసంఖ్యాకములగు తుపాకులు, ఖడ్గములు మొదలుగాఁ గలయుద్ధోపకరణములును విజేతయగు బాజీరాయనివశ మయ్యెను.

వంగాశకృతావరుద్ధాపమానములకు లోనై రణపిపాసావ్యాకులుఁడై యిడుమలఁ గుడుచు చున్నబుందేలుఖండాధిపతి బాజీరాయని సాహాయ్యమువలన నవరోధమునువీడి క్షుధితకేసరివిధంబున వంగాశుసైన్యము నురుమాడఁ జొచ్చెను. మొదటనే బాజీరాయనిచే ధ్వస్తవిధ్వస్తుఁడై ధైర్యస్థైర్యములఁ గోల్పోయినమహమ్మదుఖాన్‌వంగాశు ఛత్రసాలునిదాడి కెదురోపక సైన్యసహితముగ జేతపురదుర్గములోనికిఁ బఱుఁగిడియెను. వంగాశు దుర్గములోఁ జొరఁబడినవెంటనే మహారాష్ట్రసైనికు లరుదెంచి దుర్గమును నలువంకలఁ జుట్టుకొనిరి. ఈసారి

యవరోధమువలన మునల్మానులు పూర్ణముగ దుర్భిక్షపిశాచ మున కెఱయైరి.

వంగాశుని సేనాపతి సచివసుహృదాత్మీయసైనికవర్గమన్న పానాభావమునఁ బ్రతిదినమును లెక్క కెక్కుడుగ యమలోక మున కరుగఁదొడఁగె. శత్రువర్గమున కలవడినదుర్దశఁ గనినం తనే బాజీరాయనిహృదయమున కరుణారస ముప్పతిలఁ జొచ్చె ను. అంత నాతఁడు శత్రుత్వమును ప్రధానముగ నెన్నక "అస్త్ర శస్త్రపరిత్యాగులై శరణాపన్నులై యాశ్రయప్రార్థన మొనర్చు వారెంతటిశత్రువులైనను వారలకు ముక్తిదాన మొసఁగి రక్షిం చెద"నని ఘోషణపూర్వకముగఁ బ్రకటించెను. ఈఘోషిత ప్రకటనము విఘోషితమయినంతనే వంగాశుని సైనికులంద రొక్కసారిగ నరుదెంచి బాజీరాయనియాశ్రయమును స్వీక రించిరి. దయామయుఁడగు నావీరేంద్రుఁడు శరణాగతులైన శత్రుసైనికులను సుహృదభావమున నాదరించి యుచితరీతి బహూకరించి వారలకు ముక్తి నొసఁగెను.

మహమ్మదుఖానువంగా శీవిధముగ వీతబలుఁడై శర ణముఁగానక పీడింపఁబడుచున్నను దురభిమానమును వీడక యింకొకపరి సత్వరముగ సాహాయ్యమున కరుదెమ్మని తన పుత్త్రుఁడు కాయమ్‌ఖానుని కొకపత్త్రమును లిఖించి పనిచెను. కాయమ్‌ఖాన్ బరరాయని బలపరాక్రమముల పరిచయముఁ బూర్ణముగఁ బడసినవాఁడగుటవలన,నిజప్రాణరక్షణాభిలాషియై జనకనిర్దేశ్యమును పాలింపక వెనుకంజ నిడుచుండెను. కాని, తన తల్లియొనర్చునిర్బంధ మతిశయమైనందున నద్దానినహింపనోపక స్వల్పసైన్యమును వెంటఁగొని ఫైజాబాదునుండి బయలు

సురసుందరీమయాంకముఖలలనాలలాటమణి యనుట కిసుమంతయు సందియము లేదు. యీమస్తానీకన్య, ఛత్రసాలునియవనజాతీయసంభ్రాంతోపపత్నీగర్భముక్తాఫలము అని యొక ప్రతీతి కలదు యువతీజనమన్మథుఁ డనఁదగి, తరుణతరణితేజోవిరాజితుఁడైన బాజీరాయని, రూపసుగుణవీరతావిశేషములకు, సురదుర్లభసౌందర్యధారియగు దుహిత మోహితయై పరితపించుచుండెఁ గాఁబోలు నని తలఁచియో, లేక యనన్యరూపలావణ్యరాశియగు మస్తానీకన్యఁ బరిగ్రహింప బాజీరావుగాక తదన్యులర్హులు కాఁజాలరని గ్రహించియో, ఛత్రసాలుఁడు భువనమోహినియగు మస్తానీకన్యను సాలంకృతముగ బాజీరాయని హస్తమున సమర్పించెను.

"ఇంద్రియనిగ్రహుఁ డనఁదగిన బాజీరావు వృద్ధభూపతి ఛత్రసాలుని వినయపూరితానురోధ ముల్లంఘింపనేరక యనిచ్ఛాపూర్వకముగ సుందరీజనమకుటమణియగు మస్తానీనామకకన్యామణిఁ బరిగ్రహించెను. మస్తానీకన్య కేవలము సౌందర్యమున మాత్రమే పేరువడయుట లేదు. చౌషష్టికళలయం దసమానపాండిత్యమును వడసినవిదుషీమణి యనికూడఁ బేరు వడసెను. బాజీరావు స్వతస్సిద్ధముగ నృత్తగీతవాద్యములయం దతిశయమగు నభిరుచిగలిగినవాఁడు. ఆకారణమువలన మస్తానీకన్య నృత్తగీతవాద్యములయందు తనకుఁ గలనిస్తులపాండితిఁ బ్రదర్శించి బాజీరాయనిహృదయముఁ జూఱఁగొనెను. అంత నాతఁ డావిదుషీమణియెడఁ గ్రమక్రమముగ ననురక్తుఁడై రాచకార్యములయెడఁ గూడ వ్యాఘాతవిఘటితుఁ డయ్యెను. అతఁ డాకనిమిష మైన నాకామినీమణిదృష్ట్యంతరమున నునువ నోపఁ డయ్యె. ఆతఁడు యుద్ధయాత్ర

కతుగునపుడును, యుద్ధరంగమున నిలుచునపుడును గూడ నాకామినీమణి నెడబాయకుండెడివాఁడు. సౌందర్యరాశి యగు మస్తానీరమణిఁ జాపష్టికళలయం దసమానపాండిత్య మల వఱచినవిదుషీమణి యనునామమున నలంకరించినవిధంబున నామెను ఛత్రసాలుఁడు సమరశాస్త్రమందు నిపుణఁ గావించి వీరాంగన యనునామమున సుశోభితఁ గావించెను. ఆకారణమున వీరవరుఁడగు బాజీరావు వీరాంగనయగు మస్తానీరమణిని రణక్రీడ సలుప నరుగునపుడు గూడ నెడఁబాయ కుండెడివాఁడు. మస్తానీకమనీయకామినీలోలత్వమున ప్రపంచమును మఱచి ప్రవర్తించుచుండిన బాజీరాయనియెడ సాహూ యత్యంతకుపితుఁడై యాతని ననేకవిధముల మందలించెను. కాని యామందలింపుల నాతఁడు పెడచెవుల నిడుచుండెను. అంతట సాహూ మిగుల కనలి బాజీరాయనిఁ బేష్వాపదచ్యుతునిఁ గావించెద నని యొకకృత్రిమాగ్రహోద్రేకవాక్యమున ప్రకటింపఁజొచ్చెను. అంతటనైనఁ గామికాప్రగాఢప్రణయప్రలీనప్రమత్తప్రేమకుఁడగు బాజీరావాసనుయమునఁ బ్రపితామహుఁ డరుదెంచి వెఱపించినను నిర్లక్ష్యభావముఁ బ్రకటింప సిద్ధముగ నున్నవాఁ డనఁదగి యుండ నిఁక సాహూవెఱపింపులకు లక్ష్యమూనునా? పరిశేషమునఁ గనిష్ఠభ్రాత చిమణాజీ అప్పా నిజసోదరుఁడు సామాన్యమానవునిఁబోలె కామినీలోలుఁడై తదితరవ్యాపారములయందు విరక్తుఁడై సంచరించుచుండినందులకు మిగుల చింతిల్లుచు, తాను అనతికాలములో సంసారముఁ బరిత్యజించి తురీయాశ్రమమునుస్వీకరింప సంకల్పమూని యున్నటులఁ బాజీరాయనిసమ్ముఖమున మనవి యొన

ర్చెను. సోదరుని మనవి చెవి సోకినంతనే బాజీరావు చైతన్యముఁ దాల్చి, కామినీలోలతాప్రమత్తత దూరమొనర్చి నిజకృతానుచితవ్యాపారమున కనుతాప మొందుచు పూర్వపురీతి ధీరగంభీరవీరగుణాలంకృతుఁడై పేష్వాపదనిర్దిష్టకార్యకలాపములయం దనురక్తుఁడై మహారాష్ట్రసామ్రాజ్యమును విస్తరింపఁజేయ ననువగుసాధనపరతంత్రుఁ డయ్యెను. సాహూయానందాంబుధి నోలలాడఁజొచ్చెను. ప్రియసోదరుఁడు చిమణాజీ ప్రసన్నహృదయుఁడై యాశ్రమస్వీకారసంకల్పముఁ బరిత్యజించెను. ఆత్మీయబంధుబాంధవవర్గము అంతఃపురవాసినీమహిళాబృందము, మిత్రసమాజము, ఆజ్ఞానువర్తులు, సేనానులు, సర్దారులు, సైనికులు, వేయేల, బాజీరాయనిహితకాంక్షులగు దేశీయులందఱు సంతసింపఁజొచ్చిరి—"అని 'తవారీఖ బుందేలుఖండ్' అను ఉర్దూచరిత్రమునందు వ్రాయఁబడియున్నది.

## మస్తానీసంతతి.

పూనానగరమునందలి 'శనివారవాడా' నామకప్రాసాదకక్ష్యములో బాజీరావు మస్తానీనివాసమునకొకమనోహరచిత్రవస్తుప్రదర్శితాంతర్భాగముని ర్దేశించి, యాభాగమునకు మస్తానీమహాల్ అని నామకరణ మొనరించెను. శనివారవాడాప్రాసాదముగుండ మస్తానీమహాలున కరుగు ద్వారము 'మస్తానీదర్వాజా' యని విఖ్యాతము. బాజీరావు మస్తానీ మహిళాగర్భమునుండి క్రీ. శ. 1734-వ సం॥ రములో "శమ్‌శేర్ బహాదూర్" అనుపుత్రరత్నముఁ బడసెను. శమ్‌శేర్ బహాదూరు బాజీరాయునిఁ బోలె ప్రచండబలపరాక్రమసంపన్నుఁడు. అతఁడు చరి

త్రవిఖ్యాత మగుపానిపట్టుయుద్ధరంగమున నిజబలపరాక్రమ ములఁ బూర్ణముగఁ బ్రదర్శించి వైరివీరులఁ దల్లడిలఁ జేసెను. కాని విధివైపరీత్యము బలవత్తరమైనందున నాతఁడు రణరంగ మున దీర్ఘనిద్రితుఁ డయ్యెను. పరివర్తిపేష్వాగణపాలనములో శమ్‌శేర్ బహదూరు మహారాష్ట్రీయను ప్రసిద్ధసర్దారుశ్రేణియం దుఁ బరిగణింపఁబడుచుండెడివాఁడు. పేష్వామాధవరావు నారాయణునికాలములో శమ్‌శేర్ బహదూరుకొమరుడు "ఆలీ బహదూర్" అనునాతఁడు నలుబదివేలసైనికులఁ దోడ్కొని చని బుందేలుఖండములోని పరస్పరవివాదవర్తితనరపతిబృంద ముఁ బరాజయ మొనరించి యిరువదిరెండులక్షలరూప్యముల వార్షికాదాయము నొసంగుప్రదేశమును వశమొనర్చుకొనెను. ఇందు ఆలీబహదూర్ ప్రకటించిన పరాక్రమాతిశయమును బుద్ధివిశేషమును సూర్యచంద్రులవలె స్థిరప్రకాశితములు పేష్వా యాదేశానుసారముగ నాలీబహదూర్ బాందానగరమును రాజధానిగ నేర్పఱుచుకొని యందు వసియించెను.

## బాందానవాబు.

ఆలీబహాదూర్ 'నవాబు' ఉపాధిచే నలంకృతుఁ డయ్యె ను. ఆతనివంశీయులు నేటివఱకు బాందానవాబు అనునామ మునఁ బరిచితు లగుచున్నవారలు. క్రీ. శ. 1803-వ సం॥ము లో మార్క్విస్ ఆఫ్ వెలస్లీ ప్రవర్తిత 'సబ్‌సిడరీసిస్టమ్' అను సూత్రబంధమున నాకాలమందలి నవాబు ఆంగ్లేయప్రభుత్వ మువారికి వారిసేనాసంరక్షణమునకు పదునాఱువేల రూప్య ములవార్షికాదాయముగల నిజసామ్రాజ్యాంశమును సమర్పిం

వలసినవాఁ డయ్యెను. కాలపరివర్తనప్రభావ మలంఘ్యమై నందున మస్తానీవంశీయుఁ డగువర్తమానసవాబు, ఇందూర్ రాజకుమారకళాశాలయందు విద్యాభ్యాసమును సమాపన మొనరించి, మధ్యభారతపొలిటికల్ ఏజంటుమూలకముగ సంవత్సరమునకు ముప్పదియాఱువేల రూప్యములు వృత్తివేతనముగ వడయుచు ప్రస్తుతము బాందానగరములో నివసించుచున్నవాఁడు.

క్రీ. శ. 1740-వ సం॥ము ఏప్రిల్ తే 17దీని ఖాందేశములో బాజీరావు కాలధర్మ మొంద నాతనిమృతశరీరము ననుసరించి, కామినీచక్రచూడామణియుఁ బతివ్రతాతిలకమును నగు మస్తానీమహిళారత్నము, చందనచర్చితచితారోహణ మొనర్చి యాకాశచుంబితప్రజ్వలితాగ్నిజ్వాలామార్గముగఁ జని స్వర్గపురముఁ జూఱఁగొనెను.

## బాజీరాయునకు బుందేలుఖండములో సామ్రాజ్య మలవడుట.

క్రీ. శ. 1733-వ సం॥ములో ఛత్రసాలుఁడు పరలోకగతుఁ డయ్యెను. ఛత్రసాలుఁడు రోగగ్రస్తుఁ డైనసమాచారమును విని బాజీరావు బుందేలుఖండమున కరుదెంచి యాతని యంతిమదశయందు సందర్శించెను. ఆసమయమున ఛత్రసాలుఁడు బుందేలుఖండరాజ్యములో తృతీయాంశమును, నుద్ధారకర్తయు రాజ్యసంరక్షకుఁడునగు బాజీరాయునకు ప్రసన్నతాపూర్వకముగ నమర్పించెను. ఈభాగమువలన బాజీరాయునకు జగత్ప్రసిద్ధమగు పన్నామంచిముత్యపుగనులయాదాయములో

తృతీయాంశమును, సంవత్సరమునకు ముప్పదిమూఁడులక్షల యేఁబదివేలరూప్యముల యాదాయమును లభించుచుండెడిది.

క్రీ. శ. 1738-వ సం॥ లో మహమ్మదుఖాన్ వంగాశ్ బుందేలుఖండమును మరియొకసారి యాక్రమించెను. ఈయాక్రమణమునందుఁగూడ తదధిపతియగుఛత్రసాలునికొమరుఁడు జగత్ రాజునకు బాజీరావు బాసటయై వంగాశునిఁ బూర్ణముగఁ బరాజితుఁ గావించెను. ఈయుద్ధమందు బాజీరాయని భుజపంజరమున బంధింపఁబడిన మహమ్మద్ ఖాన్ వంగాశ్ బ్రతుకుతెరువుఁ గానక స్త్రీరూపవేషధారియై, బాజీరాయని సమ్ముఖమున కరుదెంచి భీరుఁడువోలె విలపించుచు శరణాపన్నుఁడయ్యెను. అంతటనుండి బుందేలుఖండము సర్వస్వతంత్ర హిందూసామ్రాజ్యముగఁ బరిగణింపఁబడఁజొచ్చెను.

బాజీరావు బుందేలుఖండహిందూసామ్రాజ్యసంరక్షణ భారము గ్రహించి, యందు చౌతుపద్ధతిఁ బరివర్తన మొనర్చి యద్దానిమహారాష్ట్రసామ్రాజ్యాధిపునియాధీనమున నిడియెను

బాజీరావు, తనకుఁ గడుఁగూర్పుమిత్రుఁడును, సుప్రసిద్ధమహారాష్ట్రబ్రాహ్మణసేనానియు నగుగోవిందరావుబుందేలా యను బ్రాహ్మణునియాధీనమునఁ బూర్వోక్తములగు 33 లక్షల 50 వేల రూప్యములయాదాయవిశిష్టప్రదేశ శాసనాధికారము సమర్పించి తాను సితారానగరమున కరిగెను.

ఈగోవిందగావుబుందేలా సాహసపరాక్రమములవలన బుందేలుఖండమందు మహారాష్ట్రవీరప్రతాపము మిక్కిలిగఁ బ్రకాశించెను. ఈవీరవరుఁడు పానిపట్టుయుద్ధములో వీరశయ్యనలంకరించెను.

---

# ఏడవప్రకరణము.

---

**గుజరాతుదేశమందు వాతుపరివర్తనము.**

మహారాష్ట్రవీరులలోలదృష్టి గుజరాతుదేశముపైఁ జిర కాలమునుండి ప్రసరించుచుండెను. నిజాముతో జరిగినప్రథమయుద్ధసమయములో బాజీరావొకసారి యాదేశము నాక్రమించి యుండె. అనంతరము క్రీ. శ. 1729-వ సం॥ రములో నాదేశాక్రమణమునకు మునుముందు చిమణాజీఅప్పాను పనిచి వెనువెంట తానరిగెను.

ఆకాలములో సర్ బులంద్ ఖానా దేశములో సూబేదారుగ వ్యవహరించుచున్నవాఁడు. బాజీరావు గుజరాతుదేశమున కరుగుటకుఁ బూర్వమే, సాహూ, పీలాజీగాయక్ వాడ్, కృష్ణాజీదమ్ ప్రభృతివీరవరులను సహాయముగ నొసఁగి త్ర్యంబకరావుదావాడేయను తాత్కాలికమహారాష్ట్రసేనాధిపతి నాదేశమును జయించుట కాజ్ఞనిడి పనిచియుండెను. సర్ బులంద్ ఖానీమహారాష్ట్రసైన్యము నెదిరించుటకు తిగోహితుఁడై, డిల్లీశ్వరునిసహాయ మపేక్షించి యాతనిఁ బలువిధములఁ బ్రార్థించెను. అభాగ్యదేవత గుజరాతునం దెల్లెడలఁ దాండవమాడుచుండుటచే కాఁబోలు, సర్ బులందుఖా నెంత ప్రార్థించినను డిల్లీశ్వరుఁ డించుకయైన సరకుఁగొనక కమనీయకామినీగణమధ్యమున విలాసభూయిష్ఠుఁడై మధురమదిరాపానమత్తమాహాత్మ్యమునకు లోనై స్వప్నగతస్వర్గసుఖ మనుభవించుచు నిద్రింపఁ జొచ్చెను. సురదుర్లభసుందరసుందరిజన

భోగపరాయణతత్పరుఁడై, రాచకార్యములయం దనవహ్యతఁ
బూని మెలఁగుచుండిన ఢిల్లీశ్వరునికడ బులందఖానొనర్చిన స
హాయప్రార్థనారోదనమరణ్యరోదనమై పరిణమించెను.

ఢిల్లీశ్వరునివలన సైన్యసహాయ మలవడమి బులందు
ఖా నసహాయుఁడై మిగుల పరితపించుచుండెను. ఆసమయ
మున బాజీరావు గుజరాతునందుండి చౌతునర్ దేశముఖిస్వ
త్వసంగ్రహణాధికార మొసంగి మహారాష్ట్రసార్వభౌమశాసన
ఛత్రచ్ఛాయ నాశ్రయింప నంగీకరించినచో, దేశము శాంతి
భూయిష్ఠ మొనర్చుభారము గ్రహించెద నని బులందుఖాను
కడకు వర్తమాన మనిపెను. పిలాజీగాయక్‌వాడ్, కృష్ణాజీ
కదమ్ మొదలగుమహారాష్ట్రసర్దారులు దేశము దోఁచుకొనఁ
దొడఁగిరి. దేశీయు లనుభవించుచున్నదుర్దశఁ గనలేక నిశ్శ
రణ్యుఁడై నబులందుఖాను బాజీరాయునిసందేశమును సాదర
ముగ గ్రహించి తన్నియమానుసరణిఁ బ్రవర్తించుట కంగీక
రించెను. ఉభయపక్షములవారినడుమ స్థాపితమయిన సంధిని
యమములననుసరించిబులందుఖానుగుజరాతీదేశమంతటను
చౌతుసర్ దేశముఖిపరివర్తనమున కంగీకరించుచు మహారాష్ట్ర
సార్వభౌమశాసనమునకు లోనయ్యెను. అందులకు బ్రతికృతిగ
మహారాష్ట్రసార్వభౌముఁడుగుజరాతువాస్తవ్యులను,చోరకిరా
తాదులబారిబడకుండరక్షించుటకై యిరువదియైదువేలయశ్వా
రోహసైనికుల గుజరాతునందునుచుటకును, గుజరాతునందలి
విద్రోహప్రియులగు జమీందారులకు నేవిధమయిన సహా
యముఁ జేయకుండ నుండుటకు నంగీకరించెను.

### సేనాపతిపేష్వాలవైరకారణము.

పైనుదాహరితమైన సంధిపత్రముపై హస్తాక్షరముల నిడుసమయమందు బాజీరావుపేష్వా, సేనాపతిత్ర్యంబకరావు దావాడేయనువానికి గుజరాతుదేశమందు 'మొకాసా' రూపకముగ గొంతప్రదేశమును దాన మొసఁగెను. ఈసంధినిబంధనమువలన గుజరాతువాస్తవ్యులగు ధనికులధనాగారముల దోఁచుకొని తమతమగృహంబులు ధనపూరితములుగ నొనర్చు నవకాశము తొలఁగుచుండిన సేనాధిపతికిని తదనుచరులకును బాజీరాయనికృతదానప్రసంగ మసంతుష్టి నొసంగుటయే కాక యాతనియెడ విరోధభావ మంకురింపఁజేసెను.

బాజీరాయని యసాధారణప్రతిభాప్రభావమాహాత్మ్యము సర్వవ్యాపియై జనసమ్మతముఁ గనుచుండుటచే త్ర్యంబకరాయనిహృదయసీమ నీర్ష్యానల ముదయమై ప్రజ్వలింపఁ జొచ్చినందున నాతఁడు, బులందుఖానుతో నీవిధముగ సంధిమూలకముగ మైత్రి నెలకొల్పుట తన కసమ్మతమని తనయభిమతముఁ బ్రకటించెను. బాజీరావు వారిమతామతముల గ్రహింపక సంధినిర్మాణము స్థిరపఱచెను. అయ్యది త్ర్యంబకరావు ప్రభృతుల కవమానకరముగఁ దోఁచి వారిహృదయముల బాజీరాయనియెడ నీ వఱకంకురించి జ్వలించుచుండిన విరోధానలమును మఱింతఁ బ్రజ్వలింపఁజేసెను.

### నైజాముకుటిలవర్తనము.

నిజాము బాజీరాయనిచేఁ బరాజితుఁడైనదాది ఆయవమానముఁ బ్రతిశోధన మొనర్చునవసర మరయుచుండెను. కాని యాతఁడు సంధిసూత్రమున నాబద్ధుఁడై యుండినందున న్యాయ

ముగ బాజీరాయనియెడ విరోధాచరణము బ్రకాశింపఁజేయు ట కార్యవాదిలక్షణము కాదనువివేచనమున మునింగికుందు చుండెను. అట్లుండ పేస్వ త్ర్యంబకరావు ప్రభృతిమహారాష్ట్రవీరులనడుమ విరోధానల మంకురించి ప్రజ్వలింపఁజొచ్చెను. ఆసంవాద మాయవనవీరుని కర్ణకుహరములో నవిలంబముగఁ జొరఁబడియెను. మహారాష్ట్రవీరగణమధ్యమం దుదితమైనవిరోధదావానలకథాకలాపము కర్ణపుటములఁ జొరఁబడినంతనె నైజాము, బాజీరాయని నవమానితునిగఁ జేయుట కిదియే తగుసమయమని తలఁచి, విద్వేషాగ్నియం దింధనప్రక్షేపమొనరించుచు ప్రాణపణముగ నవిరామాహార్నిశపరిశ్రమమున మెలఁగుచు బాజీరాయనిప్రతిద్వంద్విగణమునకు గుప్తరీతిని సహాయ మొనరింపఁ జొచ్చెను.

నిజాము, మహారాష్ట్రమండలమం దుదయమొందిన గర్హితగృహవివాదము బలపఱచుచు, త్ర్యంబకరావునకు సైన్యసహాయ మొసఁగుట కంగీకరించుటయే కాక అస్త్రశస్త్రప్రభృతి యుద్ధోపకరణసంగ్రహమునకు తగునంత ద్రవ్యమొసంగెను. అంతియకాక, పీలాజీగాయక్వాడు, కృష్ణాజీకదమ్ మొదలుగా గలమహారాష్ట్రసర్దారులకుఁ బేస్వాకును సంభవమైనపూర్వవైరమును స్మృతికిఁ దెచ్చి వార లాతనినివీడి సైన్యసహిత మరుదెంచి సేనాధిపతిపక్ష మవలంబించునటుల నొనర్చెను.

### త్ర్యంబకరాయనిప్రకటనము.

నిజాము, పీలాజీ, కదమ్ మొదలు గాగలవీరేంద్రులు సైన్యసహిత మరుదెంచి తనపక్షము గ్రహించినంతనే త్ర్యం

బకరావు బాజీరాయని నాక్రమించు నాయోజనమునఁ బ్రవృత్తుఁ డయ్యెను.

త్ర్యంబకరావు, ముప్పదిగైదు వేలసైనికులను వెంటఁ గొని గుజరాతుదేశమందు బాజీరాయనికిఁ గలప్రతిపత్తి ధ్వంస మొనరింప బయలువెడలెను. మార్గమధ్యమం దెల్లెడలఁ "పేష్వ తనప్రతిపత్తి దేశమందంతట నతిమాత్ర ప్రవృద్ధి గనఁ జేయుచు మహారాష్ట్రసార్వభౌము నిశక్తిసామర్థ్యము లఖర్వ మొనరించుచు నామమాత్రావశిష్టునిగఁ జేయుచున్న వాఁడు. అయ్యది సార్వభౌమున కసమ్మత మైనందున నాతనిచేఁ దత్ప్రతీకార మొనరింప సేనాధిపతి నియమితుఁడై చనుచున్నవాఁడు. సుప్రసిద్ధ మహారాష్ట్రసర్దారులు పెక్కండ్రు స్వలాభపరాయణుఁ డగు బాజీరాయనిపక్షముఁ బరిహరించి సేనాధిపతిఁ బరిగ్రహించి యీమహాకార్యమును సాధింప ముందంజ నిడుచున్నవార లు. అందువలనఁ బ్రభుభక్తిపరాయణులగు వీరవగులందఱు సార్వభౌమునినామ మవ్యాహత మొనర్చుసదుద్దేశ్యముతోఁ బేష్వ పైకి యుద్ధయాత్రకరుగుచున్న సేనాధిపతిపక్షమునవలంబించి తమ నిరవక్రపరాక్రమముఁ బ్రకటించి శాశ్వతయశముఁ జూఱగొం దురుగాత" యని ప్రకటింపఁ జొచ్చెను. ఈప్రకటనమును విని నంతనె చిరకాలమునుండి, బందిపోటులు దోపిడులు మొదలుగాఁ గలఘాతుకకృత్యముల కలవాటుపడిన దేశీయులవృత్తిధర్మమునకు నిష్ఠురఘాత మాపాదించిన బాజీరాయని బుద్ధికౌశలము, మహాసాహసము, అసహాయశూరత్వము, అపారగాంభీర్యము, రాజనీతిధౌరంధర్యము, పాలనానైపుణ్యము, కార్యసాధనపటుత్వము మొదలుగాఁగల సుగుణసంపదఁ గంటకతుల్యముగఁ

బరిగణించుచు బద్ధవైరముఁ బూని యున్న దురాచారపరాయ
ణులు తమశత్రుత్వమును సాధింపనభిలాషులై సేనాపతిపక్షము
గ్రహించి యాతనిపై నికదళము బలపఱిచిరి.

## పేష్వాఘోషణము.

త్ర్యంబకరావు తనకు విరుద్ధముగ ఖడ్గము ధరియించి
యరుదెంచుచున్నవాఁ డనియు, నిజా మాతనికిఁ బానటయై
పృష్ఠపోషణ మొనర్చుచుండె ననియు బాజీరాయున కనతి
కాలములోఁ గర్ణగోచరమయ్యెను. నిజాము త్ర్యంబకరాయుని
వెన్నంటి [illegible] వలన నీభీషణగృహవివాదవివర్ధన
మున కాతఁడే కారణభూతుఁ డని గ్రహించి, యథాసంభవముగ
సైన్యమును సంగ్రహించి ధైర్యనిర్భరుఁడై యాతని నెదు
ర్కొన బాజీరావు బయలువెడలెను. బాజీరా వీవిధముగ
శత్రుసంఘర్షమున కగ్రేసరుఁడై "త్ర్యంబకరావు హిందూసం
తానములోనివాఁడైనను, స్వలాభపరాయణుఁడై నిజాము
పదేశముఁ గైకొని మహారాష్ట్రమండలమందు గృహవివాదదా
వానలమును ప్రజ్వలించుచు నున్నవాఁడు. ఈగర్హితకార్యము
సనాతనహిందూధర్మమునకును ప్రకృష్టరాజనైతికమునకును మి
గుల విరుద్ధమై స్వరాష్ట్రమున కరిష్ట మాపాదింప నున్నయది.
అందువలన స్వరాజ్యమంగళకాంక్షులును, ధర్మమార్గావలంబు
లును హిందూశోణితప్రవాహితదేహధారులును నగువీరవరుల
కీసమయమునందు వినావిలంబముగ రాజద్రోహియగు త్ర్యం
బకరాయునిదర్పమడంప శస్త్రధారణ మొనర్చుట సుకర్తవ్యము"
అని ఘోషణ మొనర్చెను. ఇంతకు బూర్వమే దేశీయులందఱు
త్ర్యంబకరాయని దోపిడులవలన నిర్ధనులై పరితపించుచు బాజీ

రాయనినుపాలనాచ్ఛత్రచ్ఛాయనాశ్రయించి శాంతిసుఖములఁ బడయ సమకట్టి యున్నవారు. ఆకారణమువలన బాజీరాయని ఘోషణముఘోషిత మయినంతనె యాతనిసేనావాహిని వీర వివర్ధితమై రాజిలఁ జొచ్చెను. ఈనూతనసమ్మిళితవీరగణము, జన్మభూమిస్వర్గాధిక్య మనునార్యోక్తిఁదలఁచి స్వరాజ్యాభిమానులై నిస్వార్థభావముగ శత్రుమస్తకములఁ బొరిగొన బాజీరాయనిరణపతాకచ్ఛాయందేకత్రితమయ్యెను.

సాహూసందేశము.

బాజీరా వీనూతనసంగ్రహితసేనాసహితముగ ముందున కరుగుచు త్ర్యంబకరాయనియచింతితగర్హితకార్యాచరణ సంవిధానమును సకారణముగ మహారాష్ట్రసార్వభౌమునకు బత్రముఖమున విజ్ఞాపన మొనరించెను. ఈవిజ్ఞాపనముఁ గైకొని, సేనాపతిగర్హితాచరణ నిరోధము తనకశక్యమని తలంచియో, లేక, స్వార్థపరతంత్రుఁడగు ప్రతినిధియుపదేశము గ్రహించియో, సాహూ, సేనాపతియభిమత మీడేర్చి యాతనితోసంధి మూలకముగ మైత్రినెరపుకొన బాజీరాయని నిరోధించుచు నాతనికడ కొకసందేశమనిపెను.

దామాజీదుర్నయము.

దయార్ద్రహృదయుఁడగు బాజీరావు నర్మదానదిం దరించుచు స్వజాతివైరమునకుఁ జింతిలుచు త్ర్యంబకరాయని శాంతిపఱుచుచేష్టలఁ బ్రవృత్తుఁడై యాతనికడ సంధిప్రస్తావనను ప్రేరేపించెను. త్ర్యంబకరాయనిప్రత్యుత్తరమున కెదురుచూచుచు శాంతిసంరక్షణమే ప్రధానకర్తవ్య మని నిశ్చయించి రణపరాఙ్ముఖుఁడై యున్నమహారాష్ట్రసర్దారుని, నర్మ

దానదిఁ దరించుట తడవుగ దామాజీగాయక్వా డెదురించి పరాజితునిఁ గావించెను. సంధిసంబంధమైన మాయావినీయాశాపిశాచావేశుఁడై, శాంతివర్ధనమున మదిచొరపిన బాజీరాయని యాదేశమువలన మహారాష్ట్రసర్దారుఁడు పరాజితుఁడై రణరంగమును వీడవలసినవాఁడయ్యెను ఈయుదంతమును గుఱుతెఱుఁగక విశ్వాసహంతయగుదామాజీ పరాస్తసర్దారునిపలాయనచరితము బాజీరాయునకు వినిపించుచు నాతనిం గేలిసేయ నారంభించెను.

### త్ర్యంబకరాయని ప్రత్యుత్తరము.

దుర్వృత్తచిత్తుఁడైన త్ర్యంబకరావు తనసహాయుతసర్దారుఁడగుదామాజీగాయక్వాడున కలవడినవిజయసంవాదమును విని, గృహవివాదము సర్వనాశనాధారమను వాక్యమందలి యర్థ మిసుమంతయు మదిఁ జొరనీక మహాగర్వియై "సంగ్రామప్రకరణప్రదర్శనకౌతుకమున రంగస్థలమున కరుదెంచి యవనికోత్తాలనమునకుఁ ద్వరపడుచు దుందుభిధ్వానములు దిగ్దిగంతములఁ బ్రతిధ్వను లీనుచుండ వీరచక్రచూడామణిబిరుదాంకితుఁ డగుబాజీరావు భీరుఁడై సంధిప్రస్తావమునకుఁ గడగి వీరధర్మముఁ బరిత్యజించినవాఁడు. సేనాపతిమాత్ర మట్లు సంధికొడఁబడి యాతనిబిరుదమునకు గళంక మాపాదింప నొల్లఁడు" అని ప్రత్యుత్తర మనిపెను.

### రణసంఘర్షణము.

పరాస్తసర్దారుచరితమును వినియు, త్ర్యంబకరాయని ప్రత్యుత్తరము గ్రహించియు, బాజీరా విసుమంతయుఁ జలింపక ద్విగుణితోత్సాహియై, సాహూనిరోధముఁ బాటింపక

ప్రజ్వలితాగ్నిం బోలె విరాజిల్లుచు 1730-వ సం॥ రము సెప్టెంబరు నెలలో నిజాముసైన్యము గుజరాతు చొరకుండ నిరోధించుచు త్ర్యంబకరాయనిఁ దలపడి క్షుధితమృగేంద్రము గజసంకులమును గలఁచుచందమున యాతనిసైన్యమును గలగుఁడు వరుపఁదొడఁగెను. అంతట కొలదిదినముల క్రిందటఁబొందుపడిన సంధిబంధమునుఖండించి నిజాము బయలువెడలి ప్రకాశభావముగ బాజీరాయనిఁ దలపడియెను. అంతట చిమణాజీఅప్పా పదునెనిమిదివేలసైనికులతో నరుదెంచి బాజీరాయునకు బాసటయై నిలిచెను.

సహాయితసర్దారుసహితముగ త్ర్యంబకరాయనిపరాజయము.

ప్రళయకాలసన్నిభమైననీవిపద్దశయందుధీరహృదయుఁడును వీరసంపన్నుఁడునగు బాజీరావు సేనాసహితముగ త్ర్యంబకరాయున కగ్రసరుఁడగుచు క్రమక్రమంబుగ నేగియేగి బరోడాదభయీప్రదేశములకు నడుమ నున్నయొకవిశాలసమతలప్రదేశముఁ జేరి యందు విడిసెను.

ఒకవంక వర్ధితవిక్రమసంపన్నులగు పీలాజీ, దామాజీ, కృష్ణాజీప్రభృతిమహారాష్ట్రసర్దారులయొక్కయు, దక్షిణభారతమం దవిచ్ఛిన్నాధిపత్యమున నలరారుచున్ననిజాముల్ముల్కుయొక్కయు సహాయ మలవఱచుకొని యీర్ష్యానలప్రజ్వలితుఁడై రణకేళి కురుకుచున్నత్ర్యంబకరావును, వేఱొకవంక భ్రాతృసహితుఁడై శత్రువిదళనమున మాతృభూమికి మంగళమాపాదింప దృఢప్రతిజ్ఞఁగైకొని ఖడ్గము ధరించిన సుహృదమహారాష్ట్రవీరగణమండితుఁడగు బాజీరావును భీషణసంగ్రామరంగ మలంకరించి, తమపరాక్రమోత్కృష్టతఁ బ్రదర్శింపనునుకట్టిరి.

క్రీ. శ. 1731 వ సం॥ రము ఏప్రెల్ తే 1 దీని ఉభయపక్షములకు సంగ్రామసంఘర్షణ ముదయమయ్యెను. బాజీరావు, తననిరుపమరణకౌశలమున విపక్షపక్షములోని ముప్పదియైదు వేలసైనికులను సేనానిసహితముగ రణరంగమును వీడి పరుగిడఁ జేసెను. తనసైన్యదళములోఁ బెక్కండ్రు వీరవరులు మడియుట యును, మిగిలినవారు ప్రాణరక్షణాతురులై రణరంగమును వీడి పరుగువారుచుండుటయును గని త్ర్యంబకరావు మిగుల క్రుద్ధుఁడై, స్వయముగ సేనాధిపత్యమును వహించి మత్తగజాధిరూఢుఁడై, బాజీరాయని నెదుర్కొని యాతని సైన్యసహితముగ బాణపరంపరలచే నలయింపఁ జొచ్చెను.

ఈతుములసంగరసందర్భమున మహారాష్ట్రవీరు లొండొరులఁ దునుమాడుకొనుసందర్భ మలవడినందులకు మిగుల పరితపించుచు బాజీరావు "పరవీరులతో యుద్ధమొనర్చుసమయములో నీశౌర్యసాహసములు నీసమరకౌశలముఁ బ్రకటించినచో నధిపునియశమును సంతోషమును వృద్ధి నొందఁగలవు. నాకడఁ జూపిన నేమి ప్రయోజనము? ఇపుడైనను మించినది లేదు. రణవిముఖుఁడ వగుము. దాన నీకు శ్రేయమలవడు" నని త్ర్యంబకరాయున కనేకవిధముల బోధించెను. కాని రణోన్మాదమును వీడనేరని త్ర్యంబకరావు బాజీరాయనియుపదేశము నించుక యైనఁ బాటింపక, శత్రుసంహారణదీక్షాపరతంత్రమున మెలఁగఁ జొచ్చెను. అంతట నిరుపక్షులవారికిఁ బోరు ఘోరమయ్యెను. బాజీరాయునివిజయునీవాహిని చండపరాక్రమముఁబూని శత్రుల నురుమాడఁ జొచ్చెను. అంతట బాజీరావు "సేనాపతిప్రాణములఁ బొరిగొనవలదు" అని తనసైనికుల కాజ్ఞ నిడియెను. కాని యా

తుములసంగరమున క్రోధాంధకారమున మునిఁగియున్నయొకా నొకసైనికుఁడు త్ర్యంబకరాయనిశిరమును తననునిశితకరవాలమున కెఱఁజేసి బాజీరాయనియాజ్ఞ నుల్లంఘించెను. దురభిమానభూయిష్ఠుఁడగు సేనాపతి త్ర్యంబకరావు తత్క్షణమునఁ బంచతత్వపరిత్యాగియై పంచతత్వప్రలీనుఁ డయ్యెను.

సేనాపతిపంచత్వముఁ గని యాతనిసైనికులు రణరంగమును వీడి హాహాకార మొనర్చుచు నలువంకలఁ బఱుఁగిడఁ జొచ్చిరి. పీలాజీగాయక్వాఁడు క్షతవిక్షతశరీరుఁడై రణరంగమునువీడిపఱుఁగిడియెను. యాతనియిరువురుకొమరులు వీరస్వర్గముఁ జూఱఁగొనిరి.

ఈసమరమున సేంధియాహోల్కారులు తమయమోఘపరాక్రమములఁ బ్రదర్శించి బాజీరాయునకు విజయ మలవఱచి శాశ్వతయశము జూఱఁగొనిరి.

స్వదేశాగమనము-పురస్కారప్రాప్తి.

బాజీరా వీవిధముగ గృహవివాదమును నిశ్శేష మొనరించి విజయజయమాలిక ధరిం [illegible] నగరమున కరుదెంచెను.

బాజీరావు బహిర్గతుఁడైన కాలములో శ్రీపతిరా వాతనికి విరుద్ధములగు పెక్కువార్తలతో సాహూకర్ణపుటములఁ బూరించియుండెను ఆవార్తలఘటనాఘటనముల కాధారభూతములగు కారణములును సత్యాసత్యములును సాహూసమ్ముఖములో ప్రతినిధియెదుట నున్నదున్నటుల వివరించి విశదపఱిచెను. అంతట సాహూ బాజీరాయనియెడ నతిశయానురాగమును, శ్రీపతిరాయనియెడ విరాగమును జూప నారంభించెను.

సాహూ తనభూతపూర్వపరాక్రమసంపన్నుఁడగు సేనాపతిమరణమున కించుక చింతిలి యాతని కొమరుండగు యశవంతరావు దావాడేకు సేనాధిపత్య మొసంగి యాతనితో బాజీరాయునకు మిత్రత్వ మొడఁగూర్చెను. అంతటినుండి సేనాపతి పేష్వాలు వివాదవిసంవాదములకు తావొసంగక గాఢమైత్రిఁ బ్రవర్తించుచుండునటుల ప్రతిజ్ఞలఁ గైకొని తదనుగుణముగ పత్రములు లిఖించి సాహూసమ్ముఖమున సమర్పించిరి.

సాహూ యాయిరువురి ప్రతిజ్ఞాపత్రముల గ్రహించి మృతసేనాపతి త్ర్యంబకరాయుని జనని ఉమావాంగ్ హస్తమున బాజీరాయని హస్తమిడి గతానుశోచనపరిత్యాగపూర్వకముగ పేష్వయెడఁ బుత్రవాత్సల్య మూనవలసినదని పలువిధములఁ బ్రార్థించెను. అనంతరము బాజీరా వశ్రువిగళితలోచనుఁడై కరుణాకాతరకంఠస్వరుఁడై యుమావాంగును మాతృసంబోధన మొనర్చి, తానొనర్చినయకృత్యమును క్షమించి మన్నింప వేఁడుకొనెను అంతట నుమావాంగ్ బాజీరాయనిఁ బుత్రసమానునిగ నెంచి యాతని నాలింగన మొనర్చెను. ఆమహారాష్ట్రమహిళావతంస మసాధారణ తేజస్విని. ఆమె తనపౌత్రుఁడప్రాప్తవ్యవహారవయఃకాలములో స్వయముగ సేనాధిపత్య మూని శత్రులఁ దలపడి విజయములఁ గైకొనుచుండెడిది. ఒకప్పు డహమదాబాదునందలి మొగలాయిఖాను బేదారుజొరావరుఖాను సేనాపతికి పరాజయ మొడఁగూర్చెను. ఆవార్త విని యుమావాంగ్ క్రోధోద్ధృతయై యుద్ధరంగమున కరిగి స్వయముగ సేనాధిపత్యమును సహించి మత్తగజారూఢయై శత్రులఁ దలపడి యలౌకికశౌర్యసాహసపరాక్రమములఁ బ్రకటించుచు దుర్ధర్షయై యుదు

జోరావరుఖానుని, ప్రాణరక్షణాతురుఁడై రణరంగమును వీడి వరుఁగిడఁ జేసెను. అంత నీవిజయినీవీరాంగనను సాహూరత్న విజడితసువర్ణకంకణమును బహుమాన మొసంగి గౌరవించెను. ఈవిఖ్యాతవీరాంగన క్రీ. శ. 1749-సం॥ రములో స్వర్గవాసమున కరిగెను.

క్రీ. శ. 1731 వ సం॥ రము ఆగస్టునెలలో గుజరాతు సంపూర్ణశాసనాధికారము యశవంతరావునకును, మాలవదేశ సర్వప్రధానతా ప్రతిపన్నము బాజీరాయునకును రాజానుశాసనములుగ వశములయ్యెను ఇందుతోపాటు గుజరాతు దేశములోని స్వరాజ్యరాజసార్ధాంశము పేస్వామూలకముగను, బులందుఖానువలనఁ బ్రాప్తమగు ధనమును, ఇతరపరగణాదులవలన లభించెడుమాల్గుజారీయాదాయము సేనాపతివలనను రాజకోశప్రేరిత మగునటుల నిర్ధారితము లయ్యెను. పుత్రవియోగమున గుందుచున్న పీలాజీగాయక్‌వాడునకు బాజీరాయనితో మైత్రినొడగూర్చి సాహూ యాతని* "సేనాఖాస్ ఖేల్" అనయుపాధిచే భూషితునిఁ గావించెను.

## పండితసత్కారము

త్ర్యంబకరావు ప్రతివత్సరము శ్రావణమాసములో దేశదేశములనుండి విద్వద్వర్యులరావించి వారిపాండిత్యానుసరణముగ బహుమానముల నొసంగి పురస్కృతులఁ గావించుచుండెడివాఁడు. అతఁ డంతరించినపిమ్మట నాతనితోపాటు పండితసన్మానము కూడ నంతరింపఁ జొచ్చెను. అంతట, విద్యావినోదియగు

* ఈసేనాఖాస్ ఖేలను బిరుద మిప్పటికిని గాయక్‌వాడు వాణ్యములపై ముద్రిత మగుచున్నయది.

బాజీరావు, విద్వత్సన్మానమునకును తన్మూలకముగ విద్యాభివ ర్ధనమునకును భంగ మలవడుచుండుటఁ గని సహింపనోపక, సాహూయనుమతి గొని పండితసత్కారప్రథా ప్రవర్తన మొన ర్చెను.

ఈపండితసత్కారము యుద్ధము, దానము, ధర్మము మొదలుగాఁగల కార్యములకు బాజీరాయునకుఁ బ్రతివత్సర మధమాధమముఅఱువదిడెబ్బదివేలముద్రలకుఁ దక్కువ కాకుం డ వ్యయ మగుచుండెడిది. అత్యాది నాటి విద్యాభివర్ధనమున కదిష్టదాయకములగు దుర్దినములలో నొకశుభచిహ్నముగఁ బరిగణింపఁ బడుచుండెడిది.

ఈపండితసత్కారము బాజీరాయనికొమరుఁడు బాలాజీ బాజీరావు పేష్వాపదమును బూనినపిమ్మట ద్విగుణమై తన రారఁజొచ్చెను. ఆకారణమున భారతవర్ష మండలి అందువిశేష తరముగ మహారాష్ట్రమండలివిద్వద్వర్యులు, శాస్త్రపారంగ తులు, వేదవేదాంగవిదులు, కళాప్రవీణులు పేష్వాపురస్కార పురస్కృతులై ప్రతివత్సరము శ్రావణమాసములో పూనా నగర మునుఁదించి తమతమయధ్యయనాధ్యాపనకౌశలములను ప్రకటించుచు, పరీక్షల నొసంగుచు, సన్మానములఁ బడయుచుం డిరి పండితసన్మానమునకై పేష్వాకు ప్రతివత్సర మూరులక్షల ముద్రలకు తక్కువ కాకుండ వ్యయమగుచుండెడిది. బాలాజీ బాజీరాయునియౌన్నత్యము పతనోన్ముఖముగాకుండ బలసియుం డినచో నాతనిహస్తనిర్గతదానధారాప్రవాహ మెంతవఱకు ప్ర వహించియుండెడినోనిర్ణయించుట కశక్య మగును.

పేష్వాయనంతర మాంగ్లప్రభుత్వమువారు కూడ క్రీ. శ. 1851-వత్సరమువఱకుఁ బేష్వాప్రతిష్ఠితపండితసన్మానమార్గానువర్తులైరి. అనంతర మాబహుమాననిర్ణీతధనమును రెండుభాగములుగ విభజించి యందొకభాగమును మూలధనముగ నొసంగి "పండితపరిషత్సభామండలి" యనునొకమండలముఁ బ్రతిష్ఠించి, యామండలిపండితులకు కొందఱకు మాసవేతనములును, కొందఱకు వార్షికవేతనములును నొసంగుచుండెడివారు. వేఱొకభాగమును మూలధనముగ నొసంగి, "దక్షిణాప్రయిజ్ కమిటీ" యనునొకమండలమును ప్రతిష్ఠించి "దక్షిణాఫెల్లోషిప్పు" అనునొకపరీక్షఁ బ్రతిష్ఠించియందు తీర్ణులగు పండితులకు బహుమానముల నొసంగఁజొచ్చిరి. అందు దక్షిణాప్రయిజ్ కమిటీమండలము నేటివఱకవిచ్ఛిన్నముగవృద్ధినొందుచు మహారాష్ట్రభాషయందలియుత్కృష్టగ్రంథవిలేఖకులకు యోగ్యతానుసరణముగ నేఁబదిమొదలు అయిదువందలరూప్యముల వఱకు బహుమానముల నొసంగుచున్నయది.

### నైజాముతోడి రెండవసారి సంగ్రామము

నిజాము పైగృహవివాదమునకుఁ బ్రధానకారణుఁడని బాజీరావు మొదటనే గ్రహియించి యున్నవాఁడు. ఆకారణమువలన నాతఁడు సేనాపతితోడియుద్ధమున విజయముఁగైకొనినయనంతర మాతనికి విరుద్ధముగ యుద్ధాభియాన మొనర్చు యోజనముఁ బూని తత్ప్రయత్నములఁ బ్రవృత్తుఁడయ్యెను. అయ్యది కాలక్రమమున నిజామునకు విశదమయ్యెను బాజీరాయనిబాహుబలముఁ బలుమారు చవిగొని యున్ననిజామీవార్త నాలించినంతనె భయకంపితుఁడై, తాను మహా

రాష్ట్రులోనప్పుకార్యకలాపములయిందు హస్తక్షేప మొనరింపకుండ నుండుటకును, దక్షిణభారతములోని సామ్రాజ్యాధిపత్యము నిర్బాధకమగునటులఁ జేయుటకును నంగీకరించుచు రెండవపరిసంధి యొనర్పుకొనుటకుకృతనిశ్చయుఁడై బాజీరాయునిఁ బలుదెఱఁగులఁ బ్రార్థించెను. అంత బాజీరా వాతనిప్రార్థనము నంగీకరించుచు యుద్ధాభియాన యోజనమువిడనాడి, రాజ్యము యొక్క యాభ్యంతరీయశాసనసంస్కారబంధమున మెలంగుచు కొలఁదికాలము సితారానగరమందు నివసించి దేశీయుల స్వేచ్ఛందసుఖాభివృద్ధిదములగు పథంబుల ప్రతిష్ఠించెను.

మరుచటిసంవత్సరము బాజీరావు మాలవదేశమున కేగుచున్నసమయములో నాతని నిజాముల్ముల్కు సందర్శించి పూర్వప్రార్థితసంధిప్రస్తావనను స్థిరపఱుచుకొనెను. అందు, బాజీరావు మాలవదేశమున కేగెడివేళలో నిజా మధికృతప్రదేశము (ఖాందేశము)లో నేవిధమయినయుపద్రవమును సలుపకుండ నుండుటకును, తత్ప్రతిఫలముగ నిజాముగాజ్యమునుండి మహారాష్ట్రాధిపునకుఁ బ్రాప్తమగు సర్దేశముఖీసంక్రాంతాదాయము ప్రతివత్సరము నియమానుగుణముగ నిర్బాధకముగ నిజాము బాజీరావునకు సమర్పించుచుండుటకును నంగీకరించి తదనుగుణముగ నిరువురు ప్రమాణపత్రికలఁ గైకొనిరి.

### సిద్దీలపరాజయము.

జంజీరాలోనిసిద్దీనాయకులకును మహారాష్ట్రులకును నడుమఁ గ్రీ. శ. 1726-వ సంవత్సరములో నంకురించినవిరోధానలము దినదిన నభివృద్ధిఁ గనుచుండెను. క్రూరప్రకృతులగు సిద్దీ లేదైననొకక్షుద్రకారణ మాధారముగఁ గైకొని,

దేవమందిరములను ధర్మశాలలను ధ్వంస మొనరించుచుండుటయే కాక దేశీయుల కనేకవిధములగు నుపద్రవములఁ బ్రతిఘటించుచు వచ్చుచుండిరి. అందువలన సాహూనరపతి 1730-వ సంవత్సరములో శ్రీపతిరావుప్రభృతి కతిపయసేనానులను సిద్దీలఁ దలపడుటకు పలుసాపనిచి యుండెను. కాని యందేరును సిద్దీలను నిర్జించుటకుఁ గాని, వారలను వశీభూతులఁ గావించుకొనుటకుఁ గాని సమర్థులు గారైరి.

మహారాష్ట్రులతోడి ప్రతిపోరామునందును విజయమును వడయుచుండినసిద్దీలు, రాక్షససదృశులై హిందువులను స్వధర్మములనుండి బలాత్కారముగఁ దొలగించి మహమ్మదీయధర్మదీక్షితులఁ జేయఁజొచ్చిరి. హిందూసంతానము సిద్దీలదురాచారములకు సహింప నోపక స్వగృహాస్వదేశముల వీడి దేశాంతరములకుఁ బరుగిడఁ జొచ్చెను. ఆసమయమున బాజీరావు మాలవదేశములో నుండెను.

అంతట సాహూ, స్వజాతి, స్వధర్మ, స్వదేశసంరక్షణదీక్షితుఁడును వర్ధితవిజయుఁడును నగుబాజీరాయునకు సిద్దీలమూలకముగ హిందూసంతానమున కలవడుచున్నవిపత్పరంపర నెఱుకపఱుచుచు,రాజధానికరుదేరనాతని కాజ్ఞనొసఁగెను. సాహూయుత్తరువుచొప్పున రాజధానికేగినచో విలంబాధిక్యమును, అందువలన సంతప్తహృదయులగు హిందువులయెడ దురాచరణ మాచరించుటకు సిద్దీలకు మఱికొంతయవకాశ మలవడునని తలంచి బాజీరావు రాజధానికరుగకయే, రాణోజీసేంధియా, మల్హారురావుహోల్కరులను మాలవదేశములో నునిచి, 1733-వ వత్సరప్రారంభమున జంజీరావంక కరిగెను.

బాజీరాయనితోడ పోరాటమున దర్పితసిద్దీరాతునన మూహము పూర్ణముగఁ బరాజయమొందెను. ఈసంఘటనము వలన జంజీరాలోనిపదునొకండు పరగణాలయాదాయములోని సగపాలు మహారాష్ట్రపతికి ప్రతివత్సరము ప్రాప్తమగుట సంప్రాప్తమయ్యెను. అంతియకాక ఛత్రపతిశివాజీపరిపాలనములో రాజధానియైయుల్లరారినరాయగడమును, అందుతోపాటు మఱి నాలుగు సుదృఢసుప్రసిద్ధదుర్గములును మహారాష్ట్రులకవశ్యములయ్యెను. సనాతనవైదికక్రియాకాంక్షకలాపము నిర్విఘ్నముగ కొనసాగ ననువయ్యెను. హిందువులయర్థప్రాణములకు నిర్భయము లవడియెను.

ప్రతినిధిప్రభృతికతిపయసేనాను లనేకవిధముల వ్యయప్రయాసములకు లోనై పడయనేరనిసిద్దీవిజయమును బాజీరావు తననిరుపమబలపరాక్రమములచే నవలీలఁ గైకొని జంజీరాదుర్గమున మహారాష్ట్రవిజయపతాకమును నెలకొలిపెను.

బాజీరావుసిద్దీపోరాటమునందు పూర్ణవిజయమును పడసి సితారానగరమున కరుదెంచెను. ఛత్రపతిసాహూ ప్రశంసనీయుఁడును, ప్రచండప్రతిభాసంపన్నుఁడును, నసాధ్యకార్యసాధనాధితపటిష్ఠుఁడును నగుబాజీరావున కెదురేగి యభివాదనమొనర్చి యాతనికి రాయగడము తన్నికటస్థప్రదేశసహితముగ నాతనికి బహుమాన మొసఁగెను.



## ఎనిమిదవప్రకరణము.

---

### హిందూస్థానమందసంతోషము.

గుజరాతునందలి విశృంఖలవ్యాపకవిప్లవనిరోధమును, నిజాముబాజీరావుల నూతనసంధినిర్మాణమును నిరాఘాటముగ గొనసాగినయనంతరము దక్షిణహిందూస్థానము శాంతిభూయిష్ఠమై వఱలఁజొచ్చెను.

ఇఁక నుత్తరహిందూస్థానమన్ననో, మహమ్మదుసావాు పాలనము, ప్రభుత్వదుర్వ్యవహారముననుు, జిజియాకరప్రచార మువలనను. జ్ఞానశూన్యనిష్ఠురరాజపురుష క్రూరకర్మప్రచారము వలనను, రాజనీతిపరివర్తనవిఘటనమువలనను ప్రజాపుంజము దైన్యహైన్యములకుఁ బాలయ్యెను. మొగలకృతదురాచార బాహాటవిహారముఁ గని రాజపుత్రవీరులు నితాంతోత్తప్తహృదయులై, యవనసామ్రాజ్యమును విలోప మొనరించుటకు కంకణబద్ధులై, మహారాష్ట్రులదినదినప్రవర్ధమానసామ్రాజ్యైశ్వర్యవిభవములను, బలపరాక్రమములను, స్వరాజ్య స్వధర్మ స్వజాతిసంరక్షణదీక్షాపారతంత్ర్యమును దిలకించి, మిగుల సంతసిలి మొగలాయీప్రభుత్వమును నిర్మూల మొనరించు సమయమున వారలసాహాయ్య మలవఱచుకొనుట మిగుల నావశ్యకమని నిశ్చయించిరి.

### మాలవదేశమందరాజకము.

ఈసందర్భమున మాలవదేశమును శాసించుచుండిన సూబేదారు రాజాగిరిధరరావు స్వర్గస్థుఁడయ్యెను. అంత నాతని

యాత్మీయుఁడు దయాబహద్దూర్ అనునాతఁడు తత్పదవిఁ జేకొనెను. ఈతఁడు క్రూరస్వభావుఁడు. దయాశూన్యుఁడు. ఈనూతనసూబేదారుని క్రూరజఘన్యదురాచారబాహుళ్యము మాళవేయులను నితాంతనిష్ఠురదుర్దశాగ్రసితులఁ గావింపఁజొచ్చెను. నూతనోదితకర (పన్ను) భార మొకవంకను, రాజకర్మచారుల నిష్ఠురవ్యవహారము వేఱొకవంకను నిరాఘాటముగ వ్యాపించి పీడించుచుండుటవలనఁ గృషీవళు లన్నవస్త్రములకు దూరులయి దేశాంతరులగుచుండిరి. దేశములోని తాలూకాజమీందారులు సూబేదారుని క్రూరశాసనమునుసహింపనేరక పాదుషా దర్బారులో తమకష్టనిష్ఠురములఁ బలుసారులు మొఱవెట్టుకొనిరి. కాని వారిమొఱలు అనాకర్ణితము లయ్యెను. అంతతాలూకాజమీందారులు దయాబహదూరునకు విరుద్ధముగఁ గత్తిఁగట్టి విద్రోహఘోషణ మొనర్చుచు హిందూసంతానమున కేకమాత్రాశ్రమప్రదాతయై వఱలుచున్న పేష్వాబాజీరాయని శరణము వేఁడుకొనిరి. ఆకారణమువలన బాజీరాయని తీక్ష్ణవీక్షణ ముత్తరభారతమువంకకు మఱలఁ జొచ్చెను.

-ఈఈ సవాయిజయసింహునిసందేశము ఈఈ-

ఈకాలములో సవాయిజయసింహుఁడు జయపూరు సింహాసనము నలంకరించి, రాజపుత్రమండలమునకు శిరోమణియై వఱలుచున్నవాఁడు. ఆతఁడు విద్యానురాగి. జ్యోతిశ్శాస్త్రమం దత్యంతప్రవీణతఁ బడసినవాఁడు. స్వజాతిస్వధర్మములకుఁ బృష్ఠపోషకుఁ డని పేరొందినవాఁడు. బాదుషాదర్బారునందు విశేషముగఁ బ్రతిపత్తిఁగలిగినవాఁడు. ఆతఁడు రాజపుత్రులు మాలవేయులు పడుచున్నయిక్కట్టుల డిల్లీదర్బారు

నందుపపాదన మొనర్చుచు తన్నివారణముఁ గూర్చి పలు
సారులు వేఁడుకొనియెను. కాని జయసింహునివిన్నపము బాదు
షాహేదర్బారులోని ప్రముఖు లేరును సరకుఁగొనరైరి. దురా
చారపరాయణులగు మొగల సూబేదార్లహస్తములనుండి
ప్రపీడితహిందూసంతానము నుద్ధరింపననుద్యుఁ డగుచుండెను.
అందువలన మొగలాయీదురాచారము లంతకంత కతిశ
యింపఁ జొచ్చెను. హిందువులదుర్దశాప్రదర్శనము జయసిం
హుని వ్యథితవిచలితహృదయుఁ జేయుచుండెను అంతరాజపుత్ర
వీరులు మాలవేయులపక్ష మవలంబించి, మహారాష్ట్రులసాహా
య్యమును వేఁడుకొన జయసింహుని నిరోధించిరి. జయసింహు
డా నిరోధమును నతిక్రమింపనేరక "మొగలాయీశాసనపీడి
తులై యిడుమలఁగుడుచుచున్న యుత్తరహిందూస్థానవాస్తవ్యు
లసంరక్షణ మత్యంతావశ్యక మయియున్నయది. సత్వరముగ
రానగు" నని బాజీరాయనికడకు గుప్తముగ సందేశ మని
పెను. ఈసందేశమునకుఁ బూర్వమే యుత్తరహిందూస్థాన
ములో మహారాష్ట్రాధిపత్యమును నెలకొలుప నువ్విళ్లూరు
చున్న బాజీరావు రాజపుత్రచూడామణి సవాయిజయసింహుఁ
డనిపినసందేశమును సాదరముగ గ్రహియించి యుత్తరభారత
విజయాభియానమున ద్విగుణితోత్సాహి యయ్యెను.

### మాలవవిజయము.

ఈసందర్భమున బాజీరావు హేత్వంతరములచే సితారా
నగరమును విడుట కసమర్థుఁడై తనకనుఁగుమిత్రుఁడును కడుఁ
గార్యప్రియుఁడును, అజేయవీరుఁడును నగు మల్హారురావు
హోల్కారుని మాలవవిజయమునకు నియోగించి పనిచెను.

క్రీ. శ. 1732-వ సం॥ రములో మలహారురావుపంద్రెండు వందలరణకర్కశులగు మహారాష్ట్రసైనికులను వెంటఁగొని మాలవవిజయముఁగూర్చి బయలువెడలెను. ఇందూరు జమీందారు నందలాల్‌రావును, తదితరఠాకూర్ జమీందారులును సైన్యసహితముగ మలహారురావున కెదురేగి యాతనిపక్షము గ్రహించిరి. హోల్కారు మాలవవిజయమున కరుదెంచు చున్నవాఁడనుభీషణసంవాదమును దయాబహదూ రాలించి, తన్మార్గానరోధమునకు యథాసాధ్యముగ బ్రయత్నములు సలుపుచు, మాలవదేశమున కరుదెంచు సుప్రసిద్ధసలజఘాపర్వత మార్గములయందు మొగలాయీసైనికులను నిలువరించెను. మాలవమండలిగు ప్తమార్గములఁ జక్కగ నెఱింగిననందలాల్ రావాదిఠాకూరుజమీందారులు తనపక్ష మవలంబించి వెంట నరుదెంచుచున్నందున హోల్కారు వినాపరిశ్రమముగ మాలవదేశములోఁ జొరుకొనెను. దయాబహాదూరు స్వయముగ సేనాధిపత్యమును వహించి మత్తగజారూఢుఁడై సంగ్రామరంగ మలంకరించెను. అంత మలహారురావు హోల్కారు దయాబహాదూరులకు రణసంఘర్షణము ప్రబలమయ్యెను. అందు మహారాష్ట్రసైనికులు నిరవక్రపరాక్రమమున కెదురొపక దయాబహాదూరు మూఁడువేలవీరవరులతో సమరతలమున దీర్ఘనిద్రితుఁడయ్యెను. మిలిగిన సైనికులు క్షతశరీరులై పరుగిడిరి.

బాజీరాయనిశాసనానుసరణముగ మలహారురావుహోల్కారు పూర్ణవిజయుఁడై మాలవములోని మొగలాయీశాసనాధికారమును నూడఁబెఱికి తత్స్థానమునమహారాష్ట్రాధిపత్యమును నెలకొలిపి, తదధివాసుల కత్యంతసుఖమును అపరిమితానందమును నొడఁగూర్చెను.

## మాలవశాసనము

మొగలాయిశాసనమునుండి మాలవదేశముచే జారిన పిమ్మట, తదుద్ధారణార్థము మహమ్మదుఖాన్ వంగాశుని పాదుషాగా నియోగించెను. పాపము వంగాశు తనయావచ్ఛక్తిని వినియోగించి చూచెను. కాని కర్తృకకార్యమును సాధింపఁజాలక పోయె. అంత డిల్లీశ్వరుఁడు మాలవదేశములో మొగలశాసన పునఃప్రతిష్ఠాపనోద్యోగభారమును సవాయిజయసింహుని భుజస్కంధమున నునిచెను.

క్రీ. శ. 1719 సం॥ రములో బాదుషాహీసనదుపత్రముఁ గైకొని స్వదేశమున కరుదెంచుకాలములో పేష్వబాలాజీ విశ్వనాథపంతు, మహారాజాజయసింహుని సంధిసూత్రమున నాబద్ధునిఁ గావించి మైత్రినలవఱచుకొని యున్నవాఁడు. ఆమైత్రి విశ్వనాథపంతుతోనంత యుండక బాజీరావు జయసింహులహృదయసీమల నతిశయమయి వృద్ధిఁ జెందుచుండెను. అందువలననే జయసింహుఁడు మాలవదేశాక్రమణమునందు బాజీరాయునకు సర్వవిధముల సాహాయ్యమొసఁగి విజయముఁ గూర్చినవాఁడు. ఈకారణమువలన జయసింహుఁడు బాదుషానియోగానుసరణముగ బాజీరాయునకు విరుద్ధముగ వ్యవహరించుటకు సమ్మతింపక తదనుగుణ ప్రస్తావనము దర్బారునం దుపపాదన మొనర్చెను. దుర్బలహృదయుఁడగు బాదుషా జయపురాధీశ్వరుని ప్రస్తావనమును స్వీకరించి, మాలవములో మొగలశాసనపునఃప్రతిష్ఠాపనోద్యోగమును పరిహరించెను.

పాదుషానియోగానుసరణి జయసింహుఁడు పేరునకు

మాత్రము మాలవదేశము సూబేదారీయుపాధిగ్రహియించి శాసనాధికారములు బాజీరాయనియాధీన మొనర్చెను.

### గుజరాతువిప్లవము.

మాలవశాసన మలవడినంతనె బాజీరావు సంతుష్టుఁడగుట లేదు. ఆతఁడు తనబాహుబలమున నేయేప్రదేశములను వశమొనర్చుకొని యధికారమునకులోబఱచుకొనెనోయాయాప్రదేశములను పాదుషాహీసనదుమూలకముగ సత్వస్థైర్య మలవఱచుకొనననువగుయత్నములఁ బ్రవృత్తుఁ డయ్యెను. బాజీరా వెంత ప్రయత్నించినను ఆతనికిసనదుపత్ర మొసగుటకుఁ బాదుషా యంగీకరించుట లేదు. సరియేకదా, గుజరాతుసూబేదారు సర్ బులందుఖానునకును బాజీరావునకును పూర్వనిర్ధారితసంధి నియమానుసరణి గుజరాతునుండి బాజీరాయునకుఁ బ్రాప్తమయ్యెడిచౌత్ సర్ దేశముఖీసత్వసంగ్రహణమునకుఁగూడ నసమ్మతిని ప్రకటించుచు ననురోధ మొసంగఁజొచ్చెను.

పాదుషా, తనమనమునకు వ్యతిరిక్తముగ సర్ బులందుఖాను బాజీరాయనితోసంధియొనర్చుకొని చౌతుసర్ దేశముఖీస్వత్వసంగ్రహణాధికారమును సమర్పించినవాఁడని యాతనిఁ బదచ్యుతునిఁ గావించి, తత్పదమునఁ జోధపురాధిపతియగు మహారాజాఅభయసింహునిఁ బ్రతిష్ఠించెను. అభయసింహుఁ డత్యంతకూరుఁడనుటకు, ఆతఁడాతనిజనకుని వధియించి సింహాసన మలంకరించుటయే యొకప్రబలనిదర్శనము. జనకునివధియించినకూరాత్ముఁడు, క్రౌర్యమునకు వెనుకంజ యిడువాఁడగునా! ఆతనిఁక్రౌర్యవిశ్వాసఘాతుకత్వములు వరియించినవిధ

ముననే శౌర్యసాహసములుకూడ నాతని పాణి గ్రహియించిన యవి.

పేస్వానియోగమున చౌతుసర్దేశముఖిస్వత్వసంగ్రహణార్థము గుజరాతున కరిగినపీలాజీగాయకవాడుతో నభయసింహుఁడు కూటమైత్రిఁ బ్రకటించి యాతనిఁ బొరిగొనియెను. అభయసింహుఁ డొనరించిననిర్ఘృణితకృత్య మచిరకాలములోనే మహారాష్ట్రులకర్ణకుహరములఁ జొరుకొనెను. అంత మహారాష్ట్రవీరులు క్రోధోన్మత్తులై కరాళకృపాణముల ధరించి యొక్కమొగి నభయసింహుని నాక్రమించిరి. ఈయాక్రమణమును నిరోధించుట కభయసింహుఁ డసమర్థుఁడై విజయజయమాలికతోఁ బాటు యభయభావముఁగూడ మహారాష్ట్రులకు సమర్పించి, గుజరాతుఁ బరిత్యజించి జోధపురమునకుఁ బరుఁగిడియెను. గుజరాతు మరల మహారాష్ట్రులహస్తము నలంకరించెను. ఇంతయయ్యును బాజీరాయునకు సనదుపత్రమొసంగుటకు బాదుషా యంగీకరించుట లేదు. మాళవవిషయమునఁ గూడ నట్టిదే ప్రాప్తమయ్యెను. అందువలన బాజీరావు మిగుల క్రుద్ధుఁడై తనసేనానులు, సేంధియాహోల్కారులను క్రీ. శ. 1728-వ సం॥ రములో నుత్తరమున డిల్లీయాగ్రానగరములపర్యంతము వ్యాప్తమయిన మొగలశాసితప్రదేశములరూపడంచుట కాజ్ఞనిడి పనిచి, తాను సిద్దీల నెదుర్చుట కరిగెను.

## శ్రీబ్రహ్మేంద్రస్వాములవారియుపదేశము.

ఉత్తరహిందూస్థానములో డిల్లీపర్యంతము వ్యాప్తమయిన మొగలాయీశాసితప్రదేశములపై బాజీరావు, దాడివెడలుసంకల్ప మూనుట కింకొకకారణము కలదు. ఆతనికి

సైన్యవిషయికవ్యయ మేటేట నధికమగుచుండుటవలన నాతఁడు ఋణగ్రస్తుఁ డయ్యెను. సైనికులు నియమానుసరణముగ వేతనములు వడయమి నిరుత్సాహులగుచుండిరి. సాహూదర్బారునందు బాజీరాయనిప్రతిపక్షులు బలియుచుండిరి. అందువలన నాతఁడు విపద్దశకుఁ బాలగుట యప్పుడప్పుడు తటస్థమగుచుండుటవలన విగతధైర్యుఁడగుచుండెడివాఁడు. అట్టిసమయములలో బ్రహ్మేంద్రస్వామి, ఛత్రపతిశివాజీకి గురువైన రామదాసస్వాములవారిఁబోలె బాజీరావునకు గురువై ధర్మనీతి రాజనీతి కర్మనీతుల నుపదేశించుచు ధైర్య మొసంగుచుండెడివారు. ఆకారణమున బాజీరావు తనగురువగు బ్రహ్మేంద్రస్వాములవారికి తనకు ప్రాప్తమయిన ప్రకృతవిపత్పరంపరను విన్నవించుకొనెను. అందులకు ప్రత్యుత్తరముగ స్వాములవారు "విపత్కాలమున విచలితుఁడగుట నీవంటిధీరచిత్తున కుచితము కాదు. ధైర్య మవలంబించుట కర్తవ్యము. వత్సా! మాలవదేశమును పూర్ణముగ వశమొనర్చుకొని, యనంతరము ఢిల్లీయాక్రమణమునకుఁ గడంగుము. అందువలన సర్వకష్టము నివారణమగును. మ్లేచ్ఛదమనమును హిందూసామ్రాజ్యవిస్తరణమును సాధితము లగును." అని పత్రముఖమున బాజీరాయున కుపదేశించిరి. శ్రీస్వాములవారియుపదేశమును శిరమున ధరియించి, తదాజ్ఞానుసరణముగ బాజీరావు ఢిల్లీయాక్రమణమున కగ్రేసరుఁ డయ్యెను.

### బాజీరాయనివైరిబృందము.

భారతవర్షములోని తదితరప్రదేశములలోవలె మహారాష్ట్రదేశములోఁగూడ బాజీరాయునకుఁ బలువురు విరోధులు

కలరు. అందు రఘూజీ, దాభాడే, గాయక్‌వాడుప్రభృతులు ప్రబలులై బాజీరాయున కనిష్ట మాపాదింప నిరంతరము చింతించుచు తదనుగుణరంధ్రాన్వేషణతత్పరు లగుచుండిరి. ఈసందర్భమున బాజీరావు బ్రహ్మేంద్రస్వాములవారికి వ్రాసినయుత్తరములలో నొకదానియందు "రఘూజీ, దాభాడే, గాయక్‌వాడు ప్రభృతిపెక్కండ్రుసర్దారులు నాకవజ్ఞత నొడగూర్చు యత్నములం బ్రవృత్తులై, స్వార్థపరాయణులై, పలుదేశముల దోచుకొనుచు ప్రజాపుంజమును కష్టపరంపరలపాలు గావించుచుండిరి. వలదన్న నాపై కత్తిగట్టుచుండిరి వారందఱు కోటానుకోట్లు పరిమితి గలస్వర్ణరజితముద్రల కధిపతులై యుండియున్నను తనివి నొందక దురాశాపిశాచపాశబద్ధులై నామాట పాటింపక నాకు వ్యతిరిక్తులై ప్రవర్తించుచుండిరి. మహారాజు సాహూకూడ వారియం దనురక్తుండై యున్నవాఁడు" అని వ్రాసియుండెను. ఈవ్రాతయే మహారాష్ట్రసర్దారులు పెక్కండ్రు బాజీరాయనియెడ ద్వేషులై సంచరించి రనుట కొకప్రబలనిదర్శనము.

### బాజీరాయనిఋణము.

భారతవర్షములో, నందు ముఖ్యముగ దక్షిణభారతములో యవనశాసనోన్మూలనార్థము బాజీరావు బద్ధకంకణుండై దేశములోనియుత్కృష్టసైనికసంగ్రహ మొనర్చుచుండెడివాఁడు. అందు నించుమించుగ తనయాదాయమంతయు వ్యయమగుచుండెడిది. అందువలన సైన్యపోషణము ఋణమూలకమగుచుండెను. ఆతఁడు ఋణాతిశయమువలన ననుభవించెడి మనోవేదన మప్పుడప్పుడు శ్రీమాన్ పరమహంసపరశురామబా

బా "బ్రహ్మేంద్ర" స్వాములవారికి ప్రత్యక్షముగను ఉత్తరములమూలకముగను విశదపఱుచుకొనుచుండెడివాఁడు. శ్రీస్వాములవారు బాజీరాయనికి ధైర్య మొసఁగి యాశ్వాసించుచుండెడివారు.

బాజీరావు శ్రీస్వాములవారికి వ్రాసినయుత్తరములలో నొకదానిభావ మిందు సంగ్రహముగ నుదాహృతమయ్యె.

"శ్రీమాన్ పరమహంసపరశురామ బాబాజీస్వాములవారి శ్రీచరణసేవకు బాజీ విన్నవించువినయమితవిజ్ఞాపనము.

ఆజ్ఞానుకారియగు సేవకునకుమహారాజాఖండోజీద్వారా తామాశీర్వాద పురస్కారముగ నంపినశ్రీముఖము మిగుల సంతసమును ధైర్యమును నొడగూర్చె ననుటకు సందియము లేదు.

తాము సర్వసంగపరిత్యాగులరై సన్యాసాశ్రమమును స్వీకరించి స్వయంవ్యక్తులరై సర్వోత్కృష్టపదముఁ బడయు నున్నవారు. సేవకుఁ డన్ననో అసారసంసారమునఁదగుల్కొని యిహపరములు రెంటికిని దూరమగుచున్నవాఁడనుట నిర్వివాదాంశము. ఈసంసారవ్యామోహము సేవకున కిరువదిలక్షల ముద్రలపరిమితిగల ఋణలాభము ప్రాప్త మొనరించినది. ఋణదాతల నింతరధర్షణఘర్షణరూపకమగు నరకకూపమునఁ బడి వేదనల ననుభవించుచున్న సేవకునిశరీరము సంపూర్ణముగ కృశించియున్నయది. ఈదారుణప్రజ్వలజ్వాలాతుల్యమగు ఋణజాడ్య మనిభవింప నీసేవకుఁడశక్తుఁడై గతవత్సరము 'పింప్రీ' లో శ్రీచరణముల దర్శించి, దైన్యహైన్యములఁ బూర్ణముగ విన్నవించి కర్తృకభారమును శ్రీచరణములకు సమర్పించి

నిశ్చలభక్తితో గురుచరణముల నారాధించునిష్కపటభావమును జ్ఞాపిత మొనర్చుకొనెను. అపుడు సేవకునిదురదృష్టము బలవత్తరమై యుండుటచే తాము, 'శిష్టరక్షకుఁడును, దుష్టశిక్షకుఁడును నగుభగవంతుని నిర్మలాంతఃకరణముతో నమ్మినవారికి విజయ మలవడుట నిశ్చయము. నీవు భగవచ్చరణములపై భారము వైచి స్వదేశస్వరాజ్యస్వధర్మరక్షణమునకుఁ గడంగుము. శీఘ్రకాలములో ఋణజాలమునుండి ముక్తివడయనగును; భార్గవుఁడు సహాకారియై యున్నవాఁడు' అని యుపదేశించి సేవకుని మరల నడిపితిరి. తమకృపాపూరితాశ్వాదితవాణినాధారముగఁగొని సేవకుఁ డింతదనుక ధైర్యమవలంబించి యుండెను. కాని, ఫలితమిసుమంతయుఁ గానవేరఁడయ్యె. 'యశోఫల మలవడె' నందురా! అదియేటిఫలము! ఏటిలాభము! ప్రతిదినమును ఋణదాతలపదములఁ బడుచుండుటవలన శిరమువంగినది. వారలను వినయపూర్వకముగఁ బ్రార్థించుచుండుటవలన నోరుకాయకాచినది. తమప్రతిశ్రుతి ననుసరించి యీసంవత్సరము ఋణవిమోచన మలవడిన సర్వస్వముతము. లేనినాఁడుసర్వముఁ బరిత్యజించి కర్తవ్యమును శ్రీచరణములకు సమర్పించి చింతా విరహితముగ భగవత్సన్నిధిఁ బ్రాణములఁ ద్యజింప నమకట్టియుండె.

ప్రణతార్తిహరుఁడు భక్తజనభాగధేయుఁడు ఆశ్రితకల్పభూజుఁడు అనుబిరుదములు ధరించిన భూజానినిజభక్తుఁడగు! సేవకుని కష్టపరంపర మారమొనరించి రక్షించినచో, నాతఁడీక వేదనారహితముగ గొంతకాలము జీవయాత్ర నలుప ననువగు. రక్షింపనిచో సేవకుఁ డభాగ్యుఁ డని

చూరుచు, భగవంతుఁడు భక్తజనక్లేశాపహారణ సమర్థుఁడని ప్రకటించుచు నీ బ్రాహ్మణసేవకుఁడొనర్ప నెంచిన కార్యావశేషము (ధర్మరాజ్యప్రసారమూలకముగ స్వధర్మసంరక్షణము) ను తాము స్వయముగఁ బరిగ్రహించి పూర్తి యొనర్చి శాశ్వతయశముఁ జూఱఁగొనుఁడు."

ఇయ్యది, బాజీరావుఋణగ్రస్తుఁడై, ఋణదాతలవలనఁ బెక్కుయిడుములఁ గుడిచినవాఁడని స్పష్టపఱచుచున్నయది.

### పాదుషాకృతసంధిప్రస్తావనము

మహారాష్ట్రసేనాసముద్రము పొంగి మాలవదేశము మొదలు, చర్మణ్వతీ (చంబల్) నదీతటపర్యంతము వ్యాప్తమయిన మోగలశాసితప్రదేశములను సంపూర్ణముగధ్వంసమొనరించి దుర్నిరీక్ష్య తేజోమండిత మయ్యెను.

అంత బాజీరావు నిజసైన్యము నిరుభాగములుగ విభజించి యొకభాగమును హోల్కారువశమున నిడి యాగ్రానగరమాక్రమించి యతిక్రమించుట కనిపెను వేఱొకభాగమును వెంటఁగొని తాను స్వయముగ డిల్లియాక్రమణమున కరుగుచుండెను. వర్ధితవిక్రమోపేతులగు మహారాష్ట్రుల రణతాండవమవలోకించి భయకంపితుఁడై పాదుషా తనప్రధానమంత్రియగుఖాన్‌దౌరానుబాజీరాయనికడకు సంధిప్రస్తావనప్రేరితునిగావించిపనిచెను. పాదుషా పరామర్శానుసరణి ఖాన్‌దౌరా, మాలవగుజరాతు దేశములలో చౌతుసర్‌దేశముఖీస్వత్వసంగ్రహణాధికారము పాదుషాహీసనదుపూర్వకముగ బాజీరాయునకు సమర్పించుటకు వాగ్దానమొసంగి చనియెను. కాని, పాదుషాయాధీనమున నున్నతురానీసర్దారుల ప్రతిబంధమువలన

ఖాన్‌దారా బాజీరాయునకు సనదుపత్రమును సమర్పించుట కసమర్థుఁడయ్యెను.

తురానీసర్దారులయుపదేశానుసరణి బాదుషా పూర్వ ప్రేరితసంధినియమములను తబ్బిబ్బొనరించి, చంబల్‌నదికి దక్షిణదిక్‌స్థితములగు మోగలశాసితప్రదేశములనుండి పదమూఁడు లక్షలరూప్యములును, పశ్చిమదిక్‌స్థితములగు బూందీకోటాప్ర భృతిపూర్వదిక్‌స్థితమగు బుధావరుపర్యంతము వ్యాపితములగు సమస్తరాజపుత్రసంస్థానములనుండి పదిలక్షలయిరువదివేల్ల రూప్యములను ప్రతివత్సరము మాల్గుజారీరూపకముగ గ్రహించు నధికారమును మహారాష్ట్రపతికి నొసఁగుటకు ప్రస్థితుఁడయ్యెను.

మాల్గుజారీసంబంధాదాయ సంగ్రహణసందర్భములో మహారాష్ట్రరాజపుత్రవీరులు పరస్పరము విరోధులై యొండొరులు దలపడి నిస్తేజు లగుదు రనియు, అందువలన ముసల్మానులు తమప్రనష్టగౌరవసామ్రాజ్యములను బునరుద్ధారణ మొనర్చుకొనుట కవకాశ మలవడుననియుఁ దలఁచి తురానీసర్దారులీనూతననియమప్రస్తావనముఁ బాదుషా కుపదేశించి యుండఁబోలు!

సంధివిషయికపేష్వాప్రస్తావన.

డిల్లీదర్బారుస్థితమహారాష్ట్రదూతముఖమున నీనూతన సంధినియమములను వినినంతనె, రాజనీతిధురంధరుఁడగు పేష్వా బాజీరావు, పాదుషాతురానీసర్దారుల కృత్రిమమండిత గూఢాభిసంధానమును చక్కగ గ్రహించి, తత్ప్రస్తావనఁ బ్రత్యాహార మొనర్చి, మహారాష్ట్రాధిపునకు

1. సమగ్రమాలవమును జాగీరురూపముగ సమర్పింపవలయు.

2. మాలవములో రోహిలాశాసనాధికారమున నున్న ఖండవిఖండములను సంపూర్ణాధికారస్వత్వములతో సమర్పింపవలయు.

3. మాండూ, ధార్, రాశీర్ అనుదుర్గత్రయమును సమర్పింపవలయు.

4. చంబల్ నదికి దక్షిణమున నున్నయావత్ప్రదేశము సర్వస్వతంత్రాధికారముతో జాగీరుగ నొసంగవలయు.

5. ప్రస్తుతయుద్ధసంబంధమగు వ్యయమునకుఁ గాను ఏబదిలక్షలరూప్యములనైనను లేదా, వంగదేశములో నొకభాగమైనను సమర్పింపవలయు.

6. వారాణశి, ప్రయాగ, గయ, మధుర యనునాలుగు పుణ్యక్షేత్రములశాసనాధికారమున మహారాష్ట్రపతి బ్రతిష్ఠింపవలయు

7. దక్షిణభారతములో 'సర్ దేశపాండే' యనుపదవియందు మహారాష్ట్రాధిపునిఁ బ్రతిష్ఠింపవలయు.

అనునియమములను దూతముఖమున బాదుషాదర్బారునందు పేష్వాయుపపాదన మొనర్చెను.

పేష్వా యుపపాదన మొనరించిన పైనియమములో నొక్కటియైనను ఫలోన్ముఖ మందుట లేదు. వజీరాజమ్ ఖాన్ దారా రహస్యముగ బాజీరాయనిపక్షమవలంబించి ఆఱులక్షల రూప్యముల నుత్కోచముగ గ్రహించి, పాదుషాహీ సన్నదు

పూర్వకముగ సర్ దేశపాండేపదాధికారమును మాత్ర మర్పించెను.

—సర్ దేశపాండే.—

ఈనూతనప్రదత్తస్వత్వానుసరణముగ మహారాష్ట్రపతికి నిజాము శాసితప్రదేశములలోని సమస్తాదాయములలో ప్రతి వత్సరము నూటికి అయిదురూప్యములవంతున (అనఁగా కొంచెమించుమించు తొంబదిలక్షలరూప్యములు) చేకొనునధికారము ప్రాప్త మయ్యెను.

కూటనీతివిశారదుఁడగు పేష్వాబాజీరావు, నిజాము శాసితప్రదేశములలో మహారాష్ట్రప్రభుత్వవిస్తరణమున కలవడిన సుయోగముఁ బరిత్యజించుట సమంజసము కాదని తలఁచి వజీరాజమ్ కోరినప్రకార మాఁగులక్షలరూప్యములను మూల్యముగ నొసఁగి సర్ దేశపాండేపదవిఁ గైకొనియెను.

ప్రథమమునుండియు నిజామునకును, వజీరాజమ్‌ఖాన్ దొరాకును మనోమాలిన్య మంకురించి పెరుఁగుచుండినకతమున, వజీరాజమ్ నిజామును నవమానితునిగఁ జేయనెంచి కాబోలు, బాజీరాయనికడనుండి యాఱులక్షలరూప్యములు లంచముగొని మహారాష్ట్రపతిని దక్షిణభారతములో సర్ పాండేపదమునఁ బ్రతిష్ఠించెను.

మహారాష్ట్రపతికి పాదుసాహీ సనదుపూర్వకదక్షిణ భారతసర్ దేశపాండే పదాధికారప్రాప్తసంఘటనము పేష్వా బాజీరాయనియెడ నిజామునకుఁగలపూర్వక్రోధవిద్వేషములు మఱింత బలియుటకు కారణభూతమై విరోధభావమును ద్విగుణ మొనర్చెను.

## పేష్వాయుద్ధాభియానము.

నిజకృతసంధిప్రేరణ ప్రస్తావనము బాదుషాదర్బారు నందు పూర్ణముగ పరిహరింపఁబడినసంవాద మాద్యంత మా లించినంతనె పేష్వాబాజీరావు, క్షుధితమృగేంద్రముంబోలె, క్రోధోద్దీపితుఁడై, తనసంకల్పమును దండనోపాయావలంబ మున సాధనసిద్ధిఁ బడయుటకుఁ గృతనిశ్చయుఁడై, డిల్లీయాత్ర మునకు బయలువెడలెను.

## పాదుషా నిజాముసహాయ మభిలషించుట.

మహారాష్ట్రాభియానవృత్తాంతమును వినినంతనె, పాదు షా విగతధైర్యుఁ డయ్యెను. బాజీరాయునివర్ధితవిక్రమము, రణకౌశలము, నిరంతరవిజయములు డిల్లీశ్వరునిధైర్య మపహ రించినందున నాతఁ డాత్మరక్షణోపాయాన్వేషణుఁడై మంత్రి వరులమంత్ర మభిలషింపఁ జొచ్చెను. అంత పేష్వావివాసన మభిలషించుచున్నమంత్రివరులు, నిజామునహాయ మభిలషిం చుట కర్తవ్య మని పాదుషా కుపదేశించిరి. పాదుషా మంత్రు లయుపదేశమును గైకొని, నిజాముకడకు భ్రాతృవాత్సల్యముఁ బ్రకటించుచు, పూర్వకృతాపరాధములను సైరించి ప్రకృత భీషణమహారాష్ట్రాభియాననిరోధోద్యోగమందు సంపూర్ణస హాయ మొసంగవలయు నని యొకప్రార్థనాపూరితపత్రమును లిఖించి పనిచెను. నిజాము పాదుషాహీపత్రముఁ జేనందుట తడ వుగ మహారాష్ట్రనాశనకౌతుకలాలసుఁడై విపులసేనాసహిత ముగ పాదుషాసహాయార్థము డిల్లీనగరాభిముఖుఁడై బయలు వెడలెను.

## పాదుషాపేష్వాల ప్రథమయుద్ధసంఘర్షణము.

ఢిల్లీసామ్రాజ్యసంరక్షణాతత్పరత్వమున సైన్యసహితముగ నిజా మరుదెంచుచున్నవాఁ డనువార్త నాలించి, పేష్వ బాజీరావు క్రీ. శ. 1734-వ సం॥ రములో, భారవాహకములగు యుద్ధోపకరణములను బుందేలుఖండశాసనకర్తయగు జగత్సింహునివశమున నిడి, తాను శీఘ్రగామియగు యాశ్వికసైన్యమునుమాత్రము వెంటఁ గొని మొగలాయీరాజధాని నాక్రమించుటకు బయలుదేఱెను.

మహారాష్ట్రగతి నిరోధమునకునై, వజీరాజమ్ఖాన్ దౌరా పాదుషాహీసైన్యమును వెంటనిడుకొని ఆగ్రానగరమున నుపస్థితుఁడై యుండెను. అయోధ్యాసుబేదారు సహాదత్ ఖాన్ కొంతసైన్యముతో రహస్యముగఁ జని నాగ్రాసన్నికటమున నాకస్మికముగ మహారాష్ట్రసైన్యముఁదలఁపడెను. ఈయాకస్మికగుప్తాక్రమణమువలనఁ గతిపయమహారాష్ట్రసైనికులు నిహతులగుటఁ గనుఁగొని తత్సేనాని యగు మల్హారురావుహోల్కరవసరానుగుణముగ వెనుకంజనిడుచు యమునానదినుత్తరించె. ఈక్షుద్రసంఘటనము, పూర్ణవిజయముగఁ దలంచి, సహాదత్ ఖా నానందాంబుధినోలలాడుచు "నేను నానిరుపమబలపరాక్రమములను బ్రకటించి శత్రువాహినిలోని సహస్రసంఖ్యాకులగు సైనికులఁ బరిమార్చి యొకసుప్రసిద్ధసేనాని రణరంగమునకు బలియొసంగితిని. బాజీరాయనిరెండవప్రాణమని పేరువడసిన మల్హారురావును క్షతశరీరుఁడై, రణరంగమును వీడి పరుగిడఁ జేసితి. పరుగిడునపుడు కూడ నాతనివిడువక చంబల్ నదినిదాఁటు పర్యంతము వెన్నంటి, యాతనిసైనికులను రెండువేల కధిక

ముగఁ బరిమార్చితి" అని యొకపత్రమును లిఖించి పాదుపా సమ్ముఖమున కనిపెను.

ఈమిథ్యావిజయసూచకపత్రముఁ బఠించి, పాదుపా యానందనిమగ్నుఁడై పరవశుఁడుగాఁ జొచ్చెను. దర్బారునం దానందశ్రోత ముప్పొంగి పాథోధిఁ బురడింపఁజొచ్చెను. పాదుషాయాధీనములోని సామంతరాజులు విజయోత్సవముల నొనరించుచు, పేష్వా చూర్ణితదర్పుఁ డయ్యెనని మురియఁజొచ్చిరి. పాదుసాహీమంత్రివర్గము దర్బారులోని మహారాష్ట్రదూత నవమానితుఁ జేసి వితాడితుఁ గావించె.

## సంధిప్రస్తావన.

ఈయఘటితఘటనావిఘటితమగు హోల్కరుపరాజయ సందర్భమందు బాజీరావు రాజపుత్రస్థానములో నుండెను. ఆతఁడు, రాజపుత్రరాజులను వశమొనర్చుకొని బుధావరరాజును పరాస్తునిఁ గావించి యందు నిజాధిపత్య కరగ్రహణాధికార విస్తరణముఁ గృతకృత్యుండై నిజసేనానిఁ గలియుసంతసమున నరుదెంచుచుండ, మార్గమధ్యమున నుల్హారరాయని పరాజయ మాతనికర్ణపుటమునఁ బడియెను. ఈసంవాదము పేష్వాకర్ణపుటమున శూలమువలె సోకినందున నాతఁడు క్రోధోన్మత్తుఁడై వాయువేగముగ నరుదెంచి డిల్లీనగరమునకు నికటవర్తి యయ్యెను. అంత మహారాష్ట్రదూత పాదుపాహీమంత్రివర్గముచే నవమానితుఁడయ్యె ననువేఱొండువిషాదసంవాద మాతనికి కర్ణగోచరమై యాతనిక్రోధము నినుమడింపఁ జేసెను. ముసల్మాను నొనరించినయీదుర్ణయమునకుఁ బ్రతీకారముగ, బాజీరావు "మొగలసామ్రాజ్యాధిష్ఠానస్థానమగు డిల్లీనగర

మును ప్రచండాగ్నిజ్వాలల కాహుతి జేసి భస్మీభూతము గావించు" నని ఘోషణ మొనరించెను. బాజీరాయని యాభీషణ ఘోషితఘోషణము డిల్లీనివాసులను త్రాసగ్రసితులను విహ్వలదేహులను గావించి, యాక్రోశ మొనరింపఁ జేసెను. బాజీరావు నిజఘోషణానుసరణేఁ బ్రప్రథమమున డిల్లీనగరము దోఁచుకొని యనంతరము హుతాశనదేవున కగ్రస్థాన మొనరించెను.

బాజీరావు కేవలమాక్రమణనిష్ఠురతా పక్షపాతమునే గ్రహియింపక, పాదుషాహీ గౌరవసంరక్షణవిచక్షణత్వముఁ గూడఁ బూనినవాఁడు. అందువలన నాతఁడు బాదుషాసమ్ముఖమున సంధిపూరితప్రస్తావనము ప్రేరణ మొనరించెను.

### మొగలాయీపరాజయము.

క్రీ. శ. 1734 సం॥ మేయి తే1దీని పేష్వాబాజీరావు డిల్లీదర్బారునందు మహారాష్ట్రదూతను పునఃప్రతిష్ఠాపనమున కంగీకరింపవలయు నని బాదుషాను నిరోధించెను; కాని ఆకాలపురాజనీతి వ్యవస్థాపరివర్తనముఁ బరికించి యాతఁడు డిల్లీదర్బారునందు దూతనునుచుట సమంజసము గాదని నిశ్చయించుకొనెను.

బాజీరాయనికృతసంధిప్రస్తావనము పాదుషా కంగీకృతమయినను మంత్రిసామంతసర్దారువర్గమున కనిష్టమయి తిరస్కరింపఁబడియెను. అయోధ్యానుబేదారుసహాదత్ ఖాను సమరలిప్సుఁడై కాలు ద్రవ్వుచు నాగ్రానగరమున వేచి యుండెను. అందువలన బాజీరావు, యుద్ధమొనరింపకుండఁ దనయభిమతమీడేరుట దుర్లభమని సిద్ధాంత మొనరించి,తా విడిసియున్న

స్థానము యుద్ధమున కనుగుణ్యమయినది కానందున తత్ప్ర
దేశమును వీడి ఢిల్లీనగరమున కీశాన్యభాగమం దున్నయొక
విశాలప్రదేశమున కేగి యందు శిబిర మేర్పఱచెను.

సంధిప్రేరణప్రస్తావుఁడును, నిర్గళితపూర్వస్థానుఁడును
నగు బాజీరాయనియాచరణముఁ బరికించి, యాతఁడు భీతచిత్తుఁ
డయి వెనుకంజనిడె నని పాదుషాయును, ఆతనిమంత్రిసామంత
సర్దారులు నిర్ధారణమొనరించి, మహారాష్ట్రశిబిర మాకస్మిక
ముగ నాక్రమించిరి. ఈయాక్రమణమునకు బాజీరావు మిగుల
క్రుద్ధుఁడై క్షణభరమున నాఱువందలసైనికులను నొకసేనానిని
రణరంగమునకు బలియొసఁగి వేఱొకసేనానిఁ బంద్రెండువందల
సైనికులను క్షతశరీరులఁ గావించి విజృంభించెను. బాజీరాయని
ప్రళయకాలరౌద్రాకారముఁ దిలకించి, మిగిలినవారు వెఱ
గొంది, హాహాకారముల నొనర్చుచు ప్రాణరక్షణోపాయావలం
బులై రణరంగమును వీడి పరుఁగువాఱిరి. ఈసందర్భమందు
పాదుషాయొక్క యొకరణదిగ్గజమును, రెండువేలరణశిక్షిత
యుత్తమాశ్వములును బాజీరాయనివశమయ్యెను. పేష్వా తన
రణనైపుణ్యమువలన స్వల్పసంఖ్యాకులగు సైనికులను మాత్ర
మీసంఘర్షణమునఁ బోగొట్టుకొని పూర్ణవిజయముఁ జేకొని
యెను.

### సంధిస్థాపనము.

మొగలాయీసర్దారులతోడి పోరాటములోఁ బూర్ణవిజ
యమును వడసిన బాజీరాయున కొకక్షణమయినను విశ్రామ
మలవడనీక, కమరుద్దీనను వేఱొక మొగలాయీసేనానాయకుఁ
డాతని నాక్రమించెను. బాజీరావు విచలితుఁడు కాక కరాళ

కరవాలముధరియించి శత్రుసైన్యముం జించి చెండాడె. ఇరు కక్షులవారికిని ప్రబలయుద్ధము సంఘటితమయ్యెను. అంతట సూర్యభగవానుఁడు అస్తాచల మతిక్రమించి చనుటవలన ఘోరాంధకారము పిల్లుబ్బి యిరుతెగలవారిని స్వపక్షపరపక్ష వివక్షణాశూన్యులఁ గావించి విశ్రామగ్రహణమునకుఁ బురి కొల్పెను. కాని యంధకారాధికారమునకు లోనుగాక, బాజీ రావు, మోగలసేనాధిపతిని సైన్యసహితముగ నానిశాసమయ మున నవరుద్ధునిఁ గావింప సంకల్పమూని తదనుగుణయత్న మొనరించెను. కమరుద్దీను విడిసియున్నశిబిరము పదునాలు క్రోశములపరిమితి గలవిశాలప్రదేశమం దేర్పడియుండుటచే బాజీరా వీయత్నమందు సఫలుఁడు గాకపోయె.

అంతట ఖాన్‌దౌరాయును, సహాదత్‌ఖానును నాగ్రా నగరమునుండి యరుదెంచి కమరుద్దీనునకు బాసట యైరి. అందు వలన బాజీరావు వేఱొకనిరాపదస్థానమున కేగి శిబిర మేర్ప ఱచుకొనియెను. ఇరుకక్షులవారికిని మరల సమరసంఘటనము సంఘటితమయ్యెను. అందు బాజీరాయనిప్రతాపమునకు మొగ లాయీలు ఎదు రోపనశక్తులైరి. ప్రథమయుద్ధముననే బాజీ రాయని కోడి పలాయనులైనమొగలాయీసేనాధిపతులును వజీరాజమ్‌ఖాన్‌దౌరాయును ఇఁకముందాతనితో యుద్ధమొన రించి విజయమును బడయుట యసంభవమని నిశ్చయించి, రణ పరాఙ్ముఖులై, పాదుషాపక్షమున బాజీరాయనితో సంధిబం ధనప్రస్తావమునకుఁ గడఁగిరి. ఈయవకాశ మాధారముగఁ గొని బాజీరావు గంగాయమునానదుల యంతర్వేదియందు

మహారాష్ట్రాధికారమును నెలకొలుప యత్న మొనరింపఁ జొచ్చెను.

సాహూసందేశము.

ఆసమయమందు కొంకణస్థ బుడతకీచుగణము (Portuguese) ప్రాబల్యముఁగొని తద్దేశీయులఁ బీడింప నారంభించెను. అందువలన, బుడతకీచుదమన మత్యావశ్యకమైన దైనందున సాహూ, బాజీరాయునకు సత్వరముగ సితారానగర మరుదేర సందేశ మునిపెను.

స్వదేశగమనము.

సాహూసందేశముఁ గైకొని, బాజీరావు పాదుపాతో సంధిసంస్థాపన మొనరించి, యథాసంభవముగ త్వరితగామియై సితారానగరమున కరిగెను.

ఈసంధిసంస్థాపనమువలన, మహారాష్ట్రాధిపునకు, మాలవదేశములో నేకచ్ఛత్రాధిపత్యమును, యుద్ధవ్యయములకుఁ బదుమూఁడులక్షలరూప్యములు ప్రాప్త మయ్యెను.

---

## తొమ్మిదవప్రకరణము.

---

ఢిల్లీలోనిసమాచారము.

ఇంతకుఁ బూర్వము చేసాప్బాజీరాయనిఁ బరిభవించి మహారాష్ట్రప్రతాపమును మాయింప ఢిల్లీశ్వరుఁడు సమకట్టి యుండెను. ఈమహాకార్యమునకు నిజాముల్ముల్కు సేనా

సహితముగ నాహవసీయుఁడై యుండెను. నిజాముల్ ముల్కు బాజీరాయనితో నొనర్చినపూర్వనియమిత సంధినియమముల నుల్లంఘించి యీతనికిఁ బ్రతిఘటించుటకంగీకరించుటకుఁగాను నిజాముకొమరునకు నవాబు అనుయుపాధి నొసంగి, మాలవ గుజరాతుదేశములకు సుబేదారుగ నియోగించి పాదుషా స్వత్వపత్ర మొసంగెను. పాదుషా ప్రార్థనానుగుణముగ నిజాము సేనాసహితముగ ఢిల్లీనగరమున కరుదెంచుటకుఁ బూర్వమే, బాజీరాయనిప్రతాపాగ్నిజ్వాలలు నగరముఁ జుట్టుముట్టి పాదుషాహీ ప్రతిష్ఠ భస్మీభూత మొనరించినయవి.

నిజామునకు నర్మదానదిదాఁటుట కవకాశ మలవడనీక నిరోధింపవలసిన దని బాజీరావు తనసోదరుని నియోగించెను. కాని, కొంకణమందు బుడతకీచు లుపద్రవ మాపాదించుచుండినకతమున నాతఁ డావంకకు మరలవలసినవాఁ డయ్యెను. అందువలన నిజాము నిర్విఘ్నముగ నర్మదానది దాఁటి ఢిల్లీనగర మరుదెంచి పాదుషాను సందర్శించుటకు సమర్థుఁ డయ్యెను. నిజాము ఢిల్లీనగరమున కరుదెంచినపిమ్మట ముసల్మానుకులకళంకి యగు పాదుషా పేష్వాతో నొనరించినసంబంధమును మఱచియో లేక మంత్రులబంధకమున కెదురాడనేరకయో యొక మూలవైచి, పాదుషాహీప్రతిష్ఠకు దిలాంజలి నొసంగి, నిజామును మహారాష్ట్రులతో యుద్ధ మొనరింపఁ బురికొల్ప నారంభించెను. రాజపుత్రస్థానమందలిరాజమహారాజుల నందఱకును సైన్యయుతముగ నరుదెంచి నిజామునకు సాహాయ్య మొసంగవలసినదని కఠినముగ నాజ్ఞ నిడియెను.

పాదుషాయాజ్ఞమేరకు బూందీనరేశుఁడు తప్ప తదితర

రాజమహారాజులందఱు సైన్యసహితముగ నరుదెంచి నిజాము
నకు బాసటయైరి. జయపురాధీశ్వరుఁడు జయసింహుఁడు కూడ
తనకొమరునినిజామునకు సాయపడఁబనుపవలసినవాఁ డయ్యెను.

### నిజాము మాలవగమనము.

పాదుషాప్రేరణానుసరణముగ శూరసామంతసర్దారు స
హితమగు నొకబృహత్సైన్యమును వెంటఁగొని నిజాము మహా
శయుఁడు మాలవములో బ్రవేశించెను. ఆసమయమున నాతని
కడ నేఁబదివేలసైనికులు కలరు! కోటాప్రదేశాధిపతి దుర్జయ
సాలుఁడును, అయోధ్యానవాబు పెదతండ్రికొమరుఁడును చేరి
యిరువదివేలసైనికులతో మాలవమున కరుదెంచి నిజాము
పక్షము గ్రహియించిరి. ఔరంగాబాదునందు పదిపండ్రెండు
వేలమొగలసైనికులు బాజీరావుమార్గమును నిరోధించుటకు
సర్వసిద్ధులై యుండిరి. అంతియకాక నిజాముమహాశయునిఫిరం
గులు (Artillery) యుత్కృష్టమై సుసజ్జితమై వఱలుచుండె.*
ఢిల్లీనగరమును వీడి మాలవమున కరుదెంచెడి సమయ
ములో నిజాముబహదూరు, పాదుషాసమ్ముఖమున "ఇఁక ము
న్నెన్నఁడును మాలవముమహారాష్ట్రులపదార్పణమున కాకరము
కాకుండఁ జేయుదు" నని దృఢప్రతిజ్ఞఁ గైకొనినవాఁడు.

### బాజీరాయనిసమరసన్నాహము.

మహారాష్ట్రులతో యుద్ధ మొనర్చుటకు నిజాము మాల
వములో వేచి యుండె ననువిషయమును బాజీరా వాలించి,

---

* నిజాముయొక్క సమగ్రసైనికసంఖ్యావివరణము లక్షపరిమితిఁ గలి
గియుండెనని చిమణాజిఅప్పా క్రీ. శ. 22-12-1737 తేదీని శ్రీమద్బ్రహ్మేం
ద్రస్వాములవారికి వ్రాసినయుత్తరమువలనఁ దెలియుచున్నది.

యతిత్వరితగతి నెనుబదివేలసైనికులను సంగ్రహించి, నర్మ దానది నతిక్రమించి మాలవమున కభిముఖుఁడై చనియెను.

క్రీ. శ. 1738 సం॥ రము జనవరినెలలో నిజామునకును బాజీరావునకును యుద్ధము విఘటిత మయ్యెను. ఈసారి నిజా మునకుఁ దగినశిక్ష విధింపవలయునని బాజీరావు కృతప్రతిజ్ఞుఁ డయ్యె. కాని యత్యంతత్వరితగతిఁ జనుదెంచుటవలన నితాం తపరిశ్రముండై యొక్కపరి నిజాము నాక్రమించుట కసమర్థుఁ డయ్యెను.

నిజాముల్ ముల్కు ప్రథమముననే బాజీరాయనిఁదలపడి యాక్రమించి యుద్ధ మొనరించినచో బాజీరావు విజయమును వడయుట కష్టసాధ్యమును నసంభవమునునై యుండెడిది. కాని నిజా మంతటిధైర్యమును సాహసమును బూననేరక బాజీరా యనిఁ దలపడుటకు వెనుదీయుచు భూపాలదుర్గసమీపమందు శిబిర మేర్పఱుచుకొని యాతనిరాక కెదురుచూడఁ జొచ్చెను. నిజాముశిబిరమునకు మూఁడుప్రక్కల నొకప్రవాహము నర్ధా కారముగఁ జుట్టిముట్టి ప్రవహించుచుండెను. నాలవప్రక్క నొకవిస్తీర్ణజలాశయము విరాజిలుచుండెను. ఈజలాధారము ల నడుమనుండుప్రదేశము సుదృఢముగను, శత్రుదుర్భేద్య ముగను దలఁచి, యద్దానినిశిబిరస్థానముగఁ జేకొని నిజాము నం తసింపఁ జొచ్చెను.

—⁂ బాజీరావునిజాముల సమరసంఘర్షణము. ⁂—

నిజాముబహాదూరు, తన కీసమరమునఁ బూర్ణవిజయ ములబ్దునను నిశ్చయాభిప్రాయముఁ బూనియుండెను. కాని

యాతని వివేచనాశూన్యతయే సర్వనాశనమునకు ముఖ్యకారణమై యాతనియభిప్రాయమునకు విరోధ మొడఁగూర్చెను.

ప్రథమయుద్ధములో నిజాముసైన్యములోని నైదువందలరాజపుత్రసైనికులు వీరశయ్య నలంకరించిరి. అంతకు ద్విగుణితముగ క్షతశరీరులై నిరుపయోగు లైరి. ఏడువందల యుత్తమాశ్వములు బాజీరాయనివశ మయ్యె. బాజీరాయని పక్షమున నూఱుగురుసైనికులు నిహతులైరి. మూఁడువందల సైనికు లాహతు లైరి.

రెండవయుద్ధములోనైజాముపక్షమందు పదునైదువందలసైనికులు నిహతులైరి. వేలకొలఁది సైనికులు క్షతశరీరులై తమమర్మభేదార్త్యార్తనాదములచే శిబిర మాలోడన మొనర్పఁ జొచ్చిరి.

శిబిరస్థానముఁ బరిత్యజించి తత్ప్రాంతప్రదేశమునకు నిజా మరుదెంచినచో నాతనిఁ బరాజితుఁ గావింప ననువగునని తలఁచి బాజీరావు తనసైన్యనివహంబు నించుక వెనుకకు మఱలించెను. కాని నిజాముమాత్రము భూపాలదుర్గమును వీడక యథాప్రకారముగ నిలిచి యుండెను. అంత బాజీరావు నిజాము శిబిరమును నలువంకల నాక్రమించి, ఫిరంగులచే గుండ్లవర్షము గురిపించుచు సైన్యోపయోగములగు గజాశ్వగోవృషభశకటాస్త్రశస్త్రాదులను ఖాద్యపదార్థములఁ గొన్నిటిని ధ్వంసమొనరించి, కొన్నిటిని వశ మొనర్చుకొనెను. నిజామును పంజరబద్ధునిఁ గావించెను. మహారాష్ట్రవ్యూహమునఁ జిక్కువడి యవరుద్ధుఁడగుటఁ దిలకించి మిగుల పరితపించుచు, నిజాము, తన కలవడినప్రస్తుతదుర్గతిఁ దెలుపుడు చేయుచు, యుద్ధోపకరణ

ములను ఖాద్యపదార్థములను సైనికులను నొసంగి సాయపడ వలసినదని మిగుల ప్రార్థించుచు డిల్లీపాదుషాకడ కొకపత్ర మును లిఖించి పనిచెను.

వజీరాజమ్ ఖాన్ దౌరాకును, పాదుషాకును నాంతరి కవిద్వేష మంకురించి ప్రబలుచుండినకతమున నిజాముల్ ము ల్కు ప్రార్థనము వ్యర్థమయ్యెను. అయోధ్యానవాబు పాదుషా యాజ్ఞానుసరణముగ నిరువదివేలసైనికులను వెంటఁగొని నిజా ము సహాయార్థము బయలువెడలెను. కాని మార్గమధ్యమున దాతఁ డెంవడగియుండెనో యెఱుకపడదు. పాదుషాహీసహాయ మలవడమిఁజేసి, నిజాముపక్ష మవలంబించి యురుధించినరాజ పుత్రులతనిపక్షముఁ బరిత్యజించి చని బాజీరాయని శరణుఁ జొచ్చిరి.

## బాజీరాయనివిజయము.

ఈవల ఖాద్యాద్యత్యావశ్యకపదార్థాభావమువలన నిజా ము సైన్యసహితముగ మిగుల కష్టముల ననుభవింపవలసి వచ్చెను. తనతండ్రి కలవడినదుర్గతికి మిగులఁ జింతిలుచు నాతని సహాయార్థము సైన్యసహితముగ నాజర్ జంగు భూపాలమున కభిముఖుఁడై చనుదెంచుచుండెను. ఈ సమాచారమును బాజీరా వాలించి, తన్నిరోధార్థము తనసోదరుని నియోగిం చెను. తనసోదరుని యాదేశానుసరణముగ చిమణాజీ అప్పా నాజర్ జంగున కెదురేగి యాతనిమార్గమున కవరోధముఁ గలి గించెను. పుత్రునిసహాయ మలవడుట కలవడినయుద్ధంకిఁ గని నిజా మీాస్వాపరతంత్రుఁడును మత్సరగ్రస్తుఁడును నై యొక్క సారి విజృంభించి బాజీరావు పన్నినయువరుద్ధవ్యూహమును

ఛేదించి వెలువడుటకు మిగుల యత్నమొనరించె; కాని, యీర్ష్యోన్మాదము మత్సరోద్రేకమును ఫలభరితములు కానేరవు కదా! నిజాము నలువుప్యూహచ్ఛేదనయత్నసమయమున మహారాష్ట్రులు చూపిననిరవక్రపరాక్రమమున కాతఁ డెదురోపనేరక పెక్కువేలసైనికులను రణరంగమున కర్పించి, యుద్ధోపకరణములను విడనాడి ప్రాణావశిష్టుఁడై భూపాలమునకుఁ బరుఁగిడియెను.

దుర్గమును ఛేదించుట కనువగు సాధనసంపత్తి బాజీరాయనికడ లేకపోయినను, అతఁడు నిజప్రతాపానలజ్వాలల నలుగడల వ్యాపింపఁజేసి దుర్గరక్షకులను నేలకుఁ గోలకుఁ దెచ్చుచు నెటు చూచిన తానయై ప్రవర్తింపఁజొచ్చెను. బాజీరాయని నిష్ఠురపరాక్రమముఁ బరికించి నిజాము జర్ఝరితుఁడై తనయాశ్రయముఁ బరిత్యజింపవలసినవాఁ డయ్యెను.

ఈఘోరయుద్ధమువలన ఫలియించినభయానకఫలములను నిరంతరము మిక్కుటముగ మెసవుచుండిన నిజామునకు రణాజీర్ణరోగ మంకురించి, దినదినము ప్రబలమై యాతనిస్వాస్థ్యమునకు భంగ మొదఁగూర్చెను. ఈప్రబలరోగమువలన నాతఁ డిరువదినాలుగుదినములు మిక్కుటముగఁ బీడింపఁబడి, పలుకష్టములకు లోనై వివశుఁడై చేయునది నేరక బాజీరాయునకు శరణాగతుఁడై యాతని పదవనజంబుల వ్రాలి, యాతని కటాక్షవీక్షణములకుఁ బాత్రుఁడై యాతఁడు ప్రసాదించిన కారుణ్యామృతముఁ గ్రోలి స్వస్థచిత్తుఁ డయ్యెను.

నిజామునహాయమున కరుదెంచుచున్న నాజర్‌జంగు మార్గమును నిరోధింపఁ జిమణాజీ అప్పాను నియోగించుపంద

ర్భమున నాతనికి బాజీరావు వ్రాసినయుత్తరములో "నిజాముల్ ముల్కు వయోవృద్ధుఁడు, సమరవ్యాపారానుభవజ్ఞుఁడు. విజ్ఞానసంపన్నుఁడు. దూరదృష్టిగలవాఁడు. అయిననేమి? చేఁజిక్కినవాఁడు. ఆతఁడీవిధముగ చేఁజిక్కునని నేను స్వప్నమందైనఁ దలఁచుటలేదు. విపులసేనాసంపన్నుఁడగునిజా మీవిధముగ నచిరకాలములో నవరుద్ధుఁడైన విషయము నాహృదయమునకు విషాదమును, విస్మయమును గొలుపుచున్నయది. పూర్వము వంగాధీశునికలవడిన దారుణదుర్గతియే యిపుడు నిజామునకుఁ గూడ నలవడినయది. శిబిరమును నరికట్టిననాలవ దినముననే యందుకూష్యమునకు నాలుగుసేరులగోధూమపిష్ట మలవడుట దుర్ఘటమయ్యెను. జంతుసముదాయ మాహారమలవడమి నార్తనాదములచే మనుజులహృదయముల దహింపఁజేయఁ జొచ్చెను. మొన్నటినుండియు, (6-1-1738) మొగలపఠానుసైనికు లాహార మలవడమి నద్దెబండ్లయెద్దులను వధించి తన్మాంసమువలన క్షుధానలముఁ జల్లార్చుకొనుచున్నవారు. రాజపుత్రులు నిరాహారులై మలమల మాడుచున్నవారు. అయామల్లు మొదలుగాఁగల జాటుసర్దారులు నిజాముతో సంధియొనరించి యాతని భ్రాతృవాత్సల్యమునఁ బరిగ్రహింపు మని నన్ను నిరోధించుచున్నవారు."

"నీవు సాధ్యమయినంతవఱకు సైన్యమును సంగ్రహించి, దాభాడే, భోసలా, యాదవ్, గాయక్వాడ్, సర్లష్కరు మొదలుగాఁగల దాక్షిణాత్యసర్దారులను వెంటఁగొని త్వరితగతిని రావలయు నీసమయములో సమస్తసామంతసర్దారుసమూహ మేకమతమున సమవేతమై యధ్యవసాయము

ప్రకాశ మొనరించినచో, దక్షిణభారతము సంపూర్ణముగ ముసల్మానుశాసనపాశబంధమునుండి విముక్తి వడయగల దనుటకు సందియము లేదు" అని వ్రాసియుండెను.

భారతభూమి, అందు విశేషముగ దక్షిణభారతము, దౌర్భాగ్యమునకు లోనై, బాజీరాయనియెడ నంకురించిన యీర్ష్యాపిశాచము దాక్షిణాత్యసామంతసర్దారుల హృదయసీమలఁ దాండవమాడుచు, ఛత్రపతి సాహూరాయా దేశముననైనను దొలఁగి చననందున, ముసల్మానుశాసనమునుండి ముక్తి వడయనేరక పోయెను.

### సంధినియమములు.

మహారాష్ట్రులకు దక్షిణమందు బలదర్పితుఁడై, ప్రక్కలోనిబల్లెమువలె మెలఁగుచు బలవద్విరోధముఁ బూనియుండిన నిజాముల్ ముల్కు ఈఘోరసంగ్రామములో దారుణదుర్దశాగ్రసితుఁడై వీరేంద్రబాజీరాయునకు శరణాగతుఁడై సంధిసూత్రమున బంధింపఁబడియెను. ఈసంధినిబంధనమువలన, సమగ్రమాలవమును, నర్మదాచర్మణ్వతుల (చంబల్) నడుమ నున్న యావత్ప్రదేశమును నిజాముమహారాష్ట్రులకు సమర్పించి విలంబరహితముగ పాదుపాయనుమతిఁ గైకొని సువ్యవస్థాప్రబంధనిర్మాణమున సాయపడుటకును, ఏఁబదిలక్షలరూప్యములు యుద్ధవ్యయమున కుపహారముగ నొసంగుట కంగీకరించి క్రీ. శ. 7-2-1738 తేదిని, ఆతఁడు సంధిపత్రమును వ్రాసి బాజీరావునకు సమర్పించెను. ఇది మొదలు మాలవములో మహారాష్ట్రుల యేకచ్ఛత్రాధిపత్యము నిష్కంటకమై వఱలఁ జొచ్చెను.

ఈవిజయవృత్తాంతమును దెలుపుడుచేయుచు 8-2-1738

లేదీని బాజీరావు తనప్రియసోదరునకు వ్రాసినయుత్తరములో "చౌతునర్ దేశముఖులస్వత్వప్రదానమునకైన నంగీకరింపనొల్లని నిజాముల్ ముల్కు మాలవమును సంపూర్ణముగపరిత్యజించుట కంగీకరించుచు స్వహస్తలిఖితిస్వత్వపత్రమును (సనదు) సమర్పించెను. ఇందువలన గొలఁదికాలముక్రిందట పాదుషా ప్రదత్తస్వత్వపూర్వకముగ తనకొమరుని కలవడినసుబేదారీపదాధికారమును పరిత్యజింపవలసినవాఁడాయెను. మహారాజా సాహూజీతపోబలమువలనను, పూజ్యజనకుని పుణ్యఫలమువలనను ఈదుష్కరవిజయము సాధింపఁబడియెను. కానిచో, నద్వితీయప్రతిభాశాలియు, చతురమతియునై, సమగ్రరాజపుత్రవీరాగ్రేసరుల సహాయసంపత్తిఁ గలిగియున్ననిజాముల్ ముల్కునీసంగ్రామమునఁ బరాజితునిఁ గావించుట యసంభవ" మని వ్రాసియుండెను.

## బాజీరాయని సౌజన్యము.

శౌర్యసంపన్నుఁడును, విక్రమశీలుఁడును, ఉదారసాహసుఁడును నగుబాజీరావు బ్రాహ్మ్యధర్మమునకు వన్నెఁ దెచ్చినను దయార్ద్రహృదయుఁడగుటవలన రాజనీతి విచక్షణత్వమునందును, వీరచరిత్రమందును పెక్కుసందర్భములయందు కళంకముఁ బూనియున్నవాఁడు. మొత్తముమీఁద నాతని సౌజన్యము శ్లాఘాపాత్రమనుటకు సందియము లేదు వీరధర్మమున నడచువారు రాజనీతిఁ దలఁపరుగదా?

కోట్యధిపతియగు దుర్జయసాలుఁడు బాజీరావునకుఁ బ్రతిఘటించి నిజాముపక్షము గ్రహించినవాఁడు. బాజీరావు నిజామును బరాజితుని గావించినయుత్తరక్షణమున నాతఁడు

ముసల్మానుపక్షముఁ బరిహరించి సైన్యయుతముగఁ జనుదెంచి బాజీరాయనిపదపద్మంబుల వ్రాలి తనయపరాధమును మన్నింపుమని వేఁడుకొనియెను. శరణాగతవత్సలుఁడగు బాజీరా వాతని మన్నించి భాతృసమునిగ నాదరించెను. అంతియకాక,పూర్వము, దుర్జయసాలునియాధీనములోని సావారుగడమనుదుర్గమును ముసల్మాను లాక్రమించుకొనియుండిరి. హిందూసామ్రాజ్యవిస్తరణమునకుఁ గంకణము కట్టుకొనిన బాజీరా వాదుర్గమును లోఁగొని, 1738 సం॥ మార్చినెల ప్రథమభాగములో దుర్జయసాలునకు మరల నొసంగెను.

### డిల్లీలోనివిప్లవము.

మరుచటిసంవత్సరము, అనఁగా, క్రీ. శ. 1739 ప్రారంభమున డిల్లీనగరము విప్లవముల కాలవాలమైనయది. పరిషీయాదేశపుచక్రవర్తి యగునాదిర్‌షా కాబూలుదేశముజయించి యామార్గముగుండ డిల్లీపైకి దండెత్తివచ్చెను. ఆతనిదాడి నాపుటకుఁ దగినంతయత్న మొనరించుట కవకాశ మలవడక పోయినను యథాసాధ్యముగ డిల్లీశ్వరుఁ డెదిరించి యుద్ధ మొనరించెను. అందు డిల్లీశ్వరునిపక్షము గ్రహించిన నిజాముల్ ముల్కు పరాజితుఁ డయ్యెను. వజీరాజమ్ ఖాన్‌దౌరా నిహతుఁ డయ్యెను. అయోధ్యానవాబు సాదత్‌ఖాన్ చెఱ గొనఁ బడియెను. ఈవిధముగ నాయుద్ధఫలము విఫలమయినందున, బాదుషానాదిర్‌షా కమితధనము నొసఁగి యాతనితో సంధియొనర్చుకొని మైత్రి నెఱపెను. పిమ్మట నాదిర్‌షా కొంతకాలము డిల్లీపురమున నివసించియుండె. ఆకాలమందు పాదుషా సైనికులు నాదిర్‌సైనికులను గుప్తముగ నాక్రమించి

వధియింపఁజొచ్చిరి. ఈయాగడముఁ గని నాదిర్‌షా మిగుల కుపితుఁడై ఢిల్లీనగరవాసులను పెక్కువేలమందిని వధియించి నగరమును సంపూర్ణముగ దోఁచుకొనెను. ఈదోపిడియందు, జగద్విఖ్యాతములగు మయూరసింహాసనమును, కోహినూరు వజ్రమును నాదిర్‌షా హస్తగతము లయ్యెను.

ఉత్తరభారతములోఁ బడసినయైశ్వర్యములతో తనివి నొందక నాదిర్‌షా దక్షిణభారతమువంకకు తనలోపదృష్టిఁ బ్రసారించుచు తద్దైశ్వర్యముఁ గూడఁ జూఱఁగొన ననువగు యత్నమునఁ బ్రవృత్తుఁ డయ్యెను.

పేష్వా నాజర్‌జంగున కనిపినసందేశము.

నిజాముతో నొనర్చిన మాలవయుద్ధములో విజయముఁ జేకొని, బాజీరావు స్వదేశమున కరిగినవెనువెంటనే కొంకణస్థబుతడకీచులు బలదర్పితులై తద్దేశీయులఁ గట్టడులపాలుఁ జేసి క్రూరకర్ములై యొప్పారుచుండి రని విని, వారలదర్పమును చూర్ణ మొనరింప నం దరిగెను. అతఁడు బుడతకీచుల మద మడంచి తద్దేశవ్యవస్థానిబంధనమున చిమణాజీని నియోగించి, కార్యాంతరమున సితారానగరమున కరుదెంచెను. అంతట నాతనికి, నాదిర్‌షా, ఢిల్లీనగరములో సలిపినదుర్ణయమును, దక్షిణభారతవిజయోద్యోగాయోజనమును కర్ణగతమయ్యెను.

బాజీరా వీభీషణసంవాదమున కిసుమంతయుఁ జలింపక, ద్విగుణితోత్సాహియై నాదిర్‌షాను నిలువరించుయత్నమునఁ బ్రవృత్తుఁడయ్యెను. ఈసందర్భములో పేష్వా, నాజర్‌జంగుకడకు, "నాదిర్‌షా, హిందూమహమ్మదీయుల కిరువుర

కును బలవద్విరోధియై యున్నవాఁడు. అతఁడచిరకాలములో దక్షిణభారతముపై దాడివెడల నున్నవాఁడని జనశ్రుతి ప్రబలతమముగ వ్యాప్తమగుచున్నది. కాబట్టి, యీసమయములో మన ముభయులమును, మనకుఁ గలగృహవివాదములను స్మరింపక, యొక్కటిగఁ జేరి యావైదేశికుని నెదిరించుట యావశ్యకము, ప్రధానకర్తృకము" అని సందేశ మనిపెను.

### పేష్వా చిమణాజీకివ్రాసిన పత్త్రాంశము.

బుడతకీచుల దమనవ్యాపారమునను, కొంకణనువ్యవస్థాస్థాపనతత్పరత్వమునను నొప్పియున్నచిమణాజీకి 27-3-1739 తేదీని పేష్వవ్రాసిన యుత్తరములో "పాదుషాకును నాతని మంత్రివర్గమునకును దటస్థమయిన, కాపురుషోచితవివాదము మొగలాయీసామ్రాజ్యవినాశనమునకుఁ గారణభూతమై వఱలుచున్నయది. నిజాముల్ముల్కునకు ప్రకృత మలవడినదుర్దశ కడు శోచనీయముగ నున్నయది. దక్షిణభారతము మ్లేచ్ఛశాసనమునుండి ముక్తి వడయఁగలసుయోగముఁ గననున్నయది. నీవు బసాయీ (Bassein) యుద్ధవ్యాపారమును శేష మొనర్చి సేనాసహితముగ నౌరంగాబాదునగరమున కరుదెంచినంతనె మొగలాయీయధికృతప్రదేశములలో మహారాష్ట్రశాసనాధినివేశన మొనర్చుయత్నమున మెలఁగనువగు"నని వ్రాసెను.

### శ్రీబ్రహ్మేంద్రస్వాములవారికి వ్రాసినపత్త్రాంశము.

చిమణాజీకి వ్రాసినయుత్తరమునకుఁ బూర్వము, బాజీరావు తనదీక్షాగురుఁడగు, శ్రీమత్పరమహంసశ్రీమద్బ్రహ్మేంద్రస్వాములవారి కడ కొకసుదీర్ఘపత్త్రమును లిఖించి పనిచెను. అందు "నాదిర్షా, ఢిల్లీలోనివిశ్వవిఖ్యాతమణిమాణిక్యమండి

తమయూరసింహాసన మపహరించి మొగలులకును మొగల సామ్రాజ్యమునకుఁ గూడ నొకనిష్ఠురవ్యాఘాత మొనఁగినాఁడు. ఆతనిమూలముగ హిందువులపాలిటఁగూడ నొకఘోరవిపత్తాసన్నవర్తియై యున్నటులు పొడసూపుచున్నయది. అట్టిచో ప్రకృతము నేనొందుచున్నకష్టమునకు మేఱ గానరాకున్నయది. సైన్యపోషణభారమును స్వయముగ గ్రహించుటవలన ఋణసాగరమున మునింగియున్నవాఁడను. అయినను పూజ్యపాదులగు శ్రీస్వాములవారి యమోఘాశీర్వాదామృతము నాశిరమున వర్షించుచున్నంతకాలము నేనేవిషయమును గూర్చియుఁ జింతనొందువాఁడను కాను. అయిన నియ్యది ప్రస్తుతాసన్నవివృతవిపద్దశ నన్ను పురికొల్పుటవలన జ్ఞాపితమాత్రమని మనవి యొనర్చుకొనుచున్నాఁడను. భావికర్తృకమున శ్రీస్వాములవారియుపదేశము ప్రార్థనీయము." అని వ్రాసెను.

24-3-1739 తేదీని మఱియొకయుత్తరము వ్రాసెను. అందు "శ్రీస్వాములవారియాశీర్వాదపూరితమగు శ్రీముఖము నా కమితానంద మొసఁగుచున్నయది. నాదిర్‌షా ఢిల్లీనగరమును పూర్ణముగ వశ మొనర్చుకొనినవాఁడు. ఆతని కీభారతవర్షమందు నేను గాక వేఱొందుశత్రువు గానరాఁడు ఆతఁడు ఢిల్లీనగరమునుండి బయలు వెడలి దక్షిణాభిముఖుఁడై నంతన నేను సేనాసహితముగఁ జర్మణ్వతీ(చంబల్)నదిని దాఁటి యాతనిగతిని నిరోధించుయత్నమున మెలఁగుచున్నవాఁడను. సాధ్యమయినంతవఱకు మానుషయత్నమువలన నాతఁ డీవంక కరుదేరనేరఁడని నేనునొక్కివక్కాణింపఁగలను. నేనీవిషయములో నప్రమత్తుఁడనై యున్నాఁడను. గురువరా! సమయము విపత్పూ

రితమై యున్నది. తాము నిశ్చింతగ నుండవలవదని ప్రార్థించు చున్నాను. తమ మంగళాశీర్వాదమునకు నిరంతరము పాత్రుఁడను" అని వ్రాసి యుండెను

బాజీరావు నాదిర్‌షాను నెదిరించుట కుత్సాహమండితుఁడై మహారాష్ట్రసైన్యము నంతయు నేకత్రిత మొనర్చుచు, నాజర్ జంగుకడ కనిపినవిధమున రాజపుత్రస్థానములోని రాజ మహారాజులకడకుఁ గూడ గుప్తరూపముగ సందేశముల నంపి యుండెను.

## నాదిర్ షా ఢిల్లీయాక్రమణము.

నాదిర్‌షా పరిషియా దేశపుచక్రవర్తి. విపులబలసంపన్నుఁడు. రాజనీతివిశారదుఁడు. ఆతఁడు మహమ్మదీయుఁడైనను మహమ్మదీయులయెడ వాత్సల్యమును జూపినవాఁడు కాఁడని ఢిల్లీనగరములో నాతఁడొనర్చిన క్రూరకృత్యమె వేనోళ్లఁజాటు చున్నయది. ఆతఁడు కాబూలుదేశమును జయించినపిమ్మట హిందూదేశము ధనభూయిష్ఠమని తెలిసికొనెను. అందువలన నాతఁడు ధనలోలుఁడై హిందూదేశమునకు దాడివెడలుటకు నిశ్చయించి సింధునదిపై నానకట్టకట్టి సైన్యసహితముగ పంజాబు దేశములో ప్రవేశించెను. అంతదనుక నాతని భారతసంచయాత్రంగూర్చి, ఢిల్లీశ్వరునకు కిసుమంతయు నెఱుకపడలేదు. పిమ్మటనైనను, బాజీరాయని నాశన మొనర్చు నాలోచనబలీయమై యొప్పుచుండినందున నాదిర్‌షాను నిలువరించు యోజనము పాదుషాకుఁ గాని, యాతనిమంత్రివర్గమునకుఁ గాని స్ఫురించినదికాదు. ఆకారణమువలన, నిర్బాధకముగ, నిర్విఘ్నముగ మొగలాయీరాజధాని, రత్నమణిఖని, వైశ్వర్యములప్రోవు,

భారతపురవరము అగుఢిల్లీనగరసామ్రాజ్యమును వడయఁగలను యోగము నాదిర్‌షాకుఁ బ్రాప్తమయ్యెను. అంతఁ బాదుషా నాదిర్‌షా నెదిరించి పరాజితుఁడై సంధిమూలకముగ నాతనిమైత్రిఁ బడసి యాతనిఁ గొంతకాల మందు నివసింపఁ బ్రార్థించెను. నాదిర్‌షా పాదుషాప్రార్థన మంగీకరించెను. ఇట్లుండ నాదిర్‌షాసైనికులకును పాదుషాసైనికులకును విరోధ మంకురింప పాదుషాసైనికులు నాదిర్‌షాసైనికులను రహస్యముగ నాక్రమించి వధియింపఁజొచ్చిరి. అందువలన నాదిర్‌షా ఢిల్లీనగరమును దోచుకొని యంతటితో తనివి నొందక జనశూన్య మొనర్చెను. ఈసందర్భమున నాదిర్‌షాకు ముప్పదియొక్క కోటిరూప్యములవిలువ గలయైశ్వర్యము చేఁ జిక్కె నని చరిత్రకారులు ఘోషించుచుండిరి.

నాదిర్‌షాకు ఢిల్లీనగరములో ప్రాప్తమయిన యైశ్వర్యము తుష్టికరము కానందున నాతఁడు దక్షిణభారతమువంకకు దృష్టి మరలించెను. కాని యాతనిసైన్యములో నుదయించిన కలకల మాదృష్టి మరలించి యాతనిని స్వదేశమునకుఁ గొంపోయెను. అందువలన నాతని నెదిరించుట కొనరించిన బాజీరాయనిప్రయత్నములు నిష్ప్రయత్నము లయ్యెను.

---

## పదియవప్రకరణము.

---

### బుడతకీచులదురాచారము.

బాజీరావు, పేష్వాపదమునఁ బ్రతిష్ఠింపఁబడుటకుఁ బూర్వమే, బుడతకీచుగణము మహారాష్ట్రమండలమునకుఁ గల బల

షడ్రిపుగణములలో నొకటిగఁ బరిగణింపఁబడు యోగ్యతఁ బడ
సి యుండెను. బుడతకీచులను మహారాష్ట్రులు ఫరంగీలని వ్యవ
హరించిరి. ఫరంగీలు, గోవా, దాబోలు, దమన్, దయ్యూ,
సష్టీ, (Salsette) ముసాయీ ప్రభృతిస్థానముల నాక్రమించి
యందు దుర్గములను నిర్మించుకొని తమనిరంకుశాధికారమును
నాగింపఁ జొచ్చిరి. పిమ్మట వారంతటితోఁ దనివినొందక వారి
యధికారము మతప్రచారమువలనఁ గాని సార్థక్యముఁ గననేర
దని తలఁచి, మతాభిమానపిశాచావేశులై తద్వ్యాపకముఁ
గూర్చి యత్న మొనరింప మొదలిడిరి. వారు రోమన్ కెథాలిక్
మతావలంబులు. వారు రోమన్ కెథాలిక్ మతప్రచారణసమా
జమను నొకసమాజమును స్థాపించిరి. ఈసమాజములోని పా
రందఱు ఫాదిరీలు (మతగురువులు) ఈఫాదిరీలు పోర్చుగీజాధి
కృతప్రదేశవాసులను తమమత మవలంబింపవలసినదని బలా
త్కరింపఁ జొచ్చిరి. స్వమతముఁ ద్యజింప నొల్లనివారిని బంధించి
కారాగారమున నునుచుటయు, అన్నోదకములను బలాత్కా
రముగ వారినోట నిడుటయు, తప్తకాష్ఠలోహదండములతో
వారిఁ బ్రహరించుటయు, బ్రతికియుండఁగనే వారిని ప్రజ్వలి
తాగ్నిజ్వాలలఁ బడఁ ద్రోయుటయు మొదలుగాఁగల దుష్కృ
త్యములపాలు గావించి మిక్కుటముగ బాధింప మొదలిడిరి.
ఆకాలములో బుడతకీచురాక్షసు లొనర్చినక్రూరకృత్యములు
తదితరమతప్రచారకు లేరును అంతకు ముందుఁగాని వెనుకఁ
గాని సలిపి యుండలేదు. ఈమతప్రచారకులు హిందూముసల్మా
నను వివక్షతఁ బరికింపక యిరువురియెడ సమత్వమును వహించి
యిరువురకును సమానోపద్రవముఁ బ్రతిఘటించుచుండిరి.

### హైందవులదుర్దశ.

బుడతకీచుల యధికృతప్రదేశములలోని హైందవనివాసులు రోమన్ కెథాలిక్ మతప్రచారకు లొనర్చువివిధవిధోపద్రవములకుఁ బాల్పడి నితాంతక్లేశోపేతులై తుదకు కొందఱు తన్మతధర్మ మవలంబింపవలసినవారైరి. ఈమత ప్రచారకుల ధర్మప్రచారము, హైందవదేవాలయముల విధ్వస్తరూపకముగ పరిణమింప నారంభించెను. ఎచ్చటనైన నేరైన హైందవధర్మానుసరణముగ వ్రతనియమములను, యజ్ఞదీక్షలను, దేవతారాధనములను వేదపాఠములను నాచరించుచున్నవారని యాపుత గురువులు వినినయెడ, వా రాక్షణమున నాశావులకుఁ జని, వారియాచరణములకు విఘ్న మాపాదించి, తదనుష్ఠాతల బంధించుచుండిరి. ప్రాంతీయజమీందారులయు గృహస్థులయు సర్వస్వ మపహరించి వారి దరిద్రదేవతాముఖమునఁ బడఁద్రోయుచుండిరి. దరిద్రులను శ్రమజీవులును నగుమనుజులఁ బట్టి తెచ్చి వారివలన బలాత్కారముగఁ బనిపాటుల నొనరింపించుకొని వేతనముల నొసఁగకయే పనుచుచుండిరి. ఈదురాచారులు పగలంతయు పనిసలిపిన కష్టజీవుల కెన్నఁడైనఁ బిడికెఁడు బియ్యమైన నొసఁగినవారు కారు. బుడతకీచుల దురాచారదుర్వ్యవహారములకు లోనై తపించుచున్న హిందూసంతానము, హాహాకార మొనర్చుచు, నాశ్రయగ్రహణోత్సుకమున నలుగడలఁ బరుఁగిడియె.

### హైందవాశ్రయము.

రోమన్ కెథాలిక్ మతప్రచారకు లొనర్చుదుస్సహదురాచారముల బాఱిఁబడి జర్జరితహృదయులై హైందవులు కొంద

లు స్వసుతస్వధర్మపరిత్యాగములకొల్లక స్వప్రాణములను గోలు
పోయిరి. మఱికొందఱు క్రోధోన్మత్తులై, యుక్తాయుక్తవిచక్షణ
శూన్యులై, స్వబలపరబలతారతమ్యముల దలఁపక, బుడతకీచుల
నెదుర్కొని సమరాంగణమున దీర్ఘనిద్రఁ జేకొనిరి. ఇంక కొం
దఱు స్వగృహాస్వదేశముల ద్యజించి మహారాష్ట్రశాసితప్రదేశ
ముల కరుదెంచి, యాశ్రయలాభమును బడసి, హైందవమత
ధర్మరక్షకులై యేకమాత్రాశ్రయస్థానమై వఱలుచున్న సాహూ
పేష్వాలసమ్ముఖమున విధర్ములగు బుడతకీచుల బాఱిఁ బడి పరి
తపించుచున్న హైందవసంతతిని రక్షించి ప్రోచుట ప్రధానకర్తృ
కమని మనవి యొనర్చుచు పలుమరు పురికొల్ప మొదలిడిరి.
ఈకరుణాపూరితవేదనప్రార్థనము మహారాష్ట్రాధిపుహృదయముఁ
గరగించి వీరసోదరులు, బాజీరావుచిమణాజీలను బుడతకీచు
విదళనార్థము కొంకణమున కనుపఁ బ్రేరణమొనర్చెను సాహూ
యాజ్ఞతోఁ బాటు శ్రీబ్రహ్మేంద్రస్వాములవారియాదేశము కూడ
నావీరవరుల హృదయములను బుడతకీచుదమనమునకు ద్వార
పెట్టఁజొచ్చెను

—:o:— కులాబావిజయము. —:o:—

బుడతకీచుదురాచారములు మహారాష్ట్రాధిపునకుఁ గర్ణ
గతమగుటకుఁ బూర్వమే బాజీరావునకుఁ గర్ణగోచరములై
విషాద మొడగూర్చుచుండెను. ఆతఁడు కొంకణదేశాధివా
సుల కథయ మొసఁగి, యాకాలములో మహారాష్ట్రరణతరణి
సేనాసమూహమున కధినాథుఁడగు కాన్హోజీయాంగ్రే యను
నాతని, బుడతకీచుదమనమునకు నియోగించెను. కాని, యాతఁ
డసమర్థుఁడై సైన్యసహాయము గూర్చి పేష్వాను బ్రార్థించు

చుండెను. ఇట్లుండ, బుడతకీచుదమనమునకుఁ ద్వరపడుచున్న బాజీరావు అధిపునియాజ్ఞఁ జేకొనుట తడవుగ బయలువెడలి కొంకణములో ప్రవేశించెను. అంతట మహారాష్ట్రసైన్యము నకును బుడతకీచుసైన్యమునకును కులాబా సమీపమందు ఘోరయుద్ధము ప్రాప్తమయ్యెను. అందు బాజీరాయని నిరవక్ర పరాక్రమము, బుడతకీచులబలగర్వములను సంపూర్ణముగ ఖర్వ మొనరించి విజయవైజయంతిఁ బూరింపఁజేసెను.

### పేష్వాయాక్రమణము.

కులాబాలోనిబుడతకీచులఁ బరాజితులఁ గావించి, బాజీరావు సాష్టీ (Salsette) బసాయీ (Bassein) లయాక్రమణమున కరుదెంచెను. ప్రథమమున, బాజీరాయనివీరవిక్రమము బసాయీ సమీపమందలి "ఘోడాబంద" రను దుర్గమును, పిమ్మట "థానా" (ఇయ్యది ప్రస్తుతము బొంబాయినగరములో చేరినటుల దోఁచుచున్నది.) నగరమును వశమొనర్చుకొని యందలిబుడతకీచులఁ బాఱఁద్రోలెను. అటుపిమ్మట బాజీరాయనిదృష్టి బుడతకీచుసేనానివాసస్థానమగు "బన్దారా"వంకకు మఱలెను.

బన్దారా, మహారాష్ట్రాక్రమణమునకు లోనైనచో, బొంబాయినగరము వారి కాక్రాంతమగు నను భయమున నందలియాంగ్లేయులు రహస్యముగ బుడతకీచులకు యుద్ధసామగ్రి నొసఁగి సాయపడఁ జొచ్చిరి. ఆంగ్లేయు లొనర్చుయీ రహస్యాచరణము అచిరకాలముననే బాజీరావు గ్రహించెను. అంత నీపోర్చుగీ జాంగ్లేయపాశ్చాత్యసైన్యముల విధ్వంసమునకు. శాజీరావారబీ, మావులీ, హేటకారీ (రత్నగిరి యను

పర్వతప్రాంతమున నివసించుకొండజాతివారిని హేటకారులం
దురు. వారు బాణయుద్ధమునఁ గడుసమర్థులు. ఆకాలములో
వారిబాణయుద్ధ ప్రసిద్ధి సుప్రసిద్ధము) ప్రభృతిరణదుర్మదులను
తనసైన్యమునఁ జేర్చుకొనియెను.

బన్దారాయాక్రమణమునకుఁ బూర్వమే, మహారాష్ట్ర
వినాశమునకుఁ బాదుషా యాదేశమున నిజాము మాలవములోఁ
జొరఁబడియె నని తెలియవచ్చినందున, తదాక్రమణభారమును
చిమణాజీపై నిడి బాజీరావు మాలవమున కేగి భూపాలదుర్గ
ముకడ నిజాముఁ బరాజితునిఁ గావింపవలసివచ్చెను.

## చిమణాజీవిజయము.

బాజీరావు నిజాముఁ దలపడుట కుత్తరభారతమున కరి
గినపిమ్మట, బుడతకీచు మండలోచ్ఛేదనభారముఁ జిమణాజీ
గ్రహించి, రెండుసంవత్సరములు ఘోరయుద్ధ మొనరించి,
సాష్ట్రి, తారాపూరు, మహిమా (మాహి) ప్రభృతిస్థానము
లను వశమొనర్చుకొనెను. ఈఘోరసంగ్రామములో, ఆంగ్లే
యులు, అబ్సియానులు (సిద్దీలు) బుడతకీచుపక్ష మవలంబించి
పోరొనర్చినను మహారాష్ట్రులు విజయమాలికఁ గైకొని తమ
విజయబిరుదమునకు సార్థక్య మొసఁగిరి. ఇందు బుడతకీచుల
పక్ష మవలంబించిన పాశ్చాత్యులు సుమారు నూఱుయాన
పాత్రము (స్టీమర్లు)ల యుద్ధసామగ్రితోఁ బాటు పెక్కండ్ర
సుప్రసిద్ధసేనాపతులఁ గూడఁ గోలుపోయిరి. స్వజాతి స్వధర్మ
స్వదేశ సంరక్షణోత్సుకమున మహారాష్ట్రవీరులు పెక్కండ్రు వ
త్సరద్వయ వ్యాపకమహాసంగ్రామములో తమయలౌకికశౌర్య

సాహసములఁ బ్రదర్శించి సమరతలమున దీర్ఘనిద్రఁ జేకొని శాశ్వతయశముఁ జూఱఁగొనిరి.

## బసాయీవిజయము.

బసాయీదుర్గము కొంకణమందలి పోర్చుగీజుదుర్గములలో ప్రధానముగ పరిగణింపఁబడుచుండెను. ఆకారణమున నాదుర్గమును స్వాధీనపఱుచుకొనినచో, పోర్చుగీజాధికారము మూలోచ్ఛేదమును, ప్రపీడిత హిందూసంతాన లబ్ధస్వాతంత్ర్యము సాధితములగునని రెండుసంవత్సరములు పలుతావులలో ఖండయుద్ధము లొనర్చినపిమ్మట చిమణాజీ క్రీ. శ. 1739-వ సంవత్సరములో బసాయీదుర్గ మాక్రమించెను. బుడతకీచు లీదుర్గమును పండ్రెండువందల సుశిక్షిత పాశ్చాత్యరణనిపుణులగు సైనికులను రావించి వారిరక్షణమున నిడి మూఁడుమాసములు ఘోరయుద్ధ మొనరించి మహారాష్ట్రులవశము కాకుండఁ గాపాడిరి. మహారాష్ట్రులు సురంగములఁ ద్రవ్వి, యందు తుపాకిమందుఁ జొనిపి, యగ్నిని రగులుకొల్పి, దుర్గప్రాకారము ఛేదించిరి. కాని, బుడతకీచులభయానకఫిరంగుల కెదురోపక దుర్గప్రవేశమున కసమర్థు లగుచుండిరి. అంత నొకనాఁడు, చిమణాజీ బసాయీదుర్గమును వశమొనర్చుకొనఁ గృతప్రతిజ్ఞుఁడై సేనానుల నందఱ రావించి, "మీరు భయగ్రసితులై దుర్గప్రవేశమునకు వెనుకంజ వైచుచున్నవారు. జీవితాశగలవారందఱు స్వధర్మ స్వజాతి స్వదేశసంరక్షణ పరాఙ్ముఖులరై చని తమపుత్త్రమిత్త్రకళత్త్రంబులఁ జేరి సుఖంబున మనుఁడు. నేనొక్కఁడనే యీమహాకార్యమునుసాధించి శాశ్వతయశముఁ జూఱఁగొనెద. బసాయీదుర్గమున విజయపతాకమును నెల

కొలుపుదనుక నన్నపానముల గ్రహింపనని నేనీక్షణమునఁ బ్రతినఁ గైకొనినాఁడను" అని పలుకుచు శత్రుమారణోన్ముఖుఁడై దుర్గమువంక కరుగఁ బయనమయ్యెను. అంత సేనానులందఱు చిమణాజీ నుడివినవ్యంగ్యవాక్యములను విని, లజ్జావనతవదనులై "అప్పాజీ గైకొనిన ప్రతిజ్ఞను మేము కూడఁ గైకొంటిమి" అని యేకగ్రీవముగఁ బలుకుచు చిమణాజీని వెంబడించిరి. ఈసారి విజృంభణమున మహారాష్ట్రులు వీరావేశులై కరాళకరవాలముల ధరించి, శత్రుదళమును జించి చెండాడి దుర్గస్థితక్రూసు చిహ్నితపతాకమును నూడబెఱికి తత్స్థానమందు జాతీయజేగురుపతాకమును మేయి 15 తేదీని నెలకొలిపి తమయద్వితీయమహాశౌర్యసాహసములఁ బ్రకటించి పూర్ణవిజయముఁ గైకొనిరి. ఈసందర్భమును వర్ణించుచు, గ్రాంట్‌డఫ్ దొరగారు "This remarkable seige, the most vigorous, ever prosecuted by the Marathas" అనియును,ఎడర్‌సన్ దొరగారు, "The seige was carried on with such extraordinary vigour, skill, and perseverance, as perhaps, the Marathas have in no other instance displayed. అనియును నుడివియున్నవారు.)

అంతిమదినయుద్ధమందు రణనిపుణులగు నేడువందల పాశ్చాత్యసైనికుల బలి యొసఁగి బుడతకీచులు పరాజితులైరి. ఈవర్షద్వయవ్యాపక మహాసంగ్రామమున పదునాలుగువేలమహారాష్ట్రసైనికులును అంతకు నాలుగురెట్లధికముగ బుడతకీచుసైనికులును వీరస్వర్గముఁ జేకొనిరి. ఈమహాయుద్ధమందు బుడతకీచు లొనరించిన యర్థప్రాణత్యాగములఫలము గోవాప్రదేశము మహారాష్ట్రులవశము కానీక కాపాడినది.

ఈబసాయీదుర్గములో మహారాష్ట్రాధికారస్థాపనానమయమున విజేతయగుచిమణాజీపాలఁబడిన దుర్గేశునిపరివారములోని యత్యంతసుందరి యనిపేరువడసిన "దుర్గేశనందిని" యను నబలారత్నమును ఆతఁడు సాదరసన్మానపూర్వకముగ విడిచిపుచ్చి యామె యాత్మీయవర్గమునఁ జేర్చెను. బసాయీప్రవాసులగు క్రిష్టియన్‌మతావలంబు లీచిమణాజీకృతధార్మికకృత్యమును గూర్చి నేటివఱకు వేనోళ్లఁ బొగడుచుండిరి.

## పాదుపాసన్మానము.

విశ్వవిదితరత్నవిజడితమయూరసింహాసనాది ధనకనకరత్నసముదాయ మపహరించి నాదిర్‌షా, భారతవర్షమును వీడి స్వదేశమున కరిగినపిమ్మట ఢిల్లీనగర మత్యంతశోచనీయావస్థకుఁ బాల్పడియెను. ఆసమయమున మ్లేచ్ఛశాసనోచ్ఛేదనకంకణబద్ధుఁడగు పేష్వాబాజీరావించుకయత్న మొనరించినచో, తన సంకల్పముఁ బూర్ణముగఁ బూర్తి యొనరించుకొను ననుటకు నిసుమంతయు సందియము లేదు. కాని ఢిల్లీశ్వరుని యెడ మహారాష్ట్రాధిపునకుఁ గల యనురాగాభిమానములు బాజీరాయనిసంకల్పము సాధితము కాకుండుటకు బలవద్విఘ్నములయ్యెను. అందువలన రాజనీతిధురంధరుఁడగు పేష్వా మొగలాయీసామ్రాజ్యసింహాసనమున నొక్కని నొక్కింతకాలము ప్రతిష్ఠించు నభిప్రాయ మూని, తదనుగుణముగ శోచనీయ విపద్దశయం దుండియున్నఢిల్లీశ్వరునికడకుఁ గొన్నియమూల్యాభరణములను నూటొక్కస్వర్ణముద్రలను నుపహారముగఁ బనిచెను.

ఇంతకుఁ బూర్వము, నాదిర్‌షా, ఢిల్లీనగరముపై దండె

త్తివచ్చినపు డాత్మరక్షణార్థమై పాదుషా బాజీరాయనిసా హాయ్య మాసించి యాతనిఁ బ్రార్థించియుండె. కాని బాజీ రావు పాదుషానహాయమునకు డిల్లీనగరమున కరుగుటకుఁ బూర్వమే, తన్నగరైశ్వర్యమును, పాదుషాహీపదాన్నత్యము నుఁ జూఱగొని నాదిర్ షా స్వదేశమున కరిగె. అందువలన బాజీరావు పాదుషా కలవడినయాకఠోరవిపద్దశను గూర్చి తన యాంతరికసానుభూతిఁ బ్రకటించుచు నాతనికడకు వశ్యతావి జ్ఞాపితపత్రసహితముగ నుపహార మనిపెను. బాజీరావు పనిచిన పత్రమును నుపహారమును బాదుషా సాదరపూర్వకముగ గ్రహియించి తత్ప్రతిరూపముగ క్రీ. శ. 1739 మేయి 22 దీని భూషణభూషితములగు గజాశ్వరత్నములను రత్నాభరణముల నొసంగి బాజీరాయని సన్మానించెను.

## నిజాముకుత్సితము.

భూపాలదుర్గమందు బాజీరాయనితో నొనర్చినసంధి నియమానుసరణముగ నిజాముల్ ముల్కు, బాజీరాయునకు మాలవసుబేదారీపదాధికారనిర్ధారితస్వత్వపత్రప్రదాన మొన ర్చుటయందు వెనుదీయుచు నాదోష్ట్యమును పాదుషాయం దారోపింప నారంభించెను కాని పాదుషా వేఱొకనూతనసుబే దారుని నియోగించి పనుపకపోవుటవలనను, తద్దేశసుబేదారీ పదము తనచేతిలోనే యుండుటవలనను, బాజీరా వీవిషయముఁ గూర్చి పాదుషా నాసమయములో తర్జనభర్జనము లొనర్చియుం డలేదు. అట్లొనర్పకుండుటకుఁ గారణము బాజీరాయని సమర్థ తయే కాని వేఱొండు కాదని నిజాము తలఁచి భూపాలసంధి నిర్ధారితనియమపాలనమం దనన్యథాభిప్రాయ మూని వెను

దీయఁ జొచ్చెను. అందువలన బాజీరావు మిగుల కుపితుఁడై దక్షిణదిగ్విలయమందు నిజాము స్తిత్వమునకు విలోప మాపాదింప దృఢప్రతిజ్ఞఁ గైకొనియెను.

## నిజాముపై పునరాక్రమణము.

సేంధియా హోల్కారుప్రభృతి వీరసేనానులు కొంకణమునుండి ప్రత్యావృత్తులై నిజసైన్యము గలియనందున బాజీరావు రాజపుతానాలోని రాజమహారాజులతోను బుందేలుఖండమండలి జమీందారులతోను మైత్రి నలవఱచుకొని,తత్సాహాయ్యమును వడసి, డిల్లీశ్వరునిపక్షమున నాదిర్ షా నెదుర్చుట కగుదెంచెను. కాని నాదిర్ షా స్వదేశమునకు మరలిపోయెను. అందువలన నాతఁడు నిజాముపై దాడివెడలుసంకల్పమూని చన నుంకించెను. కాని, రాఘోజీభోసలా, దామాజీగాయక వాడు ప్రభృతిమహారాష్ట్రసర్దారులు నిజాము నెడ సద్భావమూని ప్రతిఘటించినందున నాతఁ డించుక వ్యతివ్యస్తుఁడు కావలసివచ్చెను కాని తనసంకల్పమును వీడినవాఁడు కాఁడు.

ప్రఖరబుద్ధియగు బాజీరావంతట నూఱకుండక రాఘోజీభోసలాకడ కేగి యాతనియెదుర, నిజాము కుత్సితవర్తనమును హేతుభూతముగఁ బ్రకటించి, నిజాముపై దాడివెడలువిషయమున నాతనినమ్మతమును వడయుటయే కాక, యాతని దక్షిణమండలి మొగలాయీశాసితప్రదేశాక్రమణమునకు నియోగించివనిచెను. తాను నిజామునకు విరుద్ధముగ యుద్ధమొనరింపను త్తరదిశ కరిగెను.

ఆసమయములో నిజాముల్ ముల్కు ఉత్తరభారతములో నివసించి యుండెను. దక్షిణమందున్న యాతనిప్రమత్తపుత్రుల

నడుమ భ్రాతృవిరోధ మంకురించుసూచనలుపొడకట్టనారంభించెను. అయ్యది నిజాముర్యాజ్యముపై దాడివెడలుట కుపయుక్తసమయముగ గ్రహించి బాజీరావు ప్రప్రథమమున పదివేల సైనికులఁ గొనిచని ఔరంగాబాదు సమీపమున నాజర్‌జంగు నాక్రమించి యాతనినవరుద్ధునిఁ గావించెను. ఈసమాచారము ప్రచురమైనంతనె నాజర్‌జంగుసహాయమునకు బేదరునుండి విశేషసైన్యమరుదెంచెను అందువలన ముసల్మానుసైన్యము మహారాష్ట్రసైన్యముకంటె నాలుగురెట్లధికమయ్యెను. ముసల్మానులవరోధమును ఛేదించుకొని బయటఁబడుట కొనరించినయత్నసందర్భమున మహారాష్ట్రుల కమితనష్టమొనరించిరి కాని యీసమయమునకు బసాయీవిజయముఁ జేకొని సేంధియాహోల్కారుసహితముగ చిమణాజీ యరుదెంచి శత్రుసైన్యారణ్యమును దహింప నారంభించె. మహారాష్ట్రుల నిష్ఠురరణతాండవమున కెదురొపనేరక, మొగలాయీలు క్షత్రధర్మమును వీడి ప్రాణరక్షణాతురులై యరణ్యములకు బరుగిడిరి. అంత నాజర్‌జంగు చేయునదినేరక సంధికొడఁబడి తదనుగుణముగ బాజీరాయునిఁ బ్రార్థించెను.

### ప్రతిష్ఠానపురసమాధానసంస్థాపనము.

ఈయుద్ధసమయములో మహారాష్ట్రసైనికులు మూఁడుమాసము లన్నోదకము లలవడమిఁ జేసి పలుకష్టముల ననుభవించిరి. ప్రజాపుంజము దుస్సహాదుఃఖమునకుఁ బాలయ్యెను. అందువలనఁ బూర్ణవిజయుఁడగు బాజీరావు అనిచ్ఛాపూర్వకముగ సంధిప్రార్థితుఁడైన నాజర్‌జంగుతో క్రీ. శ. 3-3-1740 తేదీని ప్రతిష్ఠానపురములో సంధి సంస్థాపన మొనరించెను.

ఇందువలన ఖాందేశములోని "ఖారగాణము" "హిందియా" యను రెండుప్రదేశములు మహారాష్ట్రులకు బ్రాప్తమయ్యెను.

—⁂ పేష్వా పరలోకగమనము. ⁂—

పిమ్మట బాజీరావు విశేషసైన్యమును సమకూర్చి యుత్తరభారతవిజయమునకు బయలువెడలెను. ఈయభియానమున డిల్లీనగర మతిక్రమించి అటక్‌నగరపర్యంత మరుగుట బాజీరాయనియుద్దేశ్యము. కాని కాలవైపరీత్యము, దౌర్భాగ్యమునకుం దోడై యావీరవరునిసంకల్పము సాధితము కాకుండం జేసెను. బాజీరావు విపులసేనాసహితుండై నర్మదాతీరమున కరుగుట తడవుగ నాతం డొకనూతనవిషమజ్వరమున కధీనుండయ్యెను. అభినవవిజయాభిధానుండును, అద్వితీయబలపరాక్రమసంపన్నుండును, శ్రీమంతబిరుదాంకితుండును నగు పేష్వా బాజీరావు భల్లాలావిషమజ్వరాక్రమణమునకు సహింపనేరక నర్మదాతీరమందుండియే క్రీ. శ. 28-4-1740 తేదీని బయలు వెడలి స్వర్గయాత్ర కరిగెను.

అతినియకాలమరణము భారతభూమికిపరాధీనత్వమును, హైందవధర్మమునకు విలోపమును సమకూర్చినయది. బాజీరావు తనమరణకాలమునం దనప్రియసహచరులును, ఆజ్ఞావాహకులును నగు సేంధియాహోల్కారులకు, మొగలాయిశాసనపాశబంధమున నొప్పి బలువిధముల నలియుచున్న భారతభూమిని నుద్ధరించుటయె జన్మసాఫల్య మని బోధించి వారివలనం దదనుగుణప్రతిజ్ఞలం గైకొనియెను.

బాజీరాయనిమృత్యుసంవాదము సమస్తమహారాష్ట్రమహీమండలమును కాదు, కాదు, సమగ్రభారతవర్షమును

నిస్తరణశోకాంబుధిఁ గూలఁద్రోచెను. మహారాష్ట్రాధిపుఁడు సాహూ యీశోకసంవాద మాలించి యధీరుఁ డయ్యెను. సేనానులు నిరుత్సాహులైరి. సైనికులు బిట్టుగ వాపోయిరి. స్వజనపరివారము వర్ణనాతీతమగు శోకసాగరమున నిమగ్నమయ్యె.

బాజీరాయనిమరణకాలమున నాతనిప్రియసహోదరుఁడు చిమణాజీఅప్పా, యాతనికడ నుండలేదు. అతఁడు కొంకణమున శాసనసుప్రబంధనిర్మాణమున నొప్పియుండె. అతఁడందే సోదరునినిష్ఠురమరణసంవాద మాలించి, శోకాకులచిత్తుఁడై, భోగపరాఙ్ముఖుఁడై, యత్రసన్యాసమును స్వీకరించి, స్వదేశమున కరుగకయే యందుండి తీర్థయాత్రలు సేవింప నరిగెను. ఆతఁడు, అనంతపుణ్యఫలప్రదాయిని యని ముల్లోకముల యందు పేరువడసిన శ్రీకాశీక్షేత్రమున కరుదెంచి సోదరుని కక్షయపుణ్యలోకప్రాప్తికొఱకు అశీసంగమమున నొకమందిరము నెలకొలిపి సోదరునిపేరిట నొకయన్నసత్రమును ప్రతిష్ఠించెను. కాలక్రమమున తత్కాలనాధిపుల దుర్వర్తనముల వలనను దౌర్బల్యమువలనను సత్ర మంతరించినది. మందిరము శిథిలమైనది. ఆమందిరశిథిలభాగములు నేటికిని "చిమణాజీవాడా" యనునామమున విరాజిల్లుచు చూపఱులహృదయములయందు విషాదవిస్మయముల నుదయింపఁ జేయుచుండెను.

బాజీరావు స్వర్గపురమున కరిగినకొలఁదికాలముననే చిమణాజీని కాశీపురములో కొందఱువిద్రోహులు సంహారించిరని యొకజనశ్రుతి విశేషముగ ప్రచలితమై యుండె.

## బాజీరాయనిప్రశంసచరిత్రము

బాజీరా విరువదిసంవత్సరములుమాత్రమే పేష్వాపద
మునఁ గార్యమొనరించెను. ఆతని కార్యనిర్వాహకసమయము
లో నధికాంశము యుద్ధాభియానములయందును శత్రుసమున్
మథనమందును వ్యతీతమయ్యెను. ఆకారణమున రాజకీయా
భ్యంతరీనవ్యవస్థావిషయమునఁ గృషిసలుపుట కాతనికి తగినం
తయవకాశములవడినట్టుల గాఁగాదు ఆతనిప్రసిద్ధనీతిత్వము,
ప్రచండపరాక్రమము, ఉచ్చాకాంక్షయు నసాధారణములని
చదువరులకు విశదమగుచునే యున్నయవి ఆతఁడు దేవబ్రాహ్మణ
భక్తిపరాయణుఁడు. దూరదృష్టిగలవాఁడు. సరళస్వభావుఁడు.
దయామయుఁడు. ఆకాలమునలో మహారాష్ట్రదేశములో బాజీ
రాయనిఁబోలు సద్వక్త వేఱొకఁడు లేఁడు. బాజీరాయని ద
యాళుతాసుగుణమే నిజాముల్ముల్కునకుఁ బలుసారులు ప్రా
ణదానముసుపరిత్రాణములవడుటకుఁ బ్రధానకారణము ఈద
యామయత్వమే బాజీరాయని, రాజనీతిక్షేత్రములో పలు
సారులు కలవరమొనరించెనని పెక్కండ్రుచరిత్రకారులయభిమ
తమై యున్నది. ఆతఁడు యప్రతిహతప్రతిభావిశేషమునకుఁ
దోడు రాజనైతికకౌశల్యము గూడ నలవఱచుకొనినచో నిజా
ముల్ముల్కుఁ విధ్వంసమొనరించి, మహారాష్ట్రులపాలిటి యొక
ప్రధాన బలవద్రిపుకంటకమును దూరమొనర్చినవాఁడగునను
టకు సందియ మిసుమంతయు లేదు

బాజీరావు భారతవర్షములోని పెక్కుభాగములనుండి
చౌతుప్రథాప్రతిష్ఠాపనపూర్వకముగ ద్రవ్యాకర్షణ మొనర్చు
చు మహారాష్ట్రసామ్రాజ్యప్రపత్తులను విపులముగ విస్తరింపఁ

జేసి చర్మణ్వతీనర్మదానదుల మధ్యప్రదేశమును నిరంకుశని జాధిపత్యమునకు లోఁగొనియెను.

ఈతనికాలములో నీదిగువ మహారాష్ట్రరాజ్యములు
స్థాపింపఁబడినవి.

| రాజ్యనామము. | రాజధాని. | రాజ్యాధిపతినామము. |
| --- | --- | --- |
| 1. మహారాష్ట్రము. | పూనా. | ఛత్రపతిసాహూ. సితారా నగరములో వాసమొనర్చెను. |
| 2 గుజరాతు,ఘూర్జరము. | గుజరాతు. | దామాజీగాయక్ వాడ్. బరోడామహారాజు. |
| 3. మాళవ | (a) ఇందోరు. | మలహారురావుహోల్కరు. |
| | ( ) గ్వాలియరు. | సేంధియా, గ్వాలియరుమహారాజు. |
| 4. బీరారు. C.P. | నాగపురము. | రాఘోజీభోసలా. |

వీరేంద్రుఁడగు బాజీరావు స్వ(మహారాష్ట్ర) దేశోద్ధారణార్థ మవతరించిన యొకానొకదివ్యపురుషుఁడని పలువురు మహారాష్ట్రు లభిప్రాయ మూనియుండిరి. అట్టియభిప్రాయమున కాతఁ డొనరించిన దేశహితకార్యపరంపరయే ప్రబల తార్కాణము. ఆతఁడు తనజీవితకాలమంతయు దేశహిత మభిలషించి తదనుగుణకార్యములయందే వ్యతీత మొనరించెను. ఆతనికార్యకలాపము మహారాష్ట్రమును గౌరవమండితముఁ గావించెను.

భగవదనుగ్రహమువలన స్వీయస్వభావానురూపముగ శ్రీరామునకు లక్ష్మణుఁడువోలె బాజీరాయునకుఁ జిమణాజీయను సహోదరుఁడు సంప్రాప్తుఁడయ్యెను. ఆసహోదరుల సౌభ్రా

తృవాత్సల్యముఁ గని మిగుల సంతసించుచు శ్రీమద్బ్రహ్మేంద్రస్వాములవారు, వారలకు రామలక్ష్మణులతో నుపమ గల్పించియుండెను. బాజీరావు గుణవంతుఁడగు సోదరునివలె గుణవతి యగు సహధర్మిణి, కాశీబాంగ్ అనునారీరత్నముకూడఁ బ్రాప్తమయ్యెను.

బాజీరావు విఘ్నవినాశకుఁడగు చంద్రమౌళితనయుని నారాధించుచుండెడివాఁడు.

బాజీరావు రాజనీతిజ్ఞుఁడు; రాజకార్యపటిష్ఠుఁడు. అయినను నిర్మలచిత్తమును, యథార్థవాక్కును ఋజువర్తనముఁ గలిగిన శూరుఁడు. కార్యసాధనతత్పరత్వ మాతనికి సహజగుణము. ఆతఁడు నిరంతరము రాజమంత్రణముననో యుద్ధవిగ్రహముననో లిప్తుఁడై యుండెడివాఁడు. నిజాముల్ముల్కు విశేషముగ యౌవనావస్థలో క్రోధపూరితుఁడై నపుడు సింహవిక్రమముఁ బూని, యుద్ధసమయమందు భయంకరుఁడుగను దుర్ధర్షుఁడుగను నుండెడివాఁడు. ఆతఁడు స్వాభావికముగ సతర్కితముగ పరిణామవిచారణ మొనర్చి కార్యమునకుఁ దొరకొనుచుండెను. అనేకవిధములగు కుయుక్తులఁ బ్రయోగించి తనశత్రువులను, వాక్చాతుర్యము కూటనీతులఁ గనఁబఱుచుచు కుతంత్రజాలమున బంధించి దుర్దశాగ్రసితులఁ జేయుటయం దాతఁ డతిశయానందానుభవములఁ గలిగినవాఁడు. ఆతఁ డీవిధముగ ధూర్తత్వ మూని శాత్రవానువర్తులకు మిత్రభేదముఁ గల్పించి వారిబలదర్పములను క్షీణింపఁజేయుటయం దసమానపాండిత్యము గలవాఁడు.

బాజీరాయని వ్యవహారమన్ననో, సరళము. విశ్వస్తము.

సర్వజనసమ్మతము. అతఁడు నిజరాజ్యాధికారములు వృద్ధి జేయుటయందు స్వాభావికముగ నిజాధిపతివశ్యతాప్రభుత్వములు స్వీకరించి ప్రవర్తించుచుండెడివాఁడు. అతఁడు తనజనకునిచే ప్రతిష్ఠింపఁబడిన యుత్తమరాజనీతి పథానువర్తియై, ప్రజాపుంజమునకు సౌఖ్యవృద్ధియు, పదాన్నత్యమును నొడఁగూర్చు సాధనములయందు ప్రవృత్తుఁడై నిరంతరము మెలఁగుచుండెడివాఁడు. నిజాముల్ముల్కునుబోలె కుతంత్రకూటనీతు లాధారముగఁ గొని ద్వంద్వభావమూని సంచరించెడివాఁడు కాఁడు. అతఁ డద్వితీయప్రతిభాసంపన్నుఁడు. అతనిగుణగణములును, శక్తిసామర్థ్యములును, సాహసోత్సాహములును వర్ణింప నశక్యము. అతనిసద్వ్యవహారమును కార్యదక్షత్వమును, ప్రభుత్వాధికారములును స్వజనప్రాధాన్యముగను రాజాధీనముగను నొప్పుచుండెడివి.

సిడ్నేవీనుకృత (India on the eve of British Conquest) చరిత్రమం దీవిధముగ బాజీరావు నైజాములకుఁ గల తారతమ్యములు వర్ణింపఁబడి యుండెను.

Baji Rao, though a skilful politician and profound statesman, was at the same time a comparatively straight-forward, plain spoken soldier, prompt to act—a man for word and blow. Nizam-ul-mulk, though especially in early life bold as a lion, when his passions were aroused and terrible as fate when he deemed the time for action come, was habitually cautious, given to a variety of expedients, fond of entangling his adversaries in a net work of diplomacy, and of reducing their strength by cunningly fomenting dissensions among their followers. pp 185.

Baji Rao's attitude was simple, loyal, and at the same time popular: in extending his own conquests he deffered habitually to the Raja's authority and through his father's wise arrangements, promoted the interests of the whole community. That, in doing so, he should gradually supplant his master in effective influences and establish, on behalf of his own family, what amounted to a feudal hegemony, if not a sovereignty, was natural, but did not involve a daily practice of crafty device, or studious inevitable from Nizam-ul-Mulk's ambiguous position. pp 186-7"

## శ్రీమద్బ్రహ్మేంద్రస్వాములవారిచరిత్రము.

వీరేంద్రుఁడు, సింహవిక్రముఁడు, రాజతంత్రజ్ఞుఁడు, అపరసరస్వతీబిరుదాంకితుఁడునగు పేస్వాబాజీరావునకు బ్రహ్మేంద్రస్వాములవారు గురుపరబ్రహ్మమై యుపదేశముల నొసఁగుచుండెడివారు.

శ్రీస్వాములవారు, బరారుదేశములో "దూధేబాడీ" యనుగ్రామములో క్రీ. శ. 1649-వ సం॥ రములో జన్మించెను. ఈతనికి తలిదండ్రులు విష్ణుపంతని నామకరణ మిడిరి. విష్ణుపంతు తలిదండ్రు లాతనికి ద్వాదశవత్సరముల ప్రాయమైన నతిక్రమింపకుండ పరలోకగతులైరి. అంత నాబాలుఁడు విపన్నుఁడై మూఁడుసంవత్సరములు దేశపరిభ్రమణమునఁ గడిపి తుదకు విద్యాపీఠమగు కాశికాపురి కరుదెంచి వేదాంతశాస్త్ర మధ్యయన మొనర్చెను. ఆకాలములో శ్రీజ్ఞానేంద్రసరస్వతీ స్వాములవారు అనునొకపరమహంస మహిమమండితుఁడై కాశికాపురమున రాజిలుచుండె. విష్ణుపంతు వేదాంతశాస్త్రమాద్యంత మధ్యయన మొనర్చినపిమ్మట సంసార మసార మని

గ్రహించి, శ్రీజ్ఞానేంద్రస్వాములవారిశిష్యకోటియందుఁ జేరి, వారివలన బ్రహ్మవిద్యాదీక్షఁ బడసె. అంతటినుండి విష్ణుపంతు బ్రహ్మేంద్రస్వామియను నామమునఁ బ్రఖ్యాతుఁ డయ్యెను.

దీక్షాగ్రహణానంతరము బ్రహ్మేంద్రస్వాములవారు, ఉత్తరమున బదరీనారాయణమాది దక్షిణమున రామేశ్వర పర్యంతముఁ గలసమస్తతీర్థక్షేత్రసంతతులు సేవించి 1668-వ సం॥ రము కొంకణమున కరుదెంచిరి. కొంకణములో చిపలూనునకు సమీపమందున్న పరశురామక్షేత్రమను దివ్యక్షేత్రములో పండ్రెండువత్సరము లజ్ఞాతవాసియై ఘోరతపమొనర్చె. అనంతర మొకమఠమును స్థాపించె. ఈమఠస్థాపనానంతరము బ్రహ్మేంద్ర స్వాములవారు సర్వసాధారణముగ దేశీయులందఱి దృష్టి నాకర్షించిరి. శ్రీస్వాములవారు పరశురామక్షేత్రములో వాస మొనర్చుచుండినకతమున వారిని దేశీయులు కొందఱు పరశు రామబాబాయని కూడ వ్యవహరించిరి.

మహారాష్ట్రములోని ప్రసిద్ధసర్దారులందఱు శ్రీస్వాము లవారివలన భక్తిజ్ఞానమార్గముల నుపదేశపూర్వకముగఁ గొని వారిశిష్యవర్గ మలంకరించిరి. జంజీరాసిద్దీసర్దారులు కూడ వారి యెడ భక్తివిశ్వాసములు కలిగి ప్రవర్తించిరి. మహారాష్ట్రాధి పతి సాహూ, తచ్ఛ్వారసామంతసర్దారులును భగవదర్పితముగ శ్రీస్వాములవారు ప్రతిష్ఠించినమఠమునకు సుమారు పదునాఱు వేలముద్రల వార్షికాదాయ మొసఁగెడి భూప్రదేశమును దాన పూర్వకముగ సమర్పించిరి. తదితరులు సమర్పించిన గజాశ్వ రథగోవృషభములసంఖ్య గణనాతీతము. శ్రీస్వాములవారి నిర్యాణానంతరము తన్మఠకోశములో సుమారు పండ్రెండు

లక్షలరూప్యముల కధికమూల్యము గలరత్నఖచితస్వర్ణాభరణములును పదునాలుగులక్షల ఆఱువందల ముప్పదియేడురూప్యములనగదును గలిగి యుండె నట. శిష్యవర్గ మర్పించిన ద్రవ్యములో విశేషభాగము సర్వజనోపయోగములగు కార్యములకై వెచ్చించుచు శేషించినదానిని దేవసేవకును మఠరక్షణకును దాచియుంచెను. మహారాష్ట్రమందు పెక్కుస్థలములలో దేవాలయములు మఠములు, ధర్మశాలలు, బావులు, తటాకములు, తోఁటలు, బాటలు, విద్యాశాలలు, వైద్యాశ్రమములు మొదలుగాఁగల ప్రతిష్ఠానిర్మాణములకొఱకు సుమారు ఎనిమిది లక్షల రూప్యములను వ్యయ మొనర్చిరఁట.

శ్రీస్వాములవా రతులధనసంపత్తి గలిగి మఠాధిపత్యమును వహించి రాజమహారాజులను శిష్యవర్గమునఁ జేర్చికొని విరాజిలుచున్నను, నేటికాలపుస్వాములవలె సుఖలోలురై భోగపరాయణులై, స్వధర్మమును విడనాడినవారు కారు. వారు గోమూత్రము దప్ప వేఱొకపదార్థము భిక్షఁగొనినవారు కారఁట.

పేష్వబాలాజీవిశ్వనాథపంతు శ్రీస్వాములవారి కృపాదృష్టికిం బాత్రుఁడై మంత్రోపదేశమును వడయుటయే కాక వారియాదేశముననే కొంకణమును పరిత్యజించి సితారానగర మరుదెంచి రాజకర్మచారగణము నలంకరించెను. స్వాములవారి కృపాదృష్టి బాలాజీవిశ్వనాథునియెడలను, ఆతనిసంతతియెడలను నతిశయముగఁ బ్రసరించుచుండెడిది.

శ్రీస్వాములవారివలనవారి ప్రియశిష్యుఁడగు బాజీరావు మఱికొందఱుసర్దారులు లక్షలకొలఁది రూప్యములను ఋణ

ముగఁ గైకొనుచుండెడివారు. స్వాములవారు దేశభ్రమణ మొనర్చుచు నాయాప్రాంతములలోని జీర్ణదేవాల యోద్ధారణమునకునై యాయాజమీందారుల కాదేశ మొసంగుచుండెడి వారు. వారు స్వధర్మస్వరాజ్యోన్నతుల గూర్చి విశేషముగఁ బాటుపడినవారనుటకు సందియము లేదు. కొంకణమందలి సిద్దీ బుడతకీచునాయకుల శాసనోచ్ఛేదన సాధనముల నుపదేశించుచు పలుసారులు నానా ఫడ్నవీసు బాజీరావు చిమణాజీలను పురికొల్పియుండె. బొంబాయినగరమున కేగి యందలి యాంగ్లేయులను గలిసి, వారిసహాయము సిద్దీలకును బుడతకీచులకును నలనడకుండఁ జేయుటకై పలుయత్నము లొనరించెను. విధర్ములతోడియుద్ధమున నుత్తేజితులగుటకై మహారాష్ట్రసేనానులకు రామాయణమహాభారతములలోని వీరేంద్రులతో సమత్వమారోపించి పత్రములను లిఖించి పనుపుచుండెడివారు. విజయసేనానులను దైవానుగ్రహఫలమని ప్రత్యేకాయుధముల నొసఁగి సత్కరించుచుండిరి. వారు ధర్మరక్షణ, దేశహితస్వరాజ్యోన్నత్యముల నభిలషించి ప్రవర్తించుచుండెడివారైనందున, వారియుపదేశము దైవాదేశమని యెల్లరు పరిగణించుచుండిరి. మహారాష్ట్రనారీమణులు తమపతిపుత్త్రాదుల మంగళాభిలాషప్రేరణమున వారియాశీర్వాదప్రసాదములు వేడుకొనుచు వారికడకుఁ బత్త్రముల ననుపుచుండిరి. శ్రీస్వాములవారు వారియెడ మాతృభావ మూని వారికోరిక లీడేర్చుచు ధర్మసంస్థాపనానుకూలోపదేశ మొసఁగి సత్కరించుచుండెడివారు. వారెల్లరు స్వాములవారిని భార్గవావతారులని పరిగణించుచుండిరి. వారియాజ్ఞఁ బాలించుటలోనేరైన వెనుకముందు త్రొక్కులాడుచుండినయెడ, వారు శరీరపోషణార్థముగఁ గొనియెడిగో

మూత్రపానమును పరిత్యజించి శుష్కోపవాసములు సలుపుచుండిరి. ఆకారణమున వారు వారిజీవితకాలములో నధికాంశము నిరశనవ్రతములతోనే ముగించియుండిరి. స్వాములవారి క్రోధవృత్తాంతము కర్ణగోచరమగుటయే తడవుగ సాహూపాత్రమిత్రులతో వారికడకేగి వారిక్రోధాగ్నిఁ జల్లార్చుయత్నమునఁ బ్రవృత్తుఁ డగుచుండెడివాఁడు.

బాజీరావు చిమణాజీల సుగుణగణము స్వాములవారి హృదయ మాకర్షించి మించినందున వారియెడ స్నేహవాత్సల్యము లగ్గలము లయ్యెను బాజీరావు వడసినవిజయములు స్వరాజ్యాభివృద్ధి కొనరించిన యత్నములు శ్రీస్వాములవారొసంగిన ఋణసహాయసాధితములు.

బ్రహ్మేంద్రస్వాములవారు ప్రతివత్సరము శ్రావణశుక్లచతుర్దశీదినమున సమాధిస్థులై యోగ మవలంబించి భాద్రపదశుక్లచతుర్దశీదినమున యోగవిసర్జన మొనర్చుచుండెడివారు. ఆసమయమునకు సాహూ సపరివార మరుదెంచి వారిదర్శన మొనర్చి ప్రసాదాశీర్వాదములఁ జేకొనుచుండెను.

బాజీరావు పరలోకగతుఁడైన మరుచటిసంవత్సరములో (క్రీ. శ. 1741) చిమణాజీ యిహలోకమును వీడెను. అంతట స్వాములవారు తమప్రియశిష్యు లిరువురివియోగమునకు సహింపనేరక యచిరకాలములో వైకుంఠధామ మలంకరించెను.

బాజీరాయనిచరిత్రము సమాప్తము.

---

చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1924.

# వైద్య గ్రంథములు.

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| అమావాస్యాతర్పణము | ... | 0 | 2 |
| ఆపస్తంబగృహ్యసూత్రములు | ... | 0 | 3 |
| ఆంధ్రద్రావిడసంధ్యావందనము | ... | 0 | 3 |
| ఋగ్వేదశ్రాద్ధప్రయోగము, చిన్నసైజు | ... | 0 | 6 |
| ఋగ్వేదసంధ్యావందనము, సటీక | ... | 0 | 3 |
| తిథిమంత్రములు, (ఆరాధ్యులది) | ... | 0 | 3 |
| దేవతార్చన, చిన్నసైజు | ... | 0 | 2 |
| పంచసూక్తములు, సస్వరము | ... | 0 | 3 |
| పంచోపనిషత్తులు, తైత్తిరీయము,సస్వరము | ... | 0 | 12 |
| పంచోపనిషత్తులు, బ్రహ్మమేధసహితము | ... | 0 | 6 |
| పితృతర్పణము, చిన్నసైజు | ... | 0 | 2 |
| బ్రహ్మయజ్ఞము, సస్వరము | ... | 0 | 3 |
| మహాన్యాసము, సస్వరము, చిన్నసైజు | ... | 0 | 12 |
| మంత్రప్రశ్నములు, మూలము | ... | 0 | 3 |
| డిటో సస్వరము (పితాగ్నికాండ) | ... | 0 | 6 |
| తైత్తిరీయ ఆరణ్యకోపనిషత్తులు, పితృమేధము, మంత్రప్రశ్నములు సహా, సస్వరము. | ... | 3 | 0 |
| మంత్రపుష్పము, సటీక | ... | 0 | 2 |
| యజుర్వేదసంధ్యావందనము, మూలము, సస్వరము | ... | 0 | 3 |
| శ్రీవైష్ణవాహ్నికము, చిన్నసైజు | ... | 0 | 8 |
| యజుర్వేద ఆబ్దికమంత్రములు, మూలము | ... | 0 | 8 |
| యజుర్వేదసంధ్యావందనభాష్యము | ... | 0 | 12 |
| డిటో పురుషసూక్తము, శ్రీసూక్తము, ఆంధ్ర టీకా తాత్పర్యము. | ... | 0 | 6 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| ఋగ్వేదపూర్వప్రయోగాదర్శము | ... | 3 | 8 |
| శ్రీవైష్ణవశ్రాద్ధప్రయోగము | ... | 0 | 6 |
| రుద్రము—నమకము, చమకము, సస్వరము | ... | 0 | 3 |
| రుద్రాధ్యాయము, భాష్యటీకాసహితము | ... | 1 | 8 |
| సూర్యనమస్కారము, చిన్నసైజు | ... | 0 | 2 |
| సత్యనారాయణవ్రతకల్పము, క్రొత్తకూర్పు | ... | 0 | 8 |
| వ్రతరత్నాకరము, ప్రథమభాగము | ... | 0 | 12 |
| „ ద్వితీయభాగము | ... | 1 | 21 |
| వ్రతచూడామణి, (సంస్కృతము) చక్కనిప్రతి | ... | 2 | 8 |

## జ్యోతిషగ్రంథములు.

| | | | |
|---|---|---|---|
| 60 సంవత్సరముల పంచాంగము (1867-1926) పఱుకు | ... | 10 | 0 |
| అష్టకవర్గు, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 4 |
| ఆరూఢరత్నసిద్ధాంజనము | ... | 0 | 12 |
| కాలామృతము, టీకాతాత్పర్యవ్యాఖ్యానసహితము | ... | 2 | 0 |
| కృష్ణవాస్తుశాస్త్రము, అను వాస్తుసారసంగ్రహము | ... | 1 | 0 |
| జలార్గళశాస్త్రము, ఆంధ్రటీకాసహితము | ... | 0 | 6 |
| జాతకచంద్రిక, గోపాలరత్నాకరము, సాంధ్రతాత్పర్యము | | 0 | 12 |
| పుష్పబంధము, సాధారణప్రతి | ... | 0 | 8 |
| బృహద్యోగరత్నాకరము, తెనుగువచనము | ... | 0 | 12 |
| బృహజ్జాతకము, ఆంధ్రటీకాతా॥ వ్యా॥ సమేతహి | ... | 3 | 8 |
| మయవాస్తువు „ | ... | 0 | 4 |
| భృగుసూత్రములు „ | ... | 0 | 6 |
| నక్షత్రచూడామణి, చక్కనిప్రతి | ... | 0 | 6 |
| భావార్థచంద్రిక, ఆం॥ టీకా॥ తా॥ | ... | 1 | 0 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| ముహూర్తదర్పణము, సటీక | ... | 2 | 0 |
| రెట్టమతశాస్త్రము, సాంధ్రతాత్పర్యము | ... | 1 | 0 |
| లఘుజాతకము ,, | ... | 1 | 4 |
| వృద్ధపారాశర్యము, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 12 |
| వనమాల (వర్షఫణి) ,, | ... | 0 | 4 |
| వాస్తుసర్వస్వము ,, | ... | 0 | 6 |
| షోడశప్రశ్నరత్నావళి, నెపోలియన్ అనుష్ఠించిన ప్రశ్న గ్రంథమునకు తెనుఁగు | ... | 0 | 4 |
| సర్వార్థచింతామణి, సటీక | ... | 5 | 0 |
| కేరళప్రశ్నము, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 4 |
| గౌళిశాస్త్రము, తెనుఁగు | ... | 0 | 3 |
| భప్పన్నము, ప్రశ్నశాస్త్రము, తాత్పర్యసహితము | ... | 0 | 6 |
| సనత్కుమారగృహవాస్తువు, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 4 |
| సనత్కుమారశిల్పశాస్త్రము ,, | ... | 0 | 4 |
| సారావళి, సాంధ్రతాత్పర్యము | ... | 3 | 8 |
| శకునశాస్త్రము, (శిఖినరసింహశతకము) | ... | 0 | 4 |
| స్వప్నశాస్త్రము ,, | ... | 0 | 3 |
| సాముద్రికశాస్త్రము, సటీక | ... | 0 | 6 |
| డిటో తెనుఁగుపద్యకావ్యము | ... | 0 | 6 |
| హోరారత్నమాల, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 12 |

ఇంకను అనేక సంస్కృతాంధ్రగ్రంథములు, వాచకములు, నిఘంటువులు, నాగరిలిపిగ్రంథములు మావద్ద దొరకును.

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.

